# KAVYA SUDHA

(Selections in Telugu Prose & Poetry)

## PART II FOR FORM V

( In accordance with the finalised Syllabus of the Reorganized Secondary School Course )

*Editors*

NAYANI SUBBARAO, B. A., B. Ed.,
G. JOSHUA KAVI
P. BALA KRISHNA REDDY

**PRABHU & CO.,**
Educational - Publishers
GUNTUR

శ్రీ మల్లంపల్లి. సోమశేఖర శర్మ గారికి.
ప్రేమపూర్వకముగా.
సంపాదకులు

# కావ్యసుధ

( రెండవభాగము - ఐదవఫారము )

సంపాదకులు

నాయని సుబ్బారావు, బి. ఏ., బి. యిడి.,
ప్రధానోపాధ్యాయులు మ్యునిసిపల్ హైస్కూలు,
నరసరావుపేట

ఉభయభాషాప్రవీణ, కవికోకిల
జి. జాషువ కవి.
తెనుగు పండితులు, వినుకొండ.

విద్వాన్
పూతలపట్టు బాలకృష్ణారెడ్డి,
తెనుగు పండితులు, బోర్డు హైస్కూలు, చిత్తూరు

ప్రభు అండు కో.,
విద్యావిషయక ప్రచారకులు
గుంటూరు



[ వెల 1—8—0

# ప్రకాశకుల మనవి

4417 *

ఈ "కావ్యసుధ"ను; మద్రాసు ప్రభుత్వమువారిచే 1949వ సం॥ నందు ప్రచురింపబడి పునఃపరిశీలనా నిర్ణయమైన పాఠ్య ప్రణాళిక (In accordance with the finalised syllabus of the Reorganized Secondary school Course.) ననుసరించి గ్రథింపబడినది. ఇది ఉన్నతపాఠశాలావిద్యార్థుల కుపయుక్తములగునట్లుగా తీర్చిదిద్దినాము

ఈ కావ్యసుధలో, అమూల్యములైన తిమతమ గద్య పద్యాత్మకరచనలను ముద్రించుకొనుటకు దయతో ననుమతి నొసంగిన రచయితలందరకు మా కృతజ్ఞతా పూర్వక నమోవాకము లర్పించుచున్నాము .

ఈ 'కావ్యసుధా' నిర్మాణములో మాకమూల్యమైన సలహాలొసంగిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారికిని, అత్యంతము సహాయభూతులైన శ్రీ ధనకుధరం వేంకటాచార్యులుగారికిని మాకృతజ్ఞతాపూర్వక ప్రత్యేక నమోవాకము లర్పించుచున్నాము.

——

ములను భావించుట, తన నివాస క్షేత్రము నెన్నికచేయుట వలన తనలోని విద్యాశక్తులు వికసించును. అపుడే ఆర్ద్రహృదయము కలుగును, సమర్థత లభించును. పరిచయము వలననే మానవుని సజ్జన మర్జనతలు విస్పష్టము లగును. అపుడే చక్కని ఉపదేశ మందింప వలయును. దాన తమ దుష్ట భావములు పోయి అహింసాత్మకమైన పరివర్తనము కలుగును. జ్ఞానజ్యోతి హృదంతరాళములలో ప్రకాశించును. 'కావ్యసుధ' విద్యార్థులను దేశహితకాంక్షులుగా చేయదలచుకొన్నది.

సమాజ క్షేమమునకు తమలోని స్వార్థము తగ్గించుకొనుట, ఎన్నికష్టములనైనను అనుభవించుట, లోకమున కలవడినపుడే మిత్ర భేదము లన్నియు నశించును. అపుడే విజయ లాభము కలుగును. ప్రాచీన వైభవమును పునరుజ్జీవింపచేసి గొప్ప పరివర్తనము సంపాదింప వచ్చును. ఎల్లెడ కలిగిన భావదాస్యమును నిర్మూలించి, భావ దీప్తిని పొందినవారిని సంభావించుచు కాలచక్రములో కలిగిన పరిణామమును, ప్రకృతి స్థితిని భావింపగలము. గుహాభ్యంతరము లందున్న కళాసంపదలనుగూడ అనుభవములోనికి దెచ్చుకొని భారతీయ విశిష్టతను మధురగాన మొనర్చి సమాజమునకు సమైక్యము నుద్బోధింప గలము. 'కావ్యసుధ' మధురాస్వాదమిచ్చి విద్యార్థి లోకమునకు తుష్టిని, పుష్టిని సమకూర్చి, భారత భవిష్యద్భాగ్య సంధాతలుగా నొనర్ప గలదని విశ్వసించు చున్నాము.

సంపాదకులు.

---

# విషయసూచిక.

## పద్యసాహిత్యము—



## గద్యసాహిత్యము—



**కంఠస్థము చేయవలసిన పద్యములకు * ఈ గుర్తు పెట్టబడినది.**

2 అభియోగము (4, 16, 18 పద్యములు)
3 పరాభవము (2, 7, 15, 17 పద్యములు)
4 అగడము (2, 10, 21 పద్యములు)
6 మత్సరము (1, 2, 15 పద్యములు)
7 పసిడితునకలు (4, 7, 8 పద్యములు)
8 వేగిక్షేత్రము (4, 9, 11 పద్యములు)
9 విద్యారణ్యులు (1, 2, 8 పద్యములు)
10 సానుభూతి (6, 7, 8 పద్యములు)
11 పరిచయము (3, 4, 8 పద్యములు)
12 పరివర్తనము (2, 3, 4, 7 పద్యములు)

# కావ్యసుధ

## ఐదవ ఫారము

### 1 తెనుగుతల్లి — శ్రీ నాయని సుబ్బారావు

[పాఠ్యభాగము శ్రీ నాయని సుబ్బారావుగారు వ్రాసిన 'తెనుగుతల్లి' అను ఖండకావ్య సంపుటి. శ్రీ సుబ్బారావుగారు ప్రస్తుతము నర్సరావుపేట మ్యునిసిపల్ హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. వీరి కవిత్వము భావనారసపూర్ణము. హృదయము జీల్చుకొని బైటికిదూకు వీరి పద్యములు హృదయంగమములు. 'సౌభద్రుని ప్రణయయాత్ర' 'మాతృగీతాలు' వీరి ఇతర పద్యకృతులు]

తఱుగని వాత్సల్యము పా
తర త్రవ్విన గతి, దయార్ద్ర తరళ దృగంత
స్ఫురణమ్మున, మా హృదయాం
తరములు, గుత్తగొను, తెన్గుతల్లికి, జేజే! 1

కృష్ణాపవిత్ర వార్ధృత, సారసస్య సం
భరిత భూ భాగమ్ము, భద్రపీఠ-
పాదపీఠము, దక్షిణోదధివీచీ స
మావృతాగ్రమ్ము కన్యాకుమారి-
గంగా తరంగాగ్ర గళిత శీకరసిక్త
మహిత ధాత్రి కిరీటమండనమ్ము-
ఆజాను దీర్ఘ బాహానాళ ద్వ
యమ్ము, ప్రాక్పశ్చిమాహార్యపంక్తి

ఇరుగడలనుండి సాగి, మిన్నెగసి, పొంగు
జలధి లోలోర్మికా ఫేన, చంక్రమణము
తో సరియులేని, కీర్తి హల్లీసకములు
గాగ, వెలుగొందె, నొకనాడు, కన్నతల్లి! 2

ప్రథిత సామ్రాజ్య నిర్మాణక్రియా ప్రౌఢి
తెనుగు జెండా సర్వదిశల నాటి,
వాణిజ్యశక్తి, సప్త మహాంబునిధులందు,
తెనుగు సంద్రమ్ములు, దిద్ది తీర్చి,
వేదమ్ము, సుస్వరాన్విత పఠిష్ఠమ్ముగా,
తెనుగు పాండిత్యమ్ము తేజుకొల్పి,
దివ్య సౌందర్యవర్ధిత, భావనాశక్తి,
తెనుగు శిల్పము, పవర్ధిత, మొనర్చి

ఆరు ఋతువుల భూరి సంభార, మొల్ల
పేర్చి, నాగేటి కఱ్ఱున, పెళ్ళగించి,
నేల బంగరు పంట పండించి, మెఱసె
సునిశిత ప్రతిభాశాలి, తెనుగు బిడ్డ! 3

ఆబాలగోప చిత్తానంద సంధాయ
కముగా, మహాపురాణములు సెప్పి,
అతిపురాతన చరిత్రౌన్నత్య సందీప
కముగా, ఘనేతిహాసములు విప్పి
నందనారామ సుందర పారిజాత గం
ధముగా, రసప్రబంధములు, కూర్చి
నవనవాద్భుత కల్పనా సమున్నత కళా
వధిగా, బృహత్కథానవలు, తీర్చి

భీష్మ డభిమన్యు, డాదిగా విదిత శౌర్యు
లైన, భారతయోధుల, కచ్చమైన
తెనుగువీరులమూర్తి, కల్పన మొనర్చి,
దివిజకవి సన్నుతుండయ్యె, తెనుగు సుకవి, 4

దేశము మట్టి యల్పమని, తీర్పు నుపాశకవి తీర్చెగాక, నా
దేశము మట్టి నా కమరధేనువు, ప్రాక్తన భవ్యసంస్కృతి
శ్రీశిశుకమ్ము లిట్టివని చెప్పగరాని పురానుభూతి ని
ర్దేశపథమ్ములన్, జలదరించును నాయెద, దీనిభావనన్. 5

శతపత్ర మకరంద సారమ్ము శిశిరస్తు
శీతల మ్మాలోక నాతిరమ్య
శబల, మీమట్టి, రాజసతామసక్రియా
శ్లథమాన మానసవశాంతిపర్వ.
మిందు పుట్టుల గిట్టు లే పురాకృతపుణ్య
పరిపాకవిస్తార వైభవంబొ,
వర్ణవైషమ్యముల్, వర్గ విద్వేషముల్,
సకల వికారముల్, సమయ జేసి

తరతరాలుగా పేరిన, తల్లిమట్టి,
సర్వజనతా సమైక్య సత్సాధనమ్ము
గాగ, తలపోసి, నిశ్చల గాఢరక్తి,
హృదయమున నత్తుకొందు, నభ్యుదయకాంక్ష. 6

అమ్మల యమ్మ భారతి మహాజనయిత్రి, దురంత దాస్య బం
ధమ్ముడివో, స్వరాజ్య మధనమ్మున పేర్చిన చోట, శత్రు వ
ర్గమ్మధరీకృతమ్ముగ, విరాజిలవే ప్రధనాగ్రసీమ, మా
యమ్మ! తెనుంగులమ్మ! విజయాంకసనాథ గభీర మూర్తివై. 7

నీవు పురాణ దేవతవు, నీ చరితమ్ము సమస్త విశ్వ సం
భావిత కీర్తి మన్మధుర మంగళగీతము లబ్ధ రాష్ట్ర సం
జీవి ననంత సత్త్వులయి, నీ వరదాభయ హస్త లాలన
శ్రీ విభవుల్ తెనుంగులు, వరింతురు, సర్వశుభ ప్రపంచముల్. 8

---

# 2 అభియోగము 



(విరాటపర్వము ద్వితీయాశ్వాసము)

[పాఠ్యభాగము 'తిక్కన' యాంధ్రీకరించిన మహాభారతము విరాటపర్వము ద్వితీయాశ్వాసము లోనిది. భారతమును సంస్కృతమునందు రచించినవాడు వేద వ్యాసుడు. దీనిని నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడలు తెలిగించిరి. వీరికి కవిత్రయ మని పేరు. పదునెన్మిది పర్వముల మహాభారతమునందు తిక్కన పదునేను పర్వముల నాంధ్రీకరించెను. తిక్కన పదమూడవ శతాబ్దమునందు నెల్లూరు పట్టణమును పరి పాలించిన మనుమసిద్ధినృపాలుని అమాత్యులలో నొకడు. ఈయనకు 'కవిబ్రహ్మ' ఉభయ కవిమిత్ర' యను బిరుదములు గలవు.

శబ్దము, దానియర్థము బాగుగా గుర్తెరిగిన వాడు తిక్కన. ఇతని కవిత్వమంతయు గంభీరభావస్ఫోరకముగా నుండును. పాత్రపోషణము నందు అందెవేసినచేయి. ఈయన ముప్పాతిక మూడువంతులు తెలుగు పదములను వాడినాడు. 'నిర్వచనోత్తర రామాయణ' మితని యితర కృతి.

కీచకునిచే పరాభవింపబడిన ద్రౌపది విరటుని సభకు వచ్చి తన పరాభవమును విన్నవించుకొనుట ప్రస్తుత కథాంశము.]

ఉ॥ పంబిన కోపమున్ సమయభంగ భయంబును సగ్గలించి యు
ల్లంబు పెనంగొనంగ బతులన్ దగ సభ్యుల జూచుమాడ్కి రూ
క్షంబగు చూడ్కి నాద్రుపదుకన్నియ సూచి సభాజనప్రతా
నంబున మత్స్యనాథుడు వినంగ నెలుంగు చలింప నిట్లనున్. 1

సీ॥ నిఖిల ధర్మాధర్మ నిపుణంబులైన శు
ద్ధాంతరంగంబుల నతిశయిల్లి
శిష్టసంరక్షణ దుష్టనిగ్రహముల
నీతివాటింపంగ నేర్పు గలిగి
సకల శస్త్రాస్త్రసంచయముల బరమాద్భు
తంబు సేయు పరిశ్రమంబు దాల్చి
దుర్దమప్రతిభట మర్దనక్రీడమై
జతురులు నా నెందు నుతికి నెక్కి

తే॥ యున్న గంధర్వులేవురు నన్ను నిట్టు
లొకడు పలుపంగ నూరక యునికి సూడ
నచ్చెరువుగాదె యెవ్వరి యాంద్రు రింక
బరిభవంబున బొందక బ్రతుకువారు॥ 2

క॥ ఈ నరపతి యాస్థానము
లో నొక్కరుడైన ధర్మలోప భయమునం
బూని తగవైన వెడ వలు
కైనను బలుకంగ జాల డయ్యోడు నకటా! 3

ఉ॥ ఇందరు జూడగా నిచట నిమ్మెయి నన్ను బతివ్రతా గుణా
స్పందిత వర్తనం బరమసాధ్వి ననిందితశీల గీచకుం
డొందును నెట్టి యంగనల నెవ్వరు జేయని యట్లు సేయగా
గొందలమైన నిప్డు కృపకుం దఱిగాదటె? యేమి సెప్పుదున్. 4

ఉ॥ ఐనను మత్స్యదేశమున యాజ్ఞ కితం డొడయుండు గాన నా
కీ నరనాథు డూఱడగు నెయ్యెదియేసి నధర్మ మెవ్వ రెం
దైన నొనర్చినం బ్రభువులారసి దండన మాచరింతు రి
చ్చో నను దన్న గీచకునిజూచియు నూరక యుస్కి పాడియే. 5

చ॥ అనుడు విరాటు డుల్లమున నక్కటికం బొలయంగ నంగనం
గనుగొని కీచకుం గినియగా దగుసత్త్వము లేమి జేసి సాం
త్వనములు పల్కి రోషభరితస్థితి గంపితమూర్తియైన యా
తనిమది కుందువాపిన నతండును బోయె నివాసభూమికిన్. 6

అట్టి యవసరంబున 7

సీ॥ శుభలక్షణాంగి యీ సుందరి సైరంధ్రి,
యగు బెట్లుకో యని వగచువారు
నిమ్మేని కక్కట యిట్టిది సేసెనే
మాయ దైవంబని మఱుగువారు

ఇంత కీడొనరించెనే రాజు సూడ నీ
దుష్టాత్మకుండని దూఱువారు
దేవి యుపేక్షయ చూపె న్యాయమునకు ని
ష్పాటు వచ్చుటయని ప్రందువారు

తే॥ నగుచు సభవార లందఱు నంత నంత
నల్ల నల్లన గుజగుజ లాడుచుండి
యుల్లములనుండి ఖేదంబు వెల్లివిరిసె
నాగి మోముల విన్నదనంబు గదుర. 8

ఉ॥ అప్పుడు ధర్మసూతి హృదయంబు కలంగి లలాట భాగమున్
గప్పగ ఘర్మవారి యధికంబుగ రోషము నొంది యుండియున్
దప్పక ద్రోచికొంచు దనధైర్యము పెంపున నిర్వికారుడై
యెప్పుడు దానుబల్కునెలు గేర్పడ బ్రాపడ కోడ నిట్లనున్ 9

సీ॥ జననాయకుండు నీ సభవారు నిదరు,
తెలుగెల్ల నెఱిగిరి తెలుప యింక
మానక యీపలు మాట లాడగ నేల,
చనుము నీవు సుధేష్ణ సదనమునకు
నీ పరాభవమునఁ గోపింప నేరరే,
గంధర్వులకుఁ దలిగాదు గాక
సమయ మెయ్యది యేసిఁ దమకును నీకును,
మునుగల్గి నట్లైనఁ గినియ రిచట

తే॥ గాన నాథుల దూఱంగఁ గాదు జనుము,
సతికిఁ దానెంత వడియును సభలలోనఁ
దడవుగా నిల్చి యిట్లు లజ్జ నగవృత్తి
శంకనెడి ధిక్కరింపంగఁ జనునె చెపుము. 10

వ॥ అని యిట్లుసెప్పిన ధర్మతనయుని పలుకులు విని యెండియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినం జూచి యతండు మఱియు నిట్లనియె 11

క॥ పలుపోకలం బోవుచు, వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువచందము,
దొలంగంగ నిట్లునికి దగునె తోయజవదనా. 12

వ॥ అనినవిని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కిట్లనియె. 13

ఆ॥ నాదువల్లభుండు నటుండింత సిక్కంబు,
పెద్ద వారియట్ల పిన్న వారు
గానం బతులవిధము కాక యే శైలూషిం
గా ననంగ రాదు కంకభట్ట. 14

వ॥ అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండ కాండు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కడిది యనుచు నచ్చోటు వాసి తనచిత్తంబున. 15

ఉ॥ నన్నిటు లాదురాత్ము సదనంబునకుం జనుమన్న జంత కీ
* బన్నము లన్నియుం దెలిపి ప్రేయిడనే యని పోయె నార్తయై
కన్నుల బాష్పపూరములు గ్రమ్మంగ మోమున దైన్యమొందంగా
నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుధేష్ణ పాలికిన్. 16

తే॥ చనిన నయ్యేలనాంగయు సంభ్రమంబు
దెచ్చికొని తా నెఱుంగని తెఱంగు దాల్చి
శౌర్యమున నుమ్మలించి పాంచాలి తోడ
నెలుంగు వేఱొకభంగినా నిట్టులనియె. 17

సీ॥ ధరణి పరాగంబు పొరసి ధూసరితమై
చేడియ నీమేను చెన్ను దఱుఁగఁ
జిత్తంబు తలపోఁతచే వాడు పొదవిన,
చెలువ నీ నెమ్మోము చిన్నఁబోయెఁ
* ప్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి,
యుగ్మలి నీ కురు లొప్పఁగందెఁ
గన్నీరు వఱ్ఱోడ్డి కాంతి యెంతయుఁ గొన్న,
వెలఁది నీకనుఁగవ విన్ననయ్యె

ఆ॥ నేది కారణముగ నెవ్వ రెచ్చోట నీ
కేమి కీడొనర్చి రెట్టి పాటి
సాహసికులో వారిఁ జంపుదు నొంపుదు,
భంగపఱుతు నిడుమపఱుతుఁ జెఱుతు. 18

---

## 3 పరాభవము — బమ్మెర పోతన

[పాఠ్యభాగము 'బమ్మెర పోతనామాత్యుఁడు' ఆంధ్రీకరించిన భాగవతము ప్రథమ స్కంధములోనిది. భాగవతమును సంస్కృతమునందు రచించినవాఁడు వేదవ్యాసుఁడు. పోతన క్రీ॥ శ॥ పదునేనవ శతాబ్దమునాటివాఁడు. ఈయనకు 'సహజపాండిత్య' యను బిరుదముగలదు. ఈయన కవిత్వము మృదుమధురములగు పదముల కూర్పుతో, లలిత లలితములగు సమాసములతో, అంత్య ప్రాసలతో కదనుద్రొక్కి భక్తి రసావేశమయమై యుండును. ఇతఁడు తన గ్రంథమును నరాంకితముచేయుట కిచ్చగింపక యిష్టదైవమగు శ్రీరామునకిచ్చి చరితార్థుఁడాయెను.

'భోగినీదండకము', 'వీరభద్రవిజయము' మొదలగునవి ఈయన యితరకృతులు.

ఉప పాండవులను చంపిన అశ్వత్థామను పాండవులు పరాభవించుట యిందలి కథాంశము.]

ఉ॥ మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల వధించె నిశీథమునందు గ్రూరుఁడై
పాఱుఁడుగాని పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూర్చుచున్
బాఱెడి వీని గావుము కృపామతి నర్జున పాపవర్జనా! 1

చ॥ వెఱచినవాని దైన్యమున వేడుకు నొందినవాని నిద్ర నై
మఱచినవాని సౌఖ్యమున మద్యము ద్రావినవాని భగ్నుడై
* పఱచినవాని సాధుజడభావమువానిని గావుమంచు వా
చఱచినవాని గామినుల జంపుట ధర్మముగాదు ఫల్గునా! 2

శా॥ స్వప్రాణంబుల నెవ్వడేని కరుణాసంగంబు సాలించి య
న్యప్రాణంబులచేత రక్షణము సేయంజూచు వా డంత్యలో
కప్రాప్తుండగు రాజదండమున సత్కల్యాణుడే నైన నీ
విప్రుం దండితు జేయనేటికి మహావిభ్రాంతిచే నుండగన్. 3

వ॥ అని యివ్విధంబున కృష్ణుం డానతిచ్చిన బ్రాహ్మణుండు కృతాప
రాధుండయ్యు వధ్యుండుగాడను ధర్మంబు దలచి చంపక ద్రుపద
రాజపుత్త్రికిం దనచేసిన ప్రతిజ్ఞం దలంచి బద్ధుండైన గురునందనుం
దోడ్కొని కృష్ణుండు సారథ్యంబుసేయ శిబిరంబుకడకువచ్చి 4

క॥ సురరాజసుతుడు సూపెను
దురవధిసుతశోక యుతకు ద్రుపదుని సుతకుం
బరిచలితాంగ శ్రేణిం
బరుష మహాపాశబద్ధ పాణిన్ ద్రౌణిన్. 5

వ॥ ఇట్లర్జునుండు దెచ్చిచూపిన బాలవధ జనిత లజ్జా పరాఙ్ముఖుండైన
కృపికొడుకుం జూచి మొక్కి సుస్వభావయగు ద్రౌపదియిట్లనియె

మ॥ పగఱ మా మగవారలందఱును ముక్త బాణప్రయోగోపసం
హారణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
* చిరి పుత్త్రాకృతి నున్న ద్రోణుడవు నీ చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపగా బాడియే. 7

క॥ భూసురుడవు బుద్ధిదయా
భాసురుడవు శుద్ధవీరభట సందోహా
గ్రేసరుడవు శిశుమారణ
మాసుర కృత్యంబు ధర్మమగునే తండ్రీ. 8

శా॥ ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును నీకు జేయరు బలోత్సేకంబుతో జీకటిన్
భద్రాకారుల బిన్నపాపల రణప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీ చేతులెట్లాడెనో ? 9

ఉ॥ అక్కట ! పుత్త్రశోక జనితాకులభార విషణ్ణ చిత్తనై
పొక్కుచు నున్న భంగి, నిను బోరగిరీటి నిబద్ధు జేసి నే
డిక్కడకీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయ మాత నే
డెక్కడ నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచు బొక్కుచున్నదో ? 10

వ॥ అని కృష్ణార్జునులం జూచియిట్లనియె. 11

ఉ॥ ద్రోణునితో శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్నదింటన
క్షీణతనూజ శోక వివశీకృతనై విలపించు భంగి, నీ
ద్రాణి దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంతపొక్కునో ?
ప్రాణవియుక్తుడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే. 12

క॥ భూపాలకులకు విప్రుల
గోపింపం జేయదగదు కోపించిన ద
త్కోపానలంబు మొదలికి
భూపాలాటవుల గాల్చు భూకంపముగాన్. 13

వ॥ అని యిట్లు ధర్మంబును, సకరుణంబును, నిర్వ్యాళీకంబును, సమంజ సంబును, శ్లాఘ్యంబునుంగా బలుకు ద్రౌపదిపలుకులకు, ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి. సమ్మతింపక భీముండిట్లనియె. 14

చ॥ కొడుకులబట్టి చంపెనని కోపమునొందదు బాలఘాతకున్
విడువు మటంచు జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీడువిప్రుడే
* విడువగనేల చంపు డిటు వీనిని మీరలు చంపరేని నా
పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెద జూడు డిందఱున్. 15

వ॥ అనిపలికిన,నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబువచ్చె.భీమునిసంరంభంబు
సూచి హరి చతుర్భుజుండయి రెండుచేతుల భీమునివారించి, కడమ
రెంటను ద్రుపదపుత్రికను దలంగించి, నగుచు భీమున కిట్లనియె.16

ఉ॥ అవ్యుడుగాడువీడు శిశుహంత; దురాత్మకు; డాతతాయి; హం
తవ్యుడు; బ్రహ్మబంధుడగు దప్పదు నిక్కము "బ్రాహ్మణో నహం
* న్తవ్య" యటంచు వేదముశ్రుతంబగు గావున ధర్మదృష్టి గ
ర్తవ్యము వీనిగాచుట యథాస్థితి జూడుము పాండవోత్తమా. 17

---

# 4 ఆగడము

నాచన సోమన

[పాఠ్యభాగము 'నాచన సోమన' రచించిన ఉత్తరహరివంశము లోనిది. ఇతడు క్రీ. శ. 13 శతాబ్దమునందలి వాడు. ఇతనికి 'సకల భాషాభూషణ' 'సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తి', 'సర్వజ్ఞ' అను బిరుదములుగలవు. ఈయన తిక్కన తరువాత తిక్కన యంతటి మహాకవి. ఈయన కవిత్వమునందు భావగాంభీర్యము ధారాశుద్ధి గోచరించును. జాతీయములను సమయోచితములుగా ఈయన కవిత్వమునందచ్చటచ్చట వాడినాడు. నరకుని దౌర్జన్యము ప్రస్తుత కథాంశము.]

మ॥ ఒక, నా డూర్వశి మాట పొందు నరకుం డూహించి; నాకాధి నా
యకునిం, దాపసముఖ్యు లధ్వరము చేయంబూని రావించు, చో
టికి దాబోయి, "ధరామరావతులు రెంటిం గొంటి, మీకెల్ల నే
లిక నై యుండెద, యాగభాగములు పాలింపన్ విభుండయ్యెదన్. 1

శా॥పాశిం బాఱగఁ దోలి, యంతకు దిశాపట్టంబు గావించి, పూ
ర్వాశా ధీశ్వరు వెన్నడిం జని, ధనాధ్యక్షున్ విభాళించి, కే
* లీ శస్త్రాస్త్ర విహారసార మెచటన్ లేకుండ నిర్మించితిన్-
మీ శాస్త్రంబుల నింక నెవ్వరి కగున్ మేలైన యజ్ఞాంశముల్? 2

క॥ మ్రొక్కులకుఁ దగుదుఁ - బూజల
కెక్కిన మంత్రార్థ విధుల కెల్లం దగుదుం-
జెక్కేల? యేను వెలిగా,
స్రుక్కక యాగముల కొరుక సొరఁగలవారే"? 3

చ॥ అనుటయు; సంయముల్, బదరికాశ్రమ వాసులు, గూడి వానికి
ల్లనిరి "సురాధినాయకుఁడ యాగము లేలెడు వాఁడు గాక-లా
వున బడు నయ్యె పేర్మి? యలవుం దగవుం దలపోయ కేల కూ
డని పని సేయ జొత్తు? వకటా! వికటాచరణంబు పాడియే? 4

క॥ మనుజాశనులట! బలులట!
మునులట! యాగంబులట! నమో విశ్వసృజే!
విన మింతకు మున్నెన్నఁడుఁ
గనికని కొత్త్రవ్వఁ డింటికంబము సేసెన్? 5

వ॥ అనుటయు నద్దనుజుండు. 6

క॥ "ఏలిక నౌదు-మఖాంశ
శ్రీలకు; నోరుఁదడవ నేల? 'శిరసుండఁగ, మో
కాలను సేసలు వెట్టుట'
బేలుదనము గాక; మీకు బెద్దఱికంబే? 7

క॥ త్రిదివ సుఖమ్ము, మఖమ్మున
గడియించు ఫలంబుఁ, 'దనకు గానని దయ్యం,
బెదిరికి వరమిచ్చు ననుట'
చదురే? యతఁడేగె మును దిశా పట్టముగాన్." 8

వ॥ అనుటయు నమ్మునీంద్రులు విడియనాడం దలంచి యతనితోడ 9

శా॥ "పాపాత్ముండవు, దానవుండవు, నినుం బాటించి యాగార్హుఁగాఁ
జేపట్టం దగునే మునీంద్రులకు; మాచేఁ జెల్లదీకల్ల-దు
* ర్వ్యాపారంబులు ధర్మకర్మములలో వర్తించునే?" నావుడుం
గోపాటోపగజంబు మానస సరః కోలాహలోత్సాహి గాన్. 10

చ॥ తన పరివారముం బిలిచి, దానవుఁ "డాశ్రమ సంభృతార్థముల్
గొనుఁడు! పరంపరాకమునకున్ మును యజ్ఞపశువ్రజంబులన్
దినుఁడు; కుమారికావితతిఁ దెండు బలాత్కృతి!" నంచు, నమ్మహా
మునులకు నెగ్గుచేసి, మదమోహమునన్ దనవీటికేగినన్. 11

వ॥ తదనంతరంబ 12

సీ॥ జడలు కంపలుపట్టి జరుగనీకున్న చో.
విడిపింప శిష్యుల వెదకువారు—
జన్నిదంబులు కాలి సంకెలలై పడఁ,
బెగఁదన్ని మిన్నక తిరుగువారు—
ముందటి దిక్కాఁడి మొలత్రాడుఁదవిలిన,
తోఁక గోచుల వెంటఁదూలువారు—
దగియెత్తి పోలేక దండంబులటువైచి,
"హా విధీ" యని చేతులార్చువారు—

తే॥ గడవసంబుల మోఁదిన గలఁగువారు—
వల్కలంబులు దోఁచిన వంగువారు—
జెఱలువోయిన వారల జీరువారు
నై-మునీంద్రులు గలఁగి; రయ్యాశ్రమమున. 13

చ॥ నరకునిచేత నిత్తెఱఁగునం బరిభూతికి భాజనంబులై;
హరి కెఱిఁగింత మీ బదరికాశ్రమ దుర్భర బాధలంచు, న
ప్పరమ మునీంద్రులందఱు, గృపాపరతంత్రుని, యాదవాన్వయాం
బురుహ దివాకరుం, గొలువఁ బోయిరి; వేడుక తోడుపాటుగాన్. 14

గీ॥ అరుగునెడ, భరద్వాజ, కాశ్యప, వసిష్ఠ
వామదేవ, జాబాలి, కణ్వ, బృహదశ్వ,
ధూమ్ర, ముఖ్యులు దనుజారి తొల్లి చవులు
గన్న బదరీఫలంబులు గానుకలుగ 15

క॥ "తెండనుచు; దుష్టదానవ
ఖండిత యాగోపకరణ ఘనభారంబుల్
తెండనుచు; వేగమే చను
దెండనుచున్;" శిష్యులకును దెలియఁబలుకుచున్. 16

మ॥ చని, వారందఱు దేవతారచిత పంచక్ష్మాధరాంత స్థలం
బున నొప్పారెడు పేడు చొచ్చి, మన ము ప్పొంగంగ, దాశార్హునా
వినుతింపొందు పథన్, నిమ్ణులగుచున్, వేవేగఁ బ్రద్యుమ్నుఁడా
సన పాద్యాది సపర్యలం దనుపగా, సంప్రీత చేతస్కులై. 17

చ॥ అచటికి దానవాంతకుడు నంతటిలోఁ జని ; యాను పూర్విఁతో
నుచిత విధోప చారముల నూఱటగాఁ గుశలాను యోగ వా
క్య చతురతన్మదం బెసఁగ నందఱ ధన్యులఁ జేసి ; భక్తి న
ప్రచలితుఁడయ్యె; వారలు నుపాయనముల్ మునుసూపి, పిమ్మటన్.

క॥ నరకుఁడు యాగంబులకున్
జొరకుడు మీరనుచు, ఋత్విజుల నడచుటయున్,
సరకులఁ జూఱాడుటయును,
వరకులకన్యకలఁ బట్టి వాఁడేగుటయున్. 19

వ॥ విన్నపంబుచేసి తమతెచ్చిన విధ్వస్తోప కరణంబులు విచ్చిచూపి. 20

మ॥ అది నా యుద్గమనీయ వస్త్ర-మది నా యూహోషరాంభద్వయం-
బది నా స్రుక్స్రువ పాత్రవర్గ-మది నా యజ్ఞోపవీతవ్రజం-
※ బది నా దారవయంత్ర పీఠ-మది నా యైణోత్తరీయాజినం-
బది నా రాంకవ కంబళం-బని పదార్థాలోకన వ్యగ్రులై. 21

వ॥ వేఱువేఱ యెఱింగించి. 22

# 5 కాలకౌశికుడు — గౌరన

[పాఠ్యభాగము 'గౌరన' రచించిన 'హరిశ్చంద్రోపాఖ్యాన'మను ద్విపద కావ్యములోనిది. ఇతడు పదునారవ శతాబ్దము నడుమనున్నట్లు తెలియుచున్నది. ఇతని శైలి ప్రౌఢము, రసవంతము. అలతి యలతిపదములతో భావము చిత్రించి రసస్ఫోరకమగునట్లుగా రచన చేయగల సమర్థుడు. స్వభావానుగుణములగు వర్ణనలు సేయుటయందీకవి యసమానుడు. ఇతని కవిత్వమునందు స్వభావోక్తులును, జాతీయములును, లోకోక్తులును, కొల్లలుగా గోచరించును.

హరిశ్చంద్రుడు కాశీకానగరమందు చంద్రమతిని విక్రయించునపుడు, అచ్చటికి కొనుటకు వచ్చిన కాలకౌశికుని ఆకార స్వభావవర్ణనము ప్రస్తుత కథాంశము]

ఆపురిఁ గౌశికు నాజ్ఞచే మున్నె
కాఁపురంబుగ నుండి కపటమార్గమునఁ
జెనఁటి విప్రునిరూపుఁ జేకొని మిగుల
నను వొందఁ జరియించు నాకలిగాజు
తలఁప నింతింతని తన ధనంబునకుఁ
గొలఁది గాదని శెట్టి గొడుకులు దన్ను
వారక నడుజాము వచ్చి వేఁడినను
కోరిన ధనములు 'గొందుకొం' డనుచు
నక్కఱదాఁదఁడై యప్పటప్పటికి
వెక్కసంబున నూర్లు వేలు నప్పిచ్చి
ముట్టఁజిక్కిన వేళ మొట్టి చేపట్టి
రట్టడై తిరిగి పత్రంబులు గొనుచుఁ
బెట్టవచ్చిన కల్ల పెనుపులు వెనఁచి
తిట్టి వారును దానుఁ దిరిదీపు లాడు
మటుమాయ లాఁడు కంబళపురీషంబు
పటికిరింతలపిల్లి, పట్టినదొబ్బ
శుద్ధకష్టుండని, చూపఱ దెగడ
బద్ధకంబునఁ బెక్కు బాసలు సేసి

వృద్ధి మీఱఁగఁ జక్రవృద్ధిని, మాస
వృద్ధిని లెక్కించి, వెస నప్పులెత్తి
కాల కౌశికుఁ డనఁగాఁ బేరు వడసి
కాలీచఁ జనుచు శీఘ్రముగ నింటింటఁ
బాయక పంచాంగ పఠనంబు సేసి
యాయవారము లెత్తి యతిదైన్యవృత్తి
నడిగిన ధాన్యంబు లవి వేఱువేఱ
ముడిచిన బట్టలు మూఁపుపై వ్రేలఁ
దోఁట నస్థులుఁ జిక్కి తూఁగాడు మేనుఁ
బేలు రాలెడుసిగ, పెడతలఁ గణితి
పిల్లికన్నులఁ, గుఱుపీఁచు మీసములు
నుల్లిగడ్డంబు, నత్యుగ్రదృష్టియును
దళమైన పట్టెవర్ధనములు, వ్రేళ్ల
నులిచినదర్భలు, నుదుటిపై బొరుసు
నొరుగునోరును, వెలి కుఱికినపండ్లు
యరవి దోవతియు, పంచాంగంబు, ముష్టిఁ
బరఁగిన కరతిత్తి, పత్రాల సంచి
నొఱిగిన గొడుగును, నుసి రాలుకోల
విడువక గోహత్య వ్రేలుచు నలుక
ముడివడ, రాఁజుమోమును గల తన్ను
'నదె వచ్చె నడపీనుఁ' గనుచు నంతంతఁ
గదియుచు మైపొస్తు కంపున కెడసి
తొలఁగుచుఁ, బురజనుల్ తుప్పున నుమియఁ
బలుమాఱుఁ గెలఁకులు పరికించుకొనుచు
నెవ్వఁడు మృత జాతుఁ, డెవ్వఁడు రుగ్మ
డెవ్వఁడు దుర్మృతుం డీపురిలోనఁ
బ్రేత వాహకుసిగాఁ బిలువ రెవ్వరును
బ్రాఁతిగా వెడలింప బడుగులు లేవు

బ్రహ్మ రాకాసుల భోజనమ్ములకు
రమ్మని ప్రార్థింప రాఁడొక్కరుండు
పిండివంటలు, నెయ్యి, బెల్లంబు పప్పు
గండ శాంతులఁ దృప్తిగాఁ దినలేదు
సప్తకంబులఁ బాయసము నెయ్యి పెరుగు
తృప్తాస్థ గా జుట్టి త్రేన్పంగ లేదు
కడికడి కొకమాడ గ్రహణకాలమున
వడివీడ దోవతి వదలించు కొనుచు
బరు లుబ్బఁ బ్రహ్మోష్ఠ పర్యంతముగను
బెరుఁగు వంటకము పేర్పేఁడు దినలేదు
లేదో మృత్యువు చంప లేఁడో జముండు
కాదేసి చావులు గలవాయె జగతి
నీ కొట్టికకు విప్రుఁ డెట్లు చేరెడిని
గైకొని బ్రతుక నే గతి గలదింక
మూఁకలై జనులు నిర్మూలమై చనిరో
కాక నా వీనులఁ గలిసెనో చెవుడు
శ్రుతి సుఖంబుగ మఱి శుష్కరోదనము
వితతంబుగా నేఁడు వినరా దదేల
నని తలపోయుచు నా హరిశ్చంద్ర
జననాథు మాటలచంద మాలించి
'చిక్కెఁబో నేఁడు నాచే మత్తికాఁడు.
చిక్కులఁ బెట్టి కౌశికుని మెప్పింతు
వెదకఁబోయిన దీఁగ విస్మయం బొదవఁ
బదములఁ దగిలె నా భాగ్యంబుకతన
బెదరించి వీరల భేద మొందించి
యుదరిపోఁ దోలుదు నుర్వీశు నొండె
మనసులో దయవుట్ట మాటలు వన్ని
పనివడ బోధించి భావంబు గలఁచి
యింతి నమ్మకయుండ నిపుడె మాన్పింతు

నంతట మితి దప్పి నడఁగు సత్యంబు,
నని మడిమెలు మోవ కతిసంభ్రమమునఁ
గునుకుచు సందడిఁ గోపంబు నిగుడ
మూఁగినవ్రజఁ గోల యొత్తి దట్టించి
తోఁగక పాయఁ దోలుచుఁ జనుదెంచి
తనమ్రోల నిల్వ నాతనిజన్నిదములు
గనుఁగొని విప్రుఁడు గాఁబోలు ననుచుఁ
జెయ్యెత్తి మ్రొక్కినఁ జెఱునవ్వు నవ్వి
యయ్యవనీశుతో నవ్విప్రుఁ డనియె
'గుఱుకొని నిన్ను నీకులమును దెలిసి
మఱి కాని దీవింప మాకు దోషంబు
నీవెవ్వఁడవు మరి నీకుఁ బేరేమి
యీవిధి సతినమ్మ నే యక్క ఱోదవె
నుడుగక వాతఁ గ్రొవ్వుఱుకంగఁ గుడిచి
గడిపోతువలె మేనికండలు వెంచి
కసవుఁ గట్టెలు మోయఁ గాయ పండ్లమ్మఁ
బసులజింగిలి గాయఁ బాలేరు దున్నఁ
గొఱమాలి మ్రుచ్చులఁ గూడి దూరమునఁ
జెఱవట్టి తెచ్చిన చెలువ నాలనుచు
మొఱఁగి యీరీతి నమ్ముట మాకుఁ దోఁచె
నెఱిగిరేఁ దలవరు లిప్పుడే పట్టి
కొఱతఁ బెట్టుదు రోరి కోమలి విడిచి.
పఱచి నీప్రాణముల్ బ్రతికించు కొనుము
కాదేని వరువుడు గా దారవోసి
మోదంబుతోడ నీముదిత మా కొసఁగు
మెనయంగ నీతప్పు లేము వహించి
కొని కాచెదము బ్రహ్మకొడుకువచ్చినను'
నని పెక్కుదుర్భాష లాడెడు విప్రుఁ
గనుఁగొని విభుఁ డాత్మఁ గలఁగ కిట్లనియె

# మత్సరము

### పింగళి సూరన

(పాఠ్యభాగము 'పింగళిసూరన' రచించిన 'కళాపూర్ణోదయ' మను మహా ప్రబంధములోనిది. ఇతడు శ్రీకృష్ణదేవరాయల కాలమునకు తరువాతివాడు. కళాపూర్ణోదయము ఆంధ్రమున అద్వితీయమైన గ్రంథము. ఇది స్వకపోలకల్పితమగు అద్భుతగాథావిలసితము. ఇతని కవిత్వమునందు ప్రబంధకవులెవ్వరియందును గనబడని ప్రతిభయు, భావనాశక్తియు, పాత్రోచితపద్య రచనయు, సందర్భశుద్ధియు సుప్రసిద్ధముగా గోచరించును. శైలిరమణీయమై, ఉదాత్తమై యొప్పుచుండును.

'రాఘవపాండవీయ' మను ద్వ్యర్థి కావ్యమును, 'ప్రభావతీ ప్రద్యుమ్న' మను ప్రబంధమును ఈకవి యితర రచనలు.

నారదుడు, తుంబురునితో గానమునందు మత్సరము వహించుట యిందు వర్ణితము.]

ఉ॥ వారిద పంక్తిలో వెడలివచ్చు మెఱుంగులపిండు నా సఖీ
వారముతో రమారమణివచ్చెను హెగ్గడికత్తె లెందఱే
* గోరిభజింప నా కొలువుకూటము ముందరివంక నొప్పు సిం
గారపు దోటనుండి యధికంబగు వైభవ మింపుమీఱఁగన్. 1

ఉ॥ నెచ్చెలిపిండు దానును వనీస్థలి దండ నొకింత గానగా
వచ్చెనో రాదో యాకమలవాసిని యంతనె యేమిచెప్పుదున్
* హెచ్చిన సంభ్రమంబున ననేకులు బద్దలవార లెక్కడన్
వచ్చియొ మోది రా కొలువువారి గకాపికలై చనన్వడిన్. 2

క॥ అప్పుడు మముబోంట్లు కతల్
చెప్పగనేమిటికి? దారసిలి వేత్రధరుల్
రొప్పగ జనియె న్నిలువక
యప్పరమేష్ఠియును నచటి కతిదూరమునన్. 3

వ॥ అట్లు తోడుకొని పోవుచుండ. 4

చ॥ కని తమలోన దా రితని గ్రమ్మఱగా బిలిపించె నేమొకో
యనియెడువారు, గానవిధులందు ప్రసంగము లేమిగల్గెనో
యనియెడువారు, దచ్చతురు లన్యులు లేరె యితండెకాని యిం
దనియెడువారునై మనములందును సందియమొంది రందఱున్. 5

ఉ॥ అప్పుడు నేను నా మనమునం దితనిం బిలిపించు టెట్లొకో
యొప్పు, డటంచునిల్చి యరయుంప, వినంబడియెన్ నిజంబుగా
నప్పురుషోత్తముండు దనయంగనతో వినుచున్నవాడు సొం
పొప్పు దదీయ గానమని పెద్ద జరించెడివారు చెప్పగన్. 6

క॥ మమ్మెల్ల దోలి యొక్కని
నిమ్మెయి బిలిపించి హరియు నిందిరయు గడున్
సమ్మదమున దుంబురు గా
నమ్మును వినుచునికి విని మనం బెరియంగన్. 7

వ॥ ఏనొక్క మఱుంగునం గొంతతడవు గనిపెట్టుకొని యుండ, 8

సీ॥ 'అనిపెనా యేమిచ్చె' ననుచును సంభ్రమం
బున సందడించుచు మూగువారు
'సర్వేశ్వరుండు శ్రీసతితోడ గానంబు
వినునట యదుగనే' లనెడువారు
'గడుననుగ్రహము నెక్కడలేని యీయోగి
పసయూ దెల్పెదు' నంచు బలుకువారు
'నీ వొక్కడవొ మఱి యెవ్వరలైన న
య్యెడనుండిరో' యని యడుగువారు

ఆ॥ నగుచు సురలు, మునులు, నరుదంద, మేపూత
డంబుతోడవచ్చె దుంబురుండు
కడలవారిని గనకస్నాన మాడించు
పదకమును సునేత్ర పటముదాల్చి. 9

వ॥ అప్పుడు. 10

క॥ ధగధగయను పదకంబును
నిగనిగయను క్రొమ్మెఱుంగు నేత్రపటమునన్
భుగభుగ యను మేపూతన్
భగభగ యనిపించె నతఁడు నా హృదయంబున్. 11

సీ॥ 'తను గ్రమ్మఱంగ బిల్చిన వేళ యంద నా
తో విచారింపక పోవు టెట్లు
పోయెబో! నను బిల్వఁజేయక తానొక
నెఱజాణయై విద్య నెఱపు టెట్లు?
నెఱపెబో! ప్రభువు మన్నించినాఁడని మీఁదు
పరికింప కీసొమ్ము పట్టు టెట్లు?
పట్టెఁబో దొంగఁ దేల్గుట్టిన ట్లివి డాఁచి
కొంచుఁబోవక మెఱయించు టెట్లు

గీ॥ లేదు తగవరి యెందును, మూఁడిదొచ్చి
వాతవెళ్లెడివాఁడె యెవ్వఁడు నంచు
బాపు! తుంబురుఁడా! యంచు బండ్ల గొఱుకు
కొంచు లోలోన నుడికితి గొంతతడవు. 12

క॥ నాకంటె దాను ఘనుఁడే?
యాకొలదియు బయలుసేయునంతకు నేయే
పోకల బోయిన బోని
మిన్నకరణిఁ జణిగిపోవ నిత్తునె యింకన్. 13

వ॥ అని యాగ్రహించుచు నతనితోడ నెందేనియు వాదుపెట్టుకొని భంగపఱచి, యతులితంబైన మదీయసంగీత చాతుర్యంబు వార్తలు క్రమంబున నిజ్జగన్నాయకునకు వినంబడునట్టి యుపాయంబు వెట్టెదంగాక యని యూహించి తదనంతరంబ. 14

చ॥ తలఁగక యిప్పుడిల్లు సముద్రగత బేర్చిన యీర్ష్యాబుద్ధిలోఁ
పలన యడంచి మెఱతిగనుపట్టగ నింకను గొంత రాకపోఁ
* కలు ఘటియించి యే నతనిగానములోఁ గుణదోషవర్తనల్
దెలియుట నీతి, యా తెలివిలేకగునే జయ మంచు నెంచితిన్. 15

ఆ॥ ఎంచి యతని యింటి కేగితి నొక్కనా
డతడు నపుడు పాట కాయితముగ
వీణె మేళవించి వెలుపలి మోసల
నునిచి లోస కరిగి యున్నవాడు. 16

ఉ॥ ఏనును 'దుంబురుండెచటికేగె గృహంబున నున్నవాఁడె' యం
చానికటంబునన్ మెలగునట్టి జనంబుల బల్కి, వీణె యి
చ్చోనిడి లోనికేగె నను సుద్ది వినంబడ, నీ విపంచి నె
వ్వానిదొ యంచు నుండితిమి వారిదె? చూతమటంచు నల్లనన్. 17

గీ॥ పుచ్చుకొని పలికించి యపూర్వమైన
శ్రుతుల పెంపు నిర్ఘోషత నతులమనుచు
గడు వెఱగొనర్చ దాని నక్కడన పెట్టి
మిగుల లజ్జించి వచ్చితి మగిడి యపుడు. 18



[పాఠ్యభాగము 'మారన' రచించిన 'భాస్కరశతకము'లోనిది. శతక రచయితలలో మారన సుప్రసిద్ధుడు. కేవలము నీతి ప్రబోధమే శతకరచన ప్రధానాశయము. ఈ శతకమునందు ప్రతిపద్యము చివరను 'భాస్కరా' యను సంబుద్ధి మకుటముగా నుండుటచే దీనికి భాస్కరశతకమను పేరు వచ్చినది. మారన కవిత్వము శ్రావ్యమై అర్థాంతరన్యాసాలంకారములతో నీతి ప్రబోధకమై యొప్పుచున్నది.

వర్ణ సమామ్నాయమునందలి ప్రత్యక్షరమును తీసికొని క్రమమైన పద్ధతిలో పద్యముల మాలగా గుదిగూర్చుట యితని రచనా విశిష్టత.]

ఉ॥ రాకొమరుల్ రసజ్ఞుని దిరంబుగ మన్నన నుంచినట్లు భూ
లోకమునందు మూఢు దమలోపల నుంపరు నిక్కమే కదా
చేకొని ముద్దుగా జదువు చిల్కను బెంతురుగాక పెంతురే
కాకము నెవ్వరైన శుభకారణ, సన్మునిసేవ్య భాస్కరా! 1

ఉ॥ లోకములోన దుర్జనులలోతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుడు చేరినం గవయజూతురు చేయుదురెక్కసక్కెముల్.
కోకిల గన్నచోట గుమిగూడి యసహ్యపుగూత లార్చుచున్
గాకులు తన్నవే తఱిమి కాయము తల్లడమంద భాస్కరా! 2

చ॥ వలనుగ గానలందు బ్రతివర్షమునం బులి నాలుగైదు పి
ల్లలగను దూడనొక్కటి సిలం గను ధేనువు రెండుమూడు నే
డుల కట్టులైన బెబ్బులికుటుంబము లల్పములాయె నాలమం
దలు గనువృద్ధిచెందవె యధర్మము ధర్మము దెల్ప భాస్కరా! 3

చ॥ సిరిగలవాని కెయ్యెడల జేసినమేలది నిష్ఫలం బగున్
నెఱిగుఱిగాదు పేదలకు నేర్పున జేసిన సత్ఫలంబగున్
* వఱపున వచ్చి మేఘు డొకవర్షము వాడిననేలమీదటం
గురిసినగాక యంబుధుల గుర్వగ నేమి ఫలంబు భాస్కరా! 4

చ॥ సిరివలెనేని సింహగుహచెంత వసించిన జాలు సింహముల్
కరుల వధింపగా నచటగల్గును దంతచయంబు, ముత్యముల్
హరువుగ నక్క బొక్కకడ నాశ్రయమందిన నేమి గల్గెడున్
గొరిసెలు, దూడతోకలును, గొమ్ములు, నెమ్ములుగాక భాస్కరా!

చ॥ స్థిరతర ధర్మవర్తన ప్రసిద్ధికి నెక్కినవాని నొక్క ము
ష్కరు డతి నీచవాక్యముల గాదని పల్కిన నమ్మహాత్ముడున్
గొఱత వహింప; డయ్యెడ నకుంఠిత పూర్ణసుధాపయోధిలో
నరుగుచు గాకి రెట్ట యిడినందున నేమికొఱంత భాస్కరా! 6

ఉ॥ మాటలకోర్వజాల డభిమాన సమగ్రుడు ప్రాణహానియౌ
చోటులనైన దా నెదురు నూచుచునుండు. గొలంకు లోపలన్
* నీటమునింగి నప్పు డతినీచములాడిన రాజరాజు పో
రాటమొనర్చి నేలబడడాయెనె భీముని చేత భాస్కరా! 7

ఉ॥ పండితులైనవారు దిగువందగ నుండగ నల్పుడొక్క డు
ద్దండత బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమియెగ్గగున్
* గొండొకకోతి చెట్టుకొనకొమ్మల నుండగ గ్రింద గండ భే
రుండ మదేభ సింహనికురుంబము లుండవె చేరి భాస్కరా! 8

చ॥ నడవక చిక్కలేమి యగునాడు నిజోదరపోషణార్థమై
యడిగి భుజించుటల్ నరుల కారయ వ్యంగ్యముకాదు; పాండవుల్
గడుబలశాలు లేవురు నఖండవిభూతి దొలంగి భిక్షముల్
గుడువరె యేకచక్రపురి గుంతియు దా రొకచోట భాస్కరా. 9

చ॥ నుడువులనేర్పు చాలని మనుష్యు డెఱుగక తప్పనాడినన్
గడుగృపతో జెలంగుదురుకాని యదల్పరు తజ్జ్ఞులెల్ల ద
ప్పడుగులువెట్టుచున్ నడచు నప్పుడు బాలుని ముద్దుసేయగా
దొడగుదు రింతెకాని పడదోయుదురే యెవరైన భాస్కరా! 10



# 8 వేంగిక్షేత్రము

**శ్రీ విశ్వనాథ సత్యనారాయణ**

[శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఆంధ్రకవి సమ్రాట్టులు. [illegible] ఆంధ్రము, ఆంగ్లేయమునందు మంచి పరిచయము గలవారు. కేవల వ్యుత్పత్తి కలిగిన వారే కాక ప్రతిభావంతులగు మహాకవీశ్వరులు. తెలుగు సారస్వతమునందు వీరు నడవని మార్గములులేవు. బహుముఖమగు మహాస్రోతస్వినివలె వీరి ప్రతిభ సహస్రధా పరుగు తీసినది. వేయిపడగలు, చెలియలికట్ట, ఏకవీర, వీరవల్లడు మొదలగు నవలలును, శృంగారవీధి, మాస్వామి, శశిదూతము మొదలగు ఖండకావ్యములను, కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెండ్లి మొదలగు గేయకావ్యములను, రామాయణ కల్ప వృక్షము వంటి ఐతిహాసిక మహాకావ్యములను, వేనరాజు, నర్తనశాల, అనార్కలి మొదలగు నాటికలను, అనేకములగు విమర్శనాత్మక వ్యాసములను, పెద్దకథలను. చిన్నకథలను వందలుగా రచించినారు. నేటి తెలుగు సారస్వత రంగమున వీరికి ప్రముఖస్థానమున్నది.]

సీ॥ ఏరాజు పంచెనో? యిచట శౌర్యపు పాయ
సమ్ములు నాగుల చవితినాళ్ల
ఏ యెట్టసంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ల బారాణులిడిరొ?
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో
తెలుగుపిల్లలు కత్తి త్రిప్పిరెపుడొ?
ఏ రెండుజాములు యినుని వేడిమి వచ్చి
కలిసిపోయెనొ త్రిలింగప్రభువుల?

నా జగచ్ఛ్రేయసంబులై యలరు కొంటి
వేంగిరాజులపాదపవిత్రచిహ్న
గర్భితమ్మైన యీ భూమిఖండమందు;
నశ్రువులు జార్తు, శ్రీవచ్ఛవాంధ్రజనులు

మ॥ ఇట వేగీశులపాదచిహ్నములు లేవే! లేవు పో! భావనా
స్ఫుటమూర్తిత్వము నైన బొందవు, నెదో, పూర్వాహ్ణ దుష్కాలపుణ్
ఘటికల్. గర్భమునందిముడ్చుకొని యెం, [illegible]
టట! లోకాద్భుత దివ్యదర్శనమ కే! యాభోగ [illegible]

ఉ॥ నీయతుల ప్రభావమహనీయత, వేగి పురాధిరాజమా
ఆయత ధర్మమూర్తులు, మహాత్ములు, వారలు-బ్రహ్మకోశగో
పాయిత లాంధ్రపల్లవ నృపాలుర హుంకృతి వ్యాఘ్రగర్జగా
నై; యరిలోకభీకర మహాద్భుత శౌర్యరసాకృతింజనెన్. 3

సీ॥ ఈ, నాపదార్పితక్షోణి, నేరాజు ధ
ర్మాసనంబుండి, స్మృత్యర్థ మనెనో?
* ఈ, నాదృగావృతంబైన భూములలోన,
నేశౌర్యధనులు శిక్షింపబడిరో?
ఈ, నాశరీరమం, దివతళించిన గాలి,
యెంతపౌరాతన్య మేచుకొనెనో?
ఈ, నాతనూపూర్ణమైన యాకాశమ్ము,
నేక్రతుధ్వనులు శబ్దించినవియో?

అస్మదజ్ఞాత పూర్వదివ్యత్వ మొప్ప,
నీ పునీతావనీఖండ, మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నాయాంధ్రశక్తి
నన్ను గంపింపజేయుచున్నది, భృశమ్ము. 4

సీ॥ వేగిరాజ్యపు పల్లెవీథుల, చెడుగుళ్ళ,
రిపుల గవ్వించు, నేరుపులు దెలిసి,
ఎగురు గోడీబిళ్ళ సొగసులో. రిపుశిర
స్సుల బంతులాడు, శిక్షలకు డాసి,
చెడ్డాడి, యుప్పుదెచ్చిన నాడె శాత్రవ
వ్యూహముల్ పగిలించు, నోఱపు గఱచి,
కోతికొమ్మచ్చిలో, కోటగోడల కెగ
బ్రాకి, లంఘించు, చంక్రమణ మొఱిగి,

తెనుగు లంతప్పి, యవి, నేర్చుకొనియ యుండు,
రెన్నగా దెన్గుతల్లులు, మున్ను, శౌర్య
రస మొడిచి యుగ్గుబాలతో, రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదురట ! 5

మ॥ శిలవోలెన్, కదలంగలేః, హృదయస్నిగ్ధార్ద్ర సద్భావ నా
ఖిల, చైతన్యుడనై, పురావిదిత వేంగీపూజ్య సామ్రాజ్య గా
థల యోజించుచు, నాంధ్ర పల్లవ నరేంద్ర శ్రీయశ స్తంభమున్
బలె, నిల్చుంటిన ; యీ పవిత్రధరణీ భాగంబునం దీగతిన్. 6

సీ॥ ఏదివ్యపూరుషు, లీ, శాద్వలాంకూర
శేఖరమ్ముల. లిఖించిరో, యివెల్ల !
ఈ వాయు వీచిలో, నే, యప్సరస్సమా
జము నింపిరో, గీతి సముదయంబు !
ఏదివ్య శిల్పు, లీ, రోదసీ కుహరాన
వ్రాసిరో, దివ్యశిల్పంబులిన్ని !
ఈ పథాంతరమునం, దే, పురాణ మునీంద్ర
సంతతులో, ప్రశంసలు పొనర్తు !
ఎట గనిన, పూర్వ పల్లవ నృపచరితలె
వ్రాయబడి, పాడబడి, గీయబడి, యుపన్య
సింపబడి, శ్రోత్ర పేయమ్మై, చెన్నుదాల్చె-
నీ యతీంద్రియశక్తి ; నా కెట్టులబ్బె ! 7

సీ॥ ఈ, పొలా, లెంత చేవెక్కించుకొన్నవో ?
గుండెవ్రయ్య సముద్రగుప్తు డడలె-
ఈ, నేల, పావిత్ర్యమెంత కుంభించెనో ?
చిత్ర రథస్వామి సేవలుకొనె,-
ఇట, పల్లవుల రాచ యెలనాగ, లే వ్రత
మ్ములు చేసిరో ? లచ్చి నిలుకడవడె-
ఈ కాశ్యపీఖండ, మే, శరజ్జ్యోత్స్నలో
పులకించెనో ? కీర్తి తెలుపులూరె-

ఇట, నెచట్త్రివ్వినను బంగరేనట! యది
యెంత శ్రీలయో? యదెంతరాజ్యేందిరయో! వ
దాన్యతనఖాగ్రపాతనిర్యన్నిధాన
మైన, యీ చోట, నుపభోగ్యమయ్యె నేడు! 8

ఉ॥ ఈ, పొదలం జరించుచు, నహీనమహోమహిమానుభావమౌ
నే పురవీధులందో, చరియించుచునుంటి నటంచు భారతం
※ త్ర్యాపతితుండ నయ్యును, పురామహదాంధ్రమునన్, స్వతంత్రుడౌ
నే పురుషుండనో యనుచు నీభ్రమ సత్యముగా, తలంచెదన్. 9

సీ॥ ఏ, పల్లవ నృపాలు, డెత్తిన బావుటా,
చాళుక్య నృపుల రాజ్యంబు నందు-
ఏ, దేశికవిత పాలించిన కవిరాజు,
నన్నయ్య వ్యాకరణంబు నందు-
ఏ యులిజెక్కు నేర్పులు మహాశిల్పి,
గోదావరీనదీ ఘోషయందు,
ఏ, తొంటి తెలుగుల యెక్కువాచారమ్ము,
బలవన్నృపుల ప్రాభవమ్ము నందు,
సమసి పోయెనో; ఉన్మత్త సామజంబు,
కొలను జొరబడి తమ్మితూడులను పెరికి
వైచునటు, యెఱుంగ్నుగాని, తత్పద్మ గర్భ
కేసరవిమిశ్రమధురసాగియత గలదె! 10

ఉ॥ ఇమ్ముగ, గాకుళమ్ము మొద, లీవరకుంగల, యాంధ్ర పూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన, హృదంతరమేలా చలించిపోవు, నా
※ ర్ద్రమ్మగు చిత్తవృత్తుల, పురాభవ నిర్ణయమేని, యెన్ని జ
న్మమ్ములుగాగ, నీ తనువునన్, ప్రవహించునో, యాంధ్రరక్తముల్.

చ॥ ఇది, విసిపింతునంచు, మది నెంచెద, మిత్రులకున్, గళస్థ గా
ద్గదికము, లోచనాంత బహుధాస్రుత బాష్పనదమ్ము, స్పందనా
స్పదహృదయమ్ము, నాపసికి జాలక చేసెదు, నన్ను, నింతగా
నెద పదలించుకొన్న దిది యెక్కడి పూర్వపు జన్మవాసనో! 12

# 9 విద్యారణ్యులు — కీ. శే. కొడాలి సుబ్బారావు

[ఈపాఠ్యభాగము శ్రీ కొడాలి సుబ్బారావుగారు రచించిన 'హంపీక్షేత్రము' కావ్యములోనిది. వీరిని గురించి సుప్రసిద్ధులు కవిసమ్రాట్టులు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు పలికిన పలుకులివి. "బ్రతికి బట్ట కట్టినచో సరస్వతీదేవిచేత పట్టు సెల్లాలు కట్టించెడివాడీకవి. కావ్యగుణములు మహాకవి లక్షణము. అవి సర్వము బీజప్రాయముగ నీచిన్ని కావ్యమందేయున్నవి. అతనికి ప్రౌఢనిర్భరవయః పరిపాకమే వచ్చునంత ఆయుస్సుకల్గినచో అతడు 'తెలుగు కావ్యసరస్వతి నూపురంబు మ్రోయు దినములు' మనకు చూపించెడివాడు." ఇందతిశయోక్తియేమాత్రములేదు. కాని ఆయన బ్రతుకలేకపోవుట మనదౌర్భాగ్యము.]

చ॥ తమము నడంచి, యుత్తమ పదంబును పొందిన మానులందు, స్వా
ర్థమొకటె గుత్తగొన్నది; పరస్పర సంశ్రయభావ బంధన
క్షమమయి పొల్చు వ్యక్తియును, సంఘము దాని నతిక్రమించి స్వీ
యమునకు లోకమున్ వదలినట్టి ఘనుల్ నినుమెచ్చుకొందురే?

ఉ॥ "లోకము భద్రమై సుఖవిలోకనమై పొలుపొందునాడు స్వ
ర్లోకమొ, మోక్షమో, గని వెలుంగుట, ధర్మముగాని; లోకమే
* చీకటిదై విపత్తులకు చిక్కిననాడు, తపంబు, మోక్షమున్
చేకొని ముక్కుమూసుకొని చెట్టుల గుట్టల బట్ట ధర్మమే?" 2

చ॥ అని తలపోసి, తెల్గుభువనప్రళయంబున కడ్డుకట్ట వే
సిన, మహనీయమూర్తివని చెప్పిరి, సిన్నొక విగ్రహంబు చే
సి నిలిపి, నిత్యమున్ ప్రజ భజించుచు నుండుట గాంచి ధన్య జీ
వన పథవర్తులైతి మనువారలు నీ గుడి చూడవచ్చుచోన్. 3

శా॥ దేశక్షోభ, మరాజకంబును, మదాంధీభూత శత్రు క్షమా
ధీశోజ్జృంభణ, మార్తపౌరజన వృత్తిచ్ఛేదనోద్రేక, మ
త్యాశా పూరిత రాష్ట్రపాలక దురంతాఖ్యానముల్, కాకతి
శ్రీ శుండోడిననాడు, తెల్గుధర ముంచెన్ నీ యశస్సృష్టికై. 4

మ॥ అల నందాన్వయ మగ్గిలో పొగిలి నీరైపోవ, నందుండి మౌ
ర్యుల సామ్రాజ్యము బైటబడ్డయది; విప్రుండొక్క డానాశ సృ
ష్టులకున్ హేతువు-నీవొ, కేవలము తేజోమూర్తివై సాత్వికో
జ్జ్వల సృష్టి ప్రతిపాదకుండవయినావా? తెల్గుసంశ్లాఘనన్. 5

చ॥ చెరచినదాని బాగుపడచేయుట దుర్లభ మట్టి తెల్గురా
జ్య రమను ఓరుగల్లు సిలయంబున కోటలుపడ్డరాళ్ళపెన్
బరువుల క్రిందుదాని, సులభంబుగ పైకితెరల్చి, దివ్యసుం
దర రుచిమూర్తి చేసితివి; తల్లిఋణంబును తీర్చినావు పో. 6

సీ॥ ఒకచేత, పాడైన ఓరుగల్ సిరులను
విద్యానగర రాజవీథి కెత్తి,
ఒకచేత క్షీణతనొందు హిందూమత
వైశాల్యభావ సంపదల నెత్తి,
ఒకచేత, రాజకీయోన్నతిలో మంత్ర
శక్తియుక్తుల 'పరజాల' నెత్తి,
ఒకచేత, యోగసాయుజ్యాంత రానంద
తత్వసారాచ్ఛ సాధనము లెత్తి,

తే॥ ఇహపరంబుల మతరాజకీయములను
ఒకటికొక్కటి పొసగని వికటవస్తు
జాలముల నైక్యపరచి, నిస్సంగమందు
సంగివై- సంగమందు నిస్సంగివైతె? 7

చ॥ అపుడు పురాణకాలమున యందు వశిష్ఠుడు, రాజ్యవేత్తలన్
నిపుణుడు ; సాధుపుంగవుడు నేడు మహాత్ముడు గాంధి ; తెల్గు భూ
* మిపతి చరిత్రవేళను సుమీ యుగమధ్యమునందు నీవు ; మా
తృపద నితాంత పూజకు విధించిన బ్రహ్మము మూడుమూర్తులా?

మ॥ ఒక కాలంబున నొక్క దివ్యఋషి చేయున్, రాజ్యనిర్మాణ సా
ధక వర్గం, బది శక్తిమంతమయి స్వాతంత్ర్యంబు స్థాపించు, న
శ్లైకదా, నీదు పవిత్ర జీవితము వర్తించున్, యశఃకాయ కా
ముకులావార లెటుల్ దలంచిన సదా మోదంబు గాకుండునే?

సీ॥ అది, జలాంతర్గత, మఖిలలోకలయంబు
వటపత్రమున, మోచువాడొకండు,
అది, కాలకాకోల, మగ్నిదగ్ధలయంబు,
గళమునందున, నిల్పగల డొకండు
అది, ప్రభంజనవేగ, మాకంపన లయంబు,
వరముతో, గెడపెడి వాడొకండు
అది, మహాభూభార, మణగద్రొక్కు లయంబు,
కోడెలపై, నిల్పు వా డొకండు

తే॥ కట్టుకథలివి పౌరాణికములు, తెల్గు
రాజ్య విలయాంతరమున, నరణ్యములను
కందమూలాల బ్రతుకును గడపు వెర్రి
బ్రాహ్మణుడు రక్షకుండగు వాడె వింత?

శా॥ నీకన్నన్ కడుగొప్పవారలు తపోనిష్ఠాత్మకుల్ పుట్టరే
లోకంబందున? వారి దేవతలగా రూపించి యేటేట పూ
జా కళ్యాణము సల్పినారె? ప్రజ లుత్సాహంబు రెట్టింప నీ
కే కావించుటదేలనోయి? పరమాంగీకార నూచివ్రతుల్. 11

తే॥ “ఆత్మవత్సర్వభూతాని” యని తలంచి
నిన్ను నీ దేశమాతతో నున్నతమగు
పదవి పొందించి, ఆటలో పండినావు
ముక్తి నీకు; దేశానికి భుక్తి భక్తి. 12

క॥ నీ పేరు శాశ్వతంబంబు,
నీ పేరున నిల్చినట్టి నిలయము నుసిమై,
నీపూజ వీరపూజో
ద్దీపనమై, నిల్చెనోయి తెల్గు ధరిత్రిన్. 13

సీ॥ ఆ కన్నుమూతలో నంతర్విలీల వం
చానిల స్తంభనాత్మార్చి వెలుగు
ఆ బొమ్మమోడ్పులో నసమాక్షు సెగకన్ను
మంటరేగిన సుళ్ళు మాటు మణుగు
ఆ కన్నువిప్పులో నఖిలరాజన్యశి
ఖోదక్షమైన వర్చస్సు మెరయు
ఆ చిరునవ్వులో, నాంధ్ర సామ్రాజ్య సు
శ్రీనవ్య జీవన శీలమిముడు-
తే॥ ఈ శిలావిగ్రహమునందె యింతగొప్ప
కుదురు కొనియుండ; ఊహాలు గుములుకొనిన
ఎంతవాడవొ నిను స్తుతియింపగలమె?
విజయనగరాంధ్ర దేవుడవే నిజంబు. 14

---

## శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి

[పాఠ్యభాగము శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు రచించిన "కరుణశ్రీ" యను బుద్ధచరితములోనిది. వీరు ప్రస్తుతము గుంటూరుజిల్లా అమరావతిలోని హైస్కూలునందు పండితులుగా బనిచేయుచున్నారు. వీరు సంస్కృతము, తెనుగు, హిందీసారస్వతములందు బాగుగ కృషిచేసినారు. 'కరుణశ్రీ' యను గుప్తనామముతో వీరు తెనుగువారికి చిరపరిచితులు. వీరి కవిత్వము మృదుమధురపదసంశోభితమై సరస్వతీచరణమంజీరమువలె హృదయాహ్లాద మొనరించును. వీరు భావసుకుమారులు. వీరి కావ్యములు పాఠకుల కమృతతుల్యములు.

'అరుణ కిరణాలు' యను గేయకావ్యమును, 'ఉదయశ్రీ' 'విజయశ్రీ' యను పద్యకావ్యములు, 'కరుణామయి' 'స్వప్నవాసవదత్త' యను నాటకములును వీరి యితర కృతులు.

ఇందు గౌతముని ఆర్ద్రహృదయము చిత్రితము.]

ఉ॥ అందరిమిత్రులం దెవరి యశ్వము ముందర పోవునో కనుం
గొంద మటంచు పందె మిడి గుఱ్ఱములం దుమికించు వేళలన్
కొందలమంది నోట నురుగుల్ వెలిగ్రక్కుచు ఘర్మబిందువుల్
చిందెడిమేనుతో పరుగులెత్తుచునున్న నిజాశ్వరాజమున్ 1

చ॥ కనుగొని 'రాజనందనుడు' కారుణికత్వము పొంగి ; బాష్పముల్
కనుగొనలన్ స్రవించి తురగమ్మును నిల్పి, నిజోత్తరీయ చా
లనమున చల్లగా సముప లాలన సేయుచు పాణిపల్లవ
మ్మున మెలమెల్లగా చరణముల్ స్పృశియించి శ్రమమ్ము నాపుచున్. 2

ఆ॥ 'ఎంత కష్టపడితివే అశ్వరాజమా!
బాధనీది, విజయ ఫలము నాది ;
స్వార్థపరుడనగుచు శ్రమ పెట్టితిని నిన్ను
పందెమందు గెలుపు నందు కొరకు' 3

ఆ॥ ప్రియహయమ్ము నిట్లు ప్రేమార్ద్ర దృష్టితో
బుజ్జగించి పందె ముజ్జగించి
మందిరమ్ము సేరె మనుజేంద్రసూనుండు
జనకు మానసమ్ము సంభ్రమింప. 4

ఉ॥ తోడి నృపాల బాలకులతో హిమవద్ గహనాంతరాల వే
టాడగబోయి 'శాక్యతనయాగ్రణి' - ముందుకు పారిపోవ కా
లాడక త్రాస చంచల దృగంచలమై తలద్రిప్పిచూచు నా
లేడి నెలంత పై విసరలేదు సశాత శిలీముఖమ్ములన్. 5

ఉ॥ ఆగతి హీన దీన హరిణాంగన చూచిన జాలి చూపులో
దాగుడు మూతలాడు 'కరుణామయి' గౌతము లేత గుండెకున్
* స్వాగతమిచ్చి విన్నపము సల్పెను విశ్వ విషాదగాథ బా
ధాగత గద్గదత్వము కతమ్మున మ్రోగని మూగగొంతుతో. 6

ఉ॥ అమ్మృగ మూర్తిలో భువన మంతయు చల్లని ప్రేమమూర్తియై
చిమ్మె సుధాప్రవాహము విశేషముగా 'అమితాభు' మానసా
* బ్జమ్మున- అంత రాసుతుడు వారువమున్ మరలించి చేతి వి
ల్లమ్ములు పారవైచి నిలయమ్మునకున్ జనె సానుభూతితో. 7

సీ॥ 'తలవంచు' మండుటెండలలోన మాడుచు
పొలము దున్నెడి కృషీవలుల గాంచి
* 'నిట్టూర్పుపుచ్చు' జానెడు గుడ్డతో కూటి
కై పాటుపడు బీదరాలి గాంచి
'కన్నీరునించు' చక్కని పూల కన్నెల
గొంతులు నులుము భక్తులను గాంచి
'కరగి నీరా' వ్రేళ్ళు కాయలుగాయ క
ట్టెలు కొట్టుకొను కార్మికులను గాంచి

తే॥ 'సానుభూతి వహించు' గ్రీష్మమ్మునందు
నెండి కార్శ్యమ్ముగను సెలయేళ్ళు గాంచి
విశ్వకారుణ్యభావసంవేద్యమాన
మానసుండయి శాక్యభూజాని సుతుడు. 8

---

# 11 పరిచయము శ్రీ జి. జాషువ

[పాఠ్యభాగము శ్రీజాషువగారు రచించిన 'స్వయంవర' మను కావ్యములోనిది. శ్రీజాషువగారు గుంటూరుజిల్లాలోని వినుకొండ వాస్తవ్యులు. ఎంతగంభీరమైన భావమునైనను హృదయంగమముగా చెప్పి పఠితృల నానందపరవశులుగ జేయగల 'నవయుగ కవిచక్రవర్తులు' మనోహరమగు శైలి వీరిని గుత్తగొన్నది. ఆంధ్రదేశమున గల ప్రసిద్ధకవులలో వీరొకరు. వీరికి కవికోకిల, కవిదిగ్గజ యను బిరుదులు గలవు.

'ఖండకావ్యములు,' 'పిరదౌసి,' 'స్వప్నకథ,' 'కాందిశీకుడు,' 'ముంతాజి,' మొదలగు కావ్యములు, 'ఫీరాబాయి,' 'తెరచాటు' మొదలగు నాటకములు వీరి యితరకృతులు.

స్వరాజ్య బాలికా స్వయంవరమునకు విచ్చేసిన పెండ్లికొడుకులను అహింస యను చెలికత్తియ పరిచయ మొనర్చుట ప్రస్తుతకథాంశము.]

సీ॥ శాసన సభలలో సభ్యతాపదవికై
వింత సంస్థలను స్థాపించువారు-
కాలానుసరణంబుగా తొండలను బోలి
మాటిమాటికి రంగు మార్చువారు-
ఉద్యోగమూడగా నుక్కురోషము తోడ
నట్టింటిలో జిచ్చుపెట్టువారు-
నిమ్నజాతులమీద నిప్పులు చెరగుచు
విధిలేక కన్నీరు విడుచువారు-
చిరుత విధవల కన్నీటి వరదలందు
హాయిగా కుమాళ్ళకు పెండ్లి సేయువారు-
వచ్చియున్నారు నీ స్వయంవర జిగీష
బిడియములు మాని ముదిపెండ్లికొడుకు లగుచు. 1

శా॥ ఆగాఖానుడు సాటిరా డితనితో నైశ్వర్యసంపత్తి, ని
న్నూగింపంగల డెల్లభోగముల యం; దుల్లంబు లేకుండగా
లాగుం బేదల పచ్చిమాంసమును, బాలా! జంటవడ్డీలతో
సోగల్ దీరిన వాలుకన్గవ చెమర్చున్, వీని, వీక్షించినన్. 2

మ॥ అనువారంబును దేవపూజలకుగా నర్ఘంబు వెచ్చించి, చే
సిన పాపంబు హరించిపోయెనని హర్షించుచున్, మహర్షీంద్రుఁ డి
* చ్చిన సందేశము విస్మరించి, ప్రతిమల్ జెక్కించి యమ్మించు, నీ
కనుకూలించిన జూచుకొమ్ము శుభనేత్రా! వీని సంబంధమున్. 3

మ॥ అటకాయించెడి శాసనాల చెవులల్లాడించుచున్, 'బ్లాకు మా
ర్కెటు' సాగించు బెహారిమిన్న యిత, డార్జెన్ బెక్కుసంసారముల్
* చిటికెండంత దయారసం బితని కుక్షిన్ జీల్చినన్ గాన; మి
క్కుటిలుం డుత్తమ దేశభక్తుడని బల్కున్, బత్రికారాజముల్. 4

చ॥ పొగలెగజిమ్ము శాత్రవము బొజ్జలలోపల డాచి, మోములన్
నగవు లలంకరించుకొని, నాటకమాడెడి, లౌకిక బ్రభువుల్
భగవ దఖండప్రేమ విభవంబును, నిత్య ముపన్యసింతు, రీ
సగము మనుష్యులే అధికసంఖ్య సుమీ! మతధర్మ సంస్థలన్. 5

ఉ॥ నూతన రాజ్యముల్ పదులు నూరులు బుట్టి గతించి పోయినన్
తాతలనాటి పచ్చిబురదన్ బుడకొట్టుచునుండు కుంభజ
భ్రాతను జూడు మమ్మ! ప్రతిభా సముద్రగములైన నీ కళా
జ్యోతులు మాన్పలే వితని చూపుల సంకుచిత స్వభావమున్. 6

చ॥ కలధనమంతయున్ గరగి గండు దరిద్రత చుట్టుముట్టినన్
దలకక, బందిఖానల వ్యథామదదంతుల నోర్చి ధీరులై
నిలిచిన శాంతిదూతల ననింద్య చరిత్రుల జూడుమమ్మ! నీ
వలపుల కౌగిలింతలకు వన్నెలు దేగల దేశభక్తులన్. 7

సీ॥ ఆడంబరము లేని యాదర్శ జీవితా
భ్రమున కాతం డబ్జ బాంధవుండు-
వలదన్న వెనువెంటబడు సనాతనమైన
కటికి చీకటికి ఖడ్గంబతండు-

* ఉదరంభరితకు చేయూతలు గల్పించు
మతమున కతడు శాశ్వత విరోధి-
కాసు చేయని అద్దకపు వర్ణముల పురా
రభసకీతడు మంచి రజకరాజు-

జీవకారుణ్య మకరంద జీవఝురుల
కాలవాలంబు లితని నేత్రాంచలములు-
నీకు నచ్చిన మగవాని, నీతిపరుని
ఏరుకొనుమమ్మ! కలికి బంగారు బొమ్మ! 8

---

## 12 పరివర్తనము శ్రీ ధనకుధరం వేంకటాచార్యులు

[పాఠ్యభాగము శ్రీధనకుధరం వేంకటాచార్యులుగారు రచించిన 'జాగృతి' అను ఖండకావ్యములోనిది. వీరు యువకవులు. వీరికవితలో భావగాంభీర్యమును, పదసౌష్ఠవమును గోచరించును. చెప్పిన విషయమును సూటిగా హృదయములోనికి జొచ్చుకొనిపోవునట్లు వ్రాయగలవారు.

కళింగయుద్ధానంతరమున అశోకునిలో గలిగిన 'పరివర్తనము' ప్రస్తుతకథాంశము]

చక్రవర్తి:-

ఉ॥ కూడని రాజ్యలోభమునకున్ శిర మొగ్గి; కళింగరాజ్య మ
ల్లాడగ ఘోరహంతకుడనై చెలరేగి, మృగమ్ములట్లు వే
టాడి, శవాలమధ్యను విహారమొనర్చుచు, మానవత్వమున్
బూడిదపాలొనర్చితిసిపో! అవివేకము కండ్లు గప్పినన్. 1

ఉ॥ నా చతురంగసైన్యములు, నా భుజదర్పము, రెండు తోడుగా
ఈ చతురబ్ధివేష్టిత మహీవలయమ్ము, జయించు కాంక్షతో
* దోచితి దేశముల్ నిలువుదోపిడిగా; నెదురించు వారలన్
రాచితి నుక్కుపాదముల; శాచరికమ్మొక డావహించినన్. 2

ఉ॥ కేవల బుద్ధుదమ్మ్మ్ర పరికింపగ జీవిత; ముద్దుకై అహం
భావము బెంచి స్వార్థమహిమమ్మ్మ్మున బొంగి పవిత్రభారతీ
* యావని నింక నెన్నటికి నారని చిక్కని రక్తధారనా
ప్లావితమాచరించిన శిలాహృదయుండ జరిత్రహీనుడన్. 3

ఉపగుప్తుడు:-

తే॥ గోడుగోడున ప్రజలు గగ్గోలువడగ
రక్తపాతమ్ము లాలికించి రాజ్యమెల్ల
* జయము సాధించుకొంటివే సార్వభౌమ!
సుతులకును లేని సౌఖ్యంబు పితకు నేల? 4

మ॥ వినవో! శాక్యమునిప్రబోధముల నుర్వీనాథ! దిగ్దేశముల్
ప్రణతుల్ సల్పిన ఆమహామహుచరిత్రల్ క్రొత్తలే! ఎందఱా
తని బోధామృతమాని శాంతిమయతత్త్వజ్ఞానులై, సర్వమం
దున నాత్మప్రతిబింబముల్ గనుచు నన్యోన్యమ్ముగా నుండిరో! 5

ఉ॥ నీవలె రాజవంశముననే జనియింపడొ శాక్యమౌని; వృ
ద్ధ్వీవర! సార్వభౌమపదవిన్ విడనాడి, పరార్థసిద్ధికై
జీవిత మెల్ల నంకితము జేసి జరామరణాతిరిక్తమౌ
త్రోవ నొకండు జేకొని నుతుల్ గొనడే సకలప్రజాళిచే! 6

ఉ॥ కత్తి కటార్లతో ప్రజలు కాతరులౌనటు చేసి, వారు నో
రెత్తిన నొక్కివేయుచు, మహీ పరిపాలన సేయుటే మహో
* దాత్తమొ?- లేక, పాలితుల ధార్మికబుద్ధి జయించి యేలుటే
యుత్తమమో?-ప్రశాంతముగ నొక్కక్షణమ్ము సమీక్ష సేయుమా!7

★ ★ ★

ఉ॥ ఆతరి, జామచుండగనె అల్లన, నల్లన పెద్దరూపునై
జ్యోతియొకండు దోచిన దశోకుహృదంతరమందు; తత్క్షణం
బాతనిలోని రాచరిక మంతము సెంది, 'అహింస' బీజమై
లోతుగజొచ్చి, వానియెదలో కుసుమించె దయాప్రసూనముల్. 8

# కావ్యసుధ

## 13 స్వప్న వాసవదత్తము శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి

### (షష్ఠాంకము)

[పాఠ్యభాగము శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు రచించిన 'స్వప్నవాసవదత్తము' లోనిది. దీనిని భాసుడు సంస్కృతమున రచించెను. తెనుగున శ్రీ శాస్త్రిగారనువదించిరి. వీరు ప్రస్తుతము గుంటూరుజిల్లా అమరావతిలోని హైస్కూలునందు పండితులుగా బనిచేయుచున్నారు. వీరు సంస్కృతము, తెనుగు, హిందీసారస్వతములందు బాగుగ కృషిచేసినారు. 'కరుణశ్రీ' యను గుప్తనామముతో వీరు తెనుగువారికి చిరపరిచితులు. వీరి కవిత్వము మృదుమధుర పదసంశోభితమై సరస్వతీచరణమంజీరమువలె హృదయాహ్లాద మొనరించును. వీరు భావ సుకుమారులు. వీరి కావ్యములు పాఠకుల కమృతతుల్యములు.

'అరుణ కిరణాలు'యను గేయ కావ్యమును, 'ఉదయశ్రీ' 'విజయశ్రీ' 'కరుణశ్రీ' యను పద్యకావ్యములు, 'కరుణామయి' యను నాటకములును వీరి యితర కృతులు]

[కాంచుకీయుడు ప్రవేశించుచున్నాడు]

కాంచు:- ఎవరక్కడ? కాంచనతోరణద్వారమునందు నిలువబడి యున్నారు?

[ప్రతీహారి ప్రవేశించుచున్నది.]

ప్రతీ:- ఆర్యా! నేను విజయను. తమ కేమి కావలయును?

కాంచు:- అమ్మా! ఉజ్జయినినుండి మహాసేనులవారిపంపున రైభ్యసగోత్రుడైన కాంచుకీయుడును, మహారాణి అంగారవతిపంపున వాసవదత్తదాదియగు వసుంధరయు వచ్చి ద్వారమువద్ద వేచియున్నారని, వత్సరాజ్యలక్ష్మీవిరాజితులైన మీ ఉదయన మహారాజుగారితో మనవి చేయుము.

ప్రతీ:- రాజసందర్శనమునకు ఇది సమయముకాదే!

కాంచు:- ఎందువలన?

ప్రతీ:- మనవిచేయుచున్నాను — ఇంతకుముందుగనే మహారాజు 'సూర్యాముఖప్రాసాదమునకు' వచ్చి ఎవరో వీణ వాయించినారు. ఆవీణాధ్వని విన్నంతనే మహారాజుగారు 'ఇది ఘోషవతీసనాద' మని పలికినారు.

కాంచు:- తరువాత, తరువాత.

ప్రతీ:- తరువాత మహారాజుగారు అతనివద్దకు వచ్చి 'ఈవీణ నీ కే విధంగా ప్రాప్తించింది?' అని ప్రశ్నించారు. ఆనూతన పురుషుడు 'మేము నర్మదా నదీ తీరమున విహరించు చుండగా ఒక చెట్టు పొదలో ఈవీణ చిక్కుకొని యున్నదనియు, ప్రభువులవారికిది ఆవశ్యకమైనచో తీసుకొని వచ్చుననియు. విన్నవించుకొన్నాడు. తరువాత మామహారాజుగారు ఆపురుషుని సబహుమానంగా సాగనంపి ఆ వీణను ఒడిలో నుంచుకొని మూర్ఛాక్రాంతులైనారు. కొంతసేపటికి ఒడలు తెలిసి కన్నులనుండి అశ్రుధారలు జలజల ప్రవహింప 'ఘోషవతీ! నీవు కన్పించితివి. దేవిమాత్రము దర్శన మీయలేదు' అని శోకింపసాగారు. ఆర్యా! మహారాజుగారు ఇట్టిఅవస్థలోఉన్నారు. ఈసమయంలో మీరాక ఏవిధంగా మనవిచేసేది?

కాంచు:- అమ్మా! మనవిచేయక తప్పదు. మా యాగమన కారణము కూడ అందులకు సంబంధించినదే!

ప్రతీ:- ఆర్యా! ఇదిగో మనవిచేస్తున్నాను. అరుగో! మహారాజుగారు 'సూర్యాముఖప్రాసాదం' నుంచి దిగివస్తున్నారు. ఇక్కడే మనవిచేస్తాను.

కాంచు:- అమ్మా! అట్లే కానిమ్ము! (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది మిశ్ర విష్కంభకము.

[అంత ఉదయనుడును విదూషకుడును ప్రవేశించుచున్నారు.]

ఉద:- ఘోషవతీ ! ఘోషవతీ !

ఉ॥ కమ్మని గీతులున్ శ్రుతిసుఖమ్మొనరించుచు హార్ద పారవ
శ్యమ్ముప్రవహించు దేవి ప్రణయాంకములో నిదురించు నీవయో !
దుమ్ము ధుమారమందు బడి దొర్లుచు నొంటరిగా నరణ్యవా
సమ్మెటు చేసినావు ? ఖగసంతతి తంత్రుల గూండ్లు పెట్టగన్.

విపంచీమతల్లీ ! దేవి వియోగము నెట్లు సహించుచుంటివి ? ఆతపస్వినిని విడిచి ఇంతకాల మెట్లొంటరిగా నుంటివి!? ఇంత కఠిన హృదయము నీ కెక్కడనుండి వచ్చినది ?

సీ॥ స్మరియించు చుందువా ! వరవర్ణినీవామ
పార్శ్వ నస్నేహ సంస్పర్శనములు-
తలపోయుచుందువా ! కలభాషిణీ రహః
ప్రణయ మంజుల నర్మభాషణములు-
భావించుచుందువా ! ప్రణయినీ సంగీత
శృంగారరస సమాలింగనములు-
చింతించుచుందువా ! సీమంతినీ నూత్న
విరహ విహ్వాల ముగ్ధ వీక్షణములు-
మనన మొనరించు చుందువా ! మధురమూర్తి
నిత్యకల్యాణ కంకణనిక్వణములు-
నాటి మన ప్రేమబంధ మీనాటి కిట్లు
పరిణమించి వియోగప్రబంధమయ్యె !

వసం:- మహారాజా ! మీ రీ విధంగా వియోగదుఃఖముతో క్రుంగి పోవటం ధర్మంకాదు.

ఉద:- వసంతకా !

గీ॥ మున్ను నాలో ప్రసుప్తమైయున్న ప్రేమ
వెండియు ప్రబుద్ధమయ్యె నీ వీణవలన;
ఘోషవతి నెట్టులో కనుంగొంటి కాని
దీని మోగించు ప్రియురాలు కానరాదు.

వయస్యా! వసంతకా! ఈ ఘోషవతిని మన శిల్పివద్దకు గొని పోయి తీవలు సరిచేయించి తీసుకొనిరమ్ము!

వసం:- ప్రభువుల ఆజ్ఞానుసారమే చేస్తాను.

(ఘోషవతిని తీసికొని నిష్క్రమించుచున్నాడు)

ప్రతీ:- (ప్రవేశించి) జయము జయము ప్రభువులకు! ఉజ్జయిని నుంచి మహాసేన మహారాజుల పంపున రైభ్యసగోత్రుడైన కాంచుకీయుడును, మహారాణి అంగారవతి పంపున వాసవదత్తదాదియగు వసుంధరయు వచ్చి ద్వారం దగ్గర వేచియున్నారు.

ఉద:- ఐనచో ముందు పద్మావతిని బిలుచుకొనిరమ్ము!

ప్రతీ:- చిత్తము! (నిష్క్రమించుచున్నది.)

ఉద:- ఏమీ! ఈవృత్తాంత మింత శీఘ్రముగనే మహాసేనులవారికి తెలిసినదా!

[అంత పద్మావతియు ప్రతీహారియు ప్రవేశించుచున్నారు]

ప్రతీ:- రాకుమారీ! రండి! ఇటు దయచేయండి!

పద్మా:- జయము జయము ఆర్యపుత్రులకు!!

ఉద:- పద్మావతీ! విన్నావా? మహాసేనులవారి యంతికము నుండి రైభ్యసగోత్రుడైన కాంచుకీయుడు వచ్చినాడట! పూజ్యురాలైన అంగారవతి పంపున వాసవదత్తాధాత్రి వసుంధరకూడ వచ్చినదట! ఇరువురు ద్వారమునం దున్నారు.

పద్మా:- చాలాసంతోషం! మన బంధువుల క్షేమసమాచారాలు వినటంకంటె కావలసిందేముంది!

ఉద:- చాలచక్కగ మాటాడితివి. వాసవదత్త బంధువులు నాకును బంధువులే యని భావించితివి. పద్మావతీ! రమ్మ. కూర్చుండుము! ఎందులకు సందేహింతువు?

పద్మా:- నన్ను సమీపమందుంచుకొనియే ఆర్యపుత్రులు వీరికి దర్శన మిస్తారా?

ఉద:- అట్లుచేయుటలో దోష మేమున్నది?

పద్మా:- ఆర్యపుత్రులు మఱొకతెను వివాహమాడినారని చిన్నబుచ్చుకొంటారేమో!

ఉద:- కాదుకాదు; పత్నీసందర్శనార్థులైన బంధువులకు పత్నీసందర్శనము కలిగించ లేదనే మహాదోషము నాపై నారోపించెదరు. అందువలన నీవు కూర్చుండక తప్పదు.

పద్మా:-ఆర్యపుత్రుల ఆజ్ఞానుసారమే! (కూర్చుండి) చూడండీ! పూజ్యులైన అమ్మగారూ నాన్నగారూ ఏమంటారోఅని ఆందోళనగా ఉన్నది.

ఉద:- పద్మావతీ! నీమాట నిజమే! ఏమందువా-

ఉ॥ వంచనచేసి తీసికొని వచ్చితి వాసవదత్త, నగ్నిక
ర్పించితి చేతులార, ఇపుడేమని పెద్దలు మందలింతురో
యంచు మనమ్ము సందియము నందెను, తండ్రికి నాగ్రహంబు తె
ప్పించిన ధూర్తుడౌ దుడుకు బిడ్డని కైవడి తల్లడిల్లెదన్.

పద్మా:- కాలమాసన్నమైనప్పుడు కాపాడుకోటానికి మనం సమర్థులం కాదుగదా!

ప్రతీ:- ప్రభూ! వారు ద్వారంవద్ద ఉన్నారు.

ఉద:- వెంటనే ప్రవేశపెట్టుము.

ప్రతీ:- మహాప్రసాదము !

(నిష్క్రమించుచున్నది)

[అంత కాంచుకీయుఁడు వసుంధర ప్రతీహారి ప్రవేశించుచున్నారు]

కాంచు:- ఆహా !

ఉ॥ ప్రాణము లేచివచ్చె ప్రియబంధువు రాజ్య మిదంచు, బిడ్డని
ర్యాణకథల్ తలంచుకొని నంతన గుండెలు బ్రద్దలయ్యె; మా
ప్రాణ సమానమైన నరపాలసుతన్ బ్రతికించి, పావ సో
పానము రాజ్యమే పరుల పాలొనరింపక పోతివా విధీ !

ప్రతీ:- అరుగో మహారాజుగారు ! సమీపించండి !

కాంచు:- (సమీపించి) జయము జయము మహారాజులకు !

వసుం:- జయము జయము ప్రభువులకు !

ఉద:- (సగౌరవముగ) ఆర్యా !

గీ॥ మనుజవిభులకు నుదయాస్తమయము లెవని
హాసమును చంద్రహాసము నాచరించు;
అతడు కుశలమే ? మా వియ్యమందుకొన్న
శాంతమూర్తి మహాసేనచక్రవర్తి,

కాంచు:- చిత్తము ! మహాసేనులవారు కుశలముగ నున్నారు. ఇచ్చట
మీ అందఱి కుశలము నడిగినారు.

ఉద:- (సింహాసనమునుండి లేచి) మహాసేనుల వారేమని సెలవిచ్చి
నారు ?

కాంచు:- వైదేహీనందనులకీ వినయము యుక్తమే ! కాని మహా
సేనులవారి సందేశము కూర్చుండియే వినవలెను.

ఉద:- వారి యాజ్ఞ శిరోధార్యము. (కూర్చుండును.)

కాంచు:- మహాసేనులవారి సందేశ మిది—శత్రుహస్తగతమైన సమస్త రాజ్యము సౌభాగ్యవశమున మరల మీకు సంప్రాప్తమైనది. చాలాసంతోషం.

గీ॥ పుట్టదుత్సాహమే పాఱుబోతులందు
మందబుద్ధులయం దసమర్థులందు,
జగతి నుత్సాహవంతులౌ సజ్జనులకె
రాజ్యభోజ్యమగు నెందు సామ్రాజ్యలక్ష్మి ?

ఉద:- ఆర్యా! ఇదంతయు అవంతీశ్వరుల యనుగ్రహమే! ఏమందురా-

శా॥ చేతంజిక్కిన నన్ను తండ్రివలె వీక్షించెన్, కృతఘ్నుండనై
కూతుంగైకొని లేచివచ్చిన మదింగోపింపడయ్యెన్, యథా
రీతిన్ మన్ననచేసె నన్ విని యు తద్వృత్తాంత, మీనాఁడు ప్ర
ద్యోతక్ష్మాపతి కాదె కారణము సద్యోరాజ్య సంప్రాప్తికిన్ !

కాంచు:-ఇది మహాసేనులవారి సందేశము. ఇక మహారాణి అంగారవతి యంపిన సందేశ మీవసుంధర వచింపగలదు.

ఉద:- అమ్మా !

గీ॥ అంతిపురిలోని పదునార్వురందు నగ్ర
గణ్యురాలు, ప్రజల్ గొల్చు పుణ్యురాలు,
మా ప్రవాసంబు నోర్వని మాతృదేవి,
ఉజ్జయినిలో సుఖంబుగా నున్నదమ్మ !

వసుం:- ఆరోగ్యవంతురాలైన మా మహారాణి దేవరవారి కన్ని విధముల సేమమును అడగమన్నారు.

ఉద:- మా కుశలము ఈ విధముగా నున్నది.

వసుం:- దేవరవారీ విధంగా దుఃఖముతో క్రుంగిపోవటం ధర్మంకాదు.

కాంచు:- మహారాజుగారు మనస్సు నిబ్బరించు కొనవలెను. ఆర్య పుత్రులచే ఇంతటి అనురాగముతో ననుక్షణము స్మరింపబడెడి మారాజపుత్రి మృతురాలయ్యును బ్రతికియున్న దే. ఆమెకై శోకింపకుఁడు-

గీ॥ మరణ మరు దేర మనుప సమర్థు డెవడు ?
త్రాడు తెగిపోవ ఘటమును తోడు నెవడు?
కానలో చెట్లభాతి లోకమ్ము రీతి
విరుగుచుండు యథావిధిఁ బెరుగుచుండు.

ఉద:- ఆర్యా ! ఈవిషయముమాత్ర మటువంటిదికాదు.

గీ॥ ఆమహాసేన రాజేంద్రు ననుఁగుబిడ్డ
స్నేహమయురాలు నా ప్రియశిష్యురాలు
వలచి వలపించుకొన్న లావణ్య సీమ
మఱపురా దామె జన్మజన్మములకైన.

వసుం:- మామహారాణి ఈవిధంగా చెప్పమన్నారు. మాతల్లి వాసవదత్త వెళ్ళిపోయింది. మాకు పాలక గోపాలకు లెటువంటివారో అటువంటివాడవేనీవు. మొట్టమొదటనే నీవు అల్లుఁడవు కావలెనని అభిలషించాము. అందుకనే నిన్ను ఉజ్జయినికి రప్పించుకొన్నాము. వీణావ్యాదేశంతో అనగ్నిసాక్షికంగానే నీకు అమ్మాయిని అప్పగించాము. చంచలమనస్కుఁడవై ననీవు మా అభిప్రాయం గుర్తించక పెండ్లికాకుండానే పెండ్లికొమార్తెను తీసికొని వెళ్ళిపోయినావు. అనంతరం మేము మీయిరువురి ఆకారములుగీయించి ఆచిత్రఫలకముల కేవివాహామహోత్సవము జరిపించి మా ముచ్చట తీర్చుకొన్నాము. ఆకల్యాణచిత్రమును నేడు నీకు పంపుతున్నాము. దీనిని దర్శించి చింతాక్రాంతమైన నీస్వాంతమునకు కొంత ఊరట కల్పించుకొనుము.

ఉద:- ఆహా ! పూజ్యురాలు అంగారవతీదేవి సానుభూతి సందేశము సౌహార్దసమన్వితముగా నున్నది !

గీ॥ వందలకొలంది రాజ్యముల్ ! వడయుకంటె
దేవిసందేశ మధిక సంతృప్తి నొసగె
సాపరాధులమైన మాయందు కూడ
తరిగిపోలేదు మాతృవాత్సల్య మింత !

పద్మా:- ఆర్యపుత్రా ! చిత్రఫలకంలో ఉన్న అక్కగారిని ఆలోకించి నమస్కరించాలని మనస్సు తొందరపడుతున్నది.

వసుం:- అభ్యంతరం ఏమున్నది! రాకుమారీ రండి ! ఇదిగో చూడండి!
(వాసవదత్తా చిత్రఫలకమును చూపించుచున్నది.)

పద్మా:- (చూచి, స్వగతము) ఇదేమి ? ఈమె యాకారమూ పూజ్యురాలైన ఆవంతిక యాకారమూ చక్కగా సరిపోతున్నవే (ప్రకాశము) ఆర్యపుత్రా ! ఇది అక్కగారి యాకృతికి సరియైన ప్రకృతియేనా ?

ఉద:- సరియైన ప్రకృతియేమి ! సాక్షాత్తుగా వాసవదత్తయే యీమె !

గీ॥ ఇట్టి లావణ్యలహరిపై నెట్లు పడియె
కాలపురుషుని ప్రళయ భీకర కరాలు !
అగ్ని కాహుతియై భస్మమగుటయెట్లు
మధురమోహన మీ ముఖ మండలమ్ము !

పద్మా:- ఆర్యపుత్రుల చిత్రముకూడ ఆలోకించిన అనంతరం ఈచిత్రం అక్కగారిది అవునోకాదో నిర్ణయిస్తాను.

వసుం:- చూడండి ! రాకుమారీ !

(ఉదయన చిత్రఫలకమును చూపుచున్నది.)

పద్మా:- మమ్మూర్తులా ఆర్యపుత్రల ప్రతికృతియే! అందువల్ల ఇది అక్కగారి చిత్రమనటంలో అనుమానం లవలేశమూ లేదు.

ఉద:- దేవి! ఈ చిత్రములను దర్శించినది మొదలు, నీలో సంతోష సంతాపములు పొంగులెత్తుచున్నట్లు తోచుచున్నది. ఇందులకు కారణము?

పద్మా:- ఆర్యపుత్రా! ఈ చిత్రములోని రూపరేఖలుగల స్త్రీ ఇచ్చటనే ఉన్నది.

ఉద:- ఏమి! వాసవదత్తా రూపరేఖలుగల వనితా శిరోమణియా?

పద్మా:- ఔను.

ఉద:- ఐనచో వెంటనే తీసుకొనిరమ్మా!

పద్మా:- ఆర్యపుత్రా! నాకన్నె వయస్సులో ఒక బ్రాహ్మణుడు నాసోదరి యని చెప్పి ఒకమ్మాయిని నావద్ద న్యాసంగా ఉంచి వెళ్ళాడు. ఆమె ప్రోషిత భర్తృక. అందువల్ల అన్యపురుష సందర్శనము అంగీకరింపదు. కనుక ఎప్పుడైనా నా వెంట ఉన్నప్పుడు ఆమెను ఆర్యపుత్రులు అవలోకింపవచ్చును.

ఉద:-గీ॥ ఆమె విప్రసహోదరి యనుట వలన
దేవి కాదన్న విషయము తేలిపోయె;
దాని కేమి లోకమ్ములోఁ గానవత్తు
రొండొరుల పోలికలు గల్గి యుండువారు.

ప్రతీ:- (ప్రవేశించి) జయము జయము ప్రభువులకు! ఎవరో ఉజ్జయినీ దేశపు బ్రాహ్మణుడట! పూర్వము రాజకుమారి చెంత న్యాసముగా దాచిపోయిన తనసహోదరిని తిరిగి తీసికొనిపోవుటకు వచ్చినాడట ద్వారము దగ్గర వేచియున్నాడు.

ఉద:- పద్మావతీ! ఆబ్రాహ్మణుడేమై యుండునా?

పద్మా:- కావచ్చు!

ఉద:- (ప్రతీహారితో) అంతఃపురోచిత మర్యాదలతో నావిప్రుని వెంటనే ప్రవేశపెట్టుము.

ప్రతీ:- చిత్తము ! (నిష్క్రమించును.)

ఉద:- పద్మా నీవుకూడ నామెను తీసికొనిరమ్మా.

పద్మా:- చిత్తము. (నిష్క్రమించును.)

[అంత పరివ్రాజక వేషధారియై యౌగంధరాయణుఁడు, ప్రతీహారి ప్రవేశించుచున్నారు.]

యౌగం:- (స్వగతము) ఆహా !

ఉ॥ స్వామి హితార్థమై పరమ సాధ్విని దేవిని దాచి, శేముషీ
శ్రీమహితుండనై తగిన సేవయొనర్చితి, రాజ్యలక్ష్మికిన్
సేమము సేకురెన్, శ్రమకు సిద్ధిలభించెను, గాని తేఁడు నేఁ
డేమని చెప్పునో యనుచు నెంతయు స్వాంతము సంశయించెడిన్.

ప్రతీ:- అదిగో మహారాజుగారు ! సమీపించండి

యౌగం:- (సమీపించి) జయము జయము.

ఉద:- (స్వగతము) ఈకంఠస్వరము మున్నెన్నఁడో విన్నట్టు యున్నది.
(ప్రకాశము) బ్రాహ్మణోత్తమా ! మీ సహోదరిని పద్మావతి
దగ్గర న్యాసముగా నుంచినమాట యథార్థమేనా ?

యౌగం:- చిత్తము ! యథార్థమే !

ఉద:- అట్లయిన తత్క్షణమే ఈయన సోదరి నిటకు తీసికొనిరండు.

ప్రతీ:- చిత్తము ! (నిష్క్రమించును.)

(అంత పద్మావతియు, అవంతికా వేషధారిణియగు వాసవదత్తయు, ప్రతీహారియు ప్రవేశించుచున్నారు.)

పద్మా:- అమ్మా ! రండిరండి! మీకు ఒక తియ్యనివార్త వినిపిస్తాను.

వాస:- ఏమి టేమిటది ?

పద్మా:- మీ అన్నయ్యగారు వచ్చినారు !

వాస:- ఎంత అదృష్టం ! ఇప్పటికైనా మాఅన్నగారికి గుర్తువచ్చాను.

పద్మా:- (మహారాజును సమీపించి) జయము జయ మార్యపుత్రులకు ! ఇదిగో ! న్యాసము !

ఉద:- పద్మావతీ ! నీన్యాసమును బ్రాహ్మణునకు సమర్పింపుము. న్యాసమును సాక్షుల సమక్షమున నప్పగించుట సమంజసము. పూజ్యులైన ఈకాంచుకీయుడును వసుంధరయు నీవిషయమున సాక్షులు కాఁగలరు.

పద్మా:- బ్రాహ్మణోత్తమా ! ఇదిగో మీసహోదరి ! స్వీకరించండి !

వసుం:- (ఆవంతికను పరిశీలించిచూచి) వాసవదత్త ! వాసవదత్త ! రాజకుమారి ! వాసవదత్త !

ఉద:- ఏమి ? మహాసేనకుమారియా ! దేవీ ! నీవు పద్మావతితో నంతఃపురమును ప్రవేశింపుము.

యౌగం:- అట్లుకాదు ! ఈమె నాసోదరి ఆవంతిక !

ఉద:- కాదు కాదయ్యా బ్రాహ్మణుడా ! ఈమె మహాసేనపుత్రి వాసవదత్త !

యౌగం:- ఓ మహారాజా !

ఉ॥ భారత వంశ వార్ధి హిమభాను సమానుడవే సదా సదా
చార శుచిస్మితుండవె ! విచార వినీతుడవే పవిత్ర సం
స్కారముగల్గు ప్రాజ్ఞుఁడవె ! చాలు నిటుల్ పరకాంతలన్ బలా
త్కారముగా గ్రహించుట అధర్మము ! ధర్మపథైకరక్షణా !

ఉద:- అట్లయినచో రూపసాదృశ్యమును పరీక్షించి నిరూపించెదము. మేలిముసుగును దీయింపుడు.

యౌగం:- (పరివ్రాజక వేషము పరిత్యజించి) జయము జయము దేవరవారికి !

వాస:- జయము జయ మార్యపుత్రులకు !

ఉద:- (ఇరువురను పరిశీలించి చూచి) ఆహా ! ఎంత అదృష్టము. వీరు మహామంత్రి యౌగంధరాయణులా ? ఈమె మహాసేన పుత్రి వాసవదత్తయా !

గీ॥ ఇది యథార్థమె స్వప్నమో యెఱుఁగ, మరల
కాంత కందోయిముందు సాక్షాత్కరించె :
చెలియ యిటులనె కానవచ్చినది మున్ను
చేతికందక మోసపుచ్చినది నన్ను !

యౌగం:- ప్రభూ ! ఇంతపర్యంతము దేవిగారిని దాచియుంచి తమకు ఎంతో అపరాధముచేసినాను. ప్రభువులు నన్ను మన్నింపవలెను.

(అని పాదములపై బడుచున్నాడు.)

ఉద:- (లేవదీసి) మహామంత్రి యౌగంధరాయణులు రాజభక్తి పరాయణులు ! మీ ప్రజ్ఞావిశేషము లనన్య సామాన్యములు.

ఉ॥ మాయలమారి తంత్రములు మంత్రములెన్నొ యథోచితమ్ముగాఁ
జేయుటెగాదు, యుద్ధములు సేయుటెగా, దొక పిచ్చివేషముల్
వేయుటెగా, దహర్నిశము వేఱు విధంబుల సాయమై, మహో
పాయనిమగ్నులన్ మము నుపాయము పెంపున నుద్ధరింపరే !

యౌగం:- ప్రభువుల యదృష్టరేఖలే మాంకు మార్గదర్శకములు !

పద్మా: ఈమె పూజ్యురాలు వాసవదత్తాదేవియా? అమ్మా ! మిమ్ము సఖీజనంతోబాటు సామాన్యంగా చూచాను. మర్యాదతప్పి నడచిన మీ సోదరిని క్షమించండని పాదములు పట్టుకొని ప్రార్థించుచున్నాను. (నమస్కరించును)

వాస:- (పద్మావతిని లేవనెత్తి) సోదరీ ! లెమ్ము ! సౌభాగ్యవతివి కమ్ము ! అర్థించినంతనే నాకు ఆశ్రయమిచ్చి రక్షించావు. నీమేలు మరువలేను.

పద్మా:- మహాప్రసాదము !

ఉద:- మహామంత్రీ ! దేవిని మరుగుపరుచుటలో మీయుద్దేశమేమి ?

యౌగం:- కౌశాంబీసంరక్షణము !

ఉద:- బాగున్నది ! మరి మగధరాజపుత్రివద్ద వాసవదత్తను న్యాసముగా నుంచుటలో మీ రాశించిన ప్రయోజనము ?

యౌగం:- పూజ్యులైన పుష్పక భద్రాది దైవజ్ఞులు ప్రభువుగారికి పద్మావతి భార్యకాగలదని వాక్రుచ్చిరి.

ఉద:- ఈ సంగతికూడ మన రుమణ్వంతునకు దెలియునా ?

యౌగం:- ప్రభూ! ఇందులో నందరము తోడి దొంగలమే.

ఉద:- ఆహా ! రుమణ్వంతుడెంత మాయలమారి యైనాడు !

యౌగం:- ప్రభూ ! వాసవదత్తా కుశలవార్త నివేదించుటకు పూజ్యులైన వసుంధరా రైభ్యులను ఈ దినమే ఉజ్జయినికి పంపవలయును.

ఉద:- కాదుకాదు ! పద్మావతీసహితముగ మనమందరమును గలసియే పోవుదము.

యౌగం:- మహాప్రసాదము !

(భరత వాక్యము)

గీ॥ రక్షణమొనర్చుగాత ! మా రాజ సింహ
చక్రవర్తి ఏకచ్ఛత్ర సమ్మితముగ
చతురుదధివేల్లితము, హిమశైల వింధ్య
కుండలమ్మగు వసుమతీమండలమ్ము !

(అందరు నిష్క్రమించుచున్నారు.)

---

# 14 మిత్రభేదము    పరవస్తు చిన్నయసూరి

[మిత్రభేదమను యీ భాగమును పరవస్తు చిన్నయసూరిగారు రచించిరి. ఇది నీతిచంద్రికలోనిది. దీనియందు మిత్రలాభమను మరియొక భాగమును కలదు. ఇవి రెండును నీతిదాయకములు. అజ్ఞాన వినాశకరములు. 19వ శతాబ్దమునగల తెనుగు దేశపు విద్వాంసులలో సూరిగారు ప్రముఖులై యుండిరి. వీరు చెన్నపురి విశ్వవిద్యాలయములో తెలుగుపండితులుగానుండి విఖ్యాతిగాంచిరి. ప్రభుత్వమువారు స్వర్ణ కంకణములచే సూరిగారిని బహూకరించిరి. తెనుగుబాసయందు గద్యమును రచించుటలో యీయన కీయనయే సాటి.

గీర్వాణభాషయందుగల పంచతంత్ర హితోపదేశములనుండి సూరిగారు యీ భాగద్వయమును నీతిచంద్రిక యనుపేర అనువదించిరి. తక్కినభాగములు తెనిగింపకమున్నె వీరు లోకాంతరగతులైరి. సూత్రాంధ్రవ్యాకరణము, బాలవ్యాకరణములనుగూడ సూరిగారు రచించిరి. తరువాతివారు జాలదనుక వచనరచనమున చిన్నయసూరిగారి ననుకరించిరి.]

అనంతరము రాజపుత్రులు విష్ణుశర్మతో నిట్లనిరి. "స్వామీ! మీ యనుగ్రహము వలన మిత్రలాభము వింటిమి. ఇంక మిత్రభేదము వినఁగోరెదము." అనిన విష్ణుశర్మ యిట్లు చెప్పదొడంగెను.

"ఒకవనములో సింహవృషభములు మిక్కిలి చెలిమిగలిగి యుండెను. ఒక మాయావి యయిన గోమాయువు వానికి విద్వేషము పుట్టించి సింహముచేత వృషభమును జంపించెను. ఆ కథ మీకు సవిస్తరముగా వినిపించెదను. సావధానముగా వినుండి.

దక్షిణాపథమందు రక్షావతి యను పట్టణము గలదు. అందు వర్ధమానుఁడను సార్థవాహుఁడు వాసము చేయుచుండెను. అతఁడు తన కంటె సంపన్నులయిన తన బంధువులను జూచి వారికంటె మిక్కిలిగా ధనము సంపాదింప వలెనని యెంచి యిట్లు చింతించెను.

అర్థము పురుషార్థములలోపల నుత్తమము. అర్థవంతున కసాధ్యము లోకమందు దేదియుఁగానము. కాబట్టి పురుషుఁడు న్యాయము

దమనకుం డిట్లనియె. "ఈ యరణ్యము మనకు మాన్యక్షేత్రమా? లాంతి చోటికిఁ బోఁగూడ దని నియమమా? మఱి యరణ్యము లేదా? అభిజన మెవ్వరికిఁగాని దుస్త్యజమే. అట్లని చావున కొప్పుకోవచ్చునా? ఈ విచారమేల? యిప్పుడు మనకు వలస దీయునంత యిడుమయేమి వచ్చినది? ఈ వఱకా జంతువు నల్లనిదో, తెల్లనిదో యెఱుఁగము. అది క్షుద్రజంతువో మహాజంతువో ముందు తెలిసికొని, పిమ్మట గర్తవ్యము విచారింతము. పిట్ట కొంచెము కూఁత ఘనమన్నట్టు క్షుద్రజంతువునకు సయితము పెద్ద నోరుండవచ్చును. జంతు వంత బెట్టిదము గాదనుటకు నాకుసూచన కొంత గానఁబడుచున్నది. నీవును చూడుము. ఆ వంక జంతువులు కలగుండుపడిన లక్షణ మేదియుఁ గానరాదుగదా! మంచిది యాలకింపుము. క్షోభ మేమాత్రము పుట్టిన నలబలము వినరాకుండునా? అనిన గరటకుండిట్లనియె. 'అవు నది నిజమేకాని కడపట నది యిట్టి జంతువు కూఁత యని మాత్రమాకళింతకు రాలేదు.' అని చెప్పి కొంతదడ వూరకుండి చిఱునవ్వు నవ్వి యిట్లనియె: "ఇప్పటికి స్మరణకు వచ్చినది. మఱి యేమిగాదు, విను. కొన్నాళ్ళకు మునుపు వర్తకుఁ డొకడు దారిని బోవుచుండి యీడువఁ జాలక యీడిగిలఁబడిన యొక బక్కయెద్దును బ్రయాణత్వరఁబట్టి యీ యడివిలోవిడిచి పోయినాడు. అది యీ కాటిలో గడ్డిపరకలకొఱికి తేఱుకొని కొంత చియ్యఁబట్టి యక్కడక్కడ నఱ్ఱాడగాఁ జూచితిని. అప్పుడు మనము విన్నది దాని ఱంకె. దానికి సందేహము లేదు. ఊరక యీ వఱకుఁ బనికిమాలిన పిఱికితనము తెచ్చుకొంటిమి. మనకంటె శూరుఁడు మనరాజు! నాఁవుడు దమనకుం డిట్లనియె: "మనము పింగళకునకు మంత్రి పుత్రులమైయుండి యిప్పు డొప్పరికింపరాదు. డాయఁబోయి యాతని భీతి మాన్పింతము. ఈ నెపముచేత నాతని కొలువు సంపాదించుకొని యనుగ్రహము వడయవచ్చును. రాజానుగ్రహము బొందిన వానికి సర్వ సంపదలు గలుగును. మనమాతని తొంటినిగ్రహము పాటింపరాదు, మనకుఁ దదనుగ్రహ సంపాదనము ముఖ్యము గాని తక్కిన మోఱకుఁదనమేల" అనినఁ గరటకుఁ డిట్లనియె. "దమనకా? వినుము. ఈతని సంగతి

నాకు సరిపడదు ! మునుపు కొలువుండి పడ్డపాట్లు చాలును. ఈతఁడెత్తు వారిచేతి బిడ్డగాని యొకతెన్నునఁ బోవువాఁడు గాఁడు. ఇట్టివాని కొలువు మిక్కిలి కష్టము. అది యుండనిమ్ము. ఉదరపోషణముకయి పరులకు శరీర మమ్ముకొనుట మిక్కిలి హేయము. పరాయత్తవర్తి నుఁడు మృతకల్పుఁడు. అయినను సేవకుఁడు స్వకృత్యములయందు స్వామిచేత మన్ననం బడసెనా సేనాదుఃఖము కొంత సిస్తరించును. ఉపేక్షితుఁడయ్యెనా దాని కంటె దుఃఖము లేదు. పరాభూతుఁ డయ్యె నేని చెప్పవలసినదేమి ? సేవావృత్తిచే వచ్చు పాయసముకంటె స్వచ్ఛందవృత్తిచే లభించు గంజి మేలు. కాఁబట్టి ప్రాప్తలాభముచేఁ దృప్తిపడి సుఖముండుదము. ఇప్పుడాతని భీతి మానుప వలసిన జోలి మన కేమి గలదు ? కొరమాలిన పని పయిబెట్టుకొన్నవాఁడు మేకును బెరకిన కోతివలెఁ దప్పక ముప్పుఁజెందును.

మనమిప్పుడాతని భృత్యపదమందు లేము. అతనికిఁ గ్రొత్త కొలువుడు కాండ్రనేకులున్నారు ! స్వామి హితాహితముల విచారము వారిదిగాని మనయధికారములేదు. పరాధికారము పయివేసికొన్నవాఁ డోండ్రవెట్టి మోఁదువడిన గాడిదవలె వినాశము బొందును.

కాఁబట్టి పరాధికారము మనము పయిఁబెట్టుకోరాదు. అక్కడక్కడఁ బసరములఁ డొక్కలు వెదకుట మనకార్యము. అదిమాని యీ విచారమేల ? భక్షితావశిష్టమయిన మాంసము కావలసినంత యున్నది. రా రా, భక్షింతము.

అనినఁ దమనకుఁ డిట్లనియె; ఇప్పుడు త్వరయేల ? మెల్లఁగాఁ బోయి భక్షింతము. ఎల్లజంతువుల కాహార నిద్రాభయములు సహజ ధర్మములు. కుక్షింభరత్వముచే గారవమురాఁబోదు. మిత్రామిత్రుల కుపకారాపకారములు చేయవేఁడి బుద్ధిమంతు లాశ్రయము గోరుదురు. స్వోదరమాత్రము భరింపనేఁడు లేఁడు? ఏవాఁడు జీవింప ననేకులు జీవింతురో వాని మనుగడయే సఫలము. వాఁడొకఁడు జీవించువాఁడు. ఆమిషశూన్యమయి సౌగంధిలమైన శల్యము దొరకినమాత్రాన వేఁపి

మిక్కిలి సంతోషపడును. గాని దానిచే హానియుంగద గొంతయైన నడంగదు. కేసరి యాసన్నమైన ప్రముక్కడి మృగమును లెక్కింపక, నిజఖర నఖరవిదారిత హస్తిమస్తమస్తిష్కమకోరును. ఎల్లవారు సత్త్వానురూపమైన ఫలమె వాంఛింతురు. శునకము తన కోగిరము పెట్టువాని కడఁజేరి తోఁకాడించును. నేలబడి నోరు కడుపు జూపును. ఇన్నిపాట్లు పడుకుక్క కొక్కముద్దవంటకముకంటె మిక్కిలిపెట్టరు. ద్విరదము కరము ధీరముగా విలోకించుచు సారె కాధోరణోపలాలితమై మెల్లఁగాఁ గబళముఁగొనియెడిని. హీనుఁడెంతదీనభావముతో వేఁడినను వానికెవ్వరును దనియఁబెట్టరు. గారవముగలవానికి వినయవచనములతోఁ గోరికకుమీఱనిత్తురు. అనవద్యమగువిద్యచే, సవక్రమగు విక్రమముచే, నిరపాయమైన యుపాయముచేత, నృపాలురమెప్పువడసినవాని మనుగడయే మనుగడ. శునకముసయితము కమికెడన్నముదిని మనలేదా? గఱువతనము మానక తనకలిమి కొలదిని లాఁతులకు మేలొనరించువాని జీవన మొక్కనాటిది యయినంజాలును. స్వోదరమాత్రపూరకమగు కరటము చిరకాలము మనిన ఫలమేమి? అనతిజలముచే మొరపనేల వెల్లివాఱిచినట్లు కొలది లాభముచే క్షుద్రునందు హర్షము వొడమును. హితాహితవివేకము లేక విహితకర్మలు మాని స్వోదరమాత్రము పూరింపఁగోరువాడు పశుతుల్యుఁడు. అంతియకాదు. భారవాహియయి తృణమాత్రాశనమయి కృష్యాదికర్మముల కత్యంతోపకారమయి పవిత్రజన్మమయిన వృషభము నరపశువుకంటె మేలుగాదె?

అనిన గరటకుఁ డిట్లనియె; "ఓదమనకా! మనము ప్రధానులము గాము. మనకీ విచారముతో నేమి ప్రయోజనము?" అనిన దమనకుఁ డిట్లనియె.

"ప్రధానుఁడు కావుట కెంతసేపుపట్టును? పురాకృతసుకృతమువలనఁ బ్రజ్ఞావంతుండౌను. ప్రాజ్ఞుఁడు రాజపూజితుఁడవును. రాజసమ్మానముచేతఁ బ్రజ్ఞమిక్కిలి ప్రకాశించును. వానివలనఁ దంత్రావాపములు నడప సమర్థుఁడగును. ఆసామర్థ్యముచేతఁ బ్రధానత్వముఁ బడయును. ఎట్టి ప్రజ్ఞావంతుఁడు గాని పేటికాంతర్గతరత్నముంబోలె

నినునాలోకనా యోగము లేక ప్రకాశింపదు. పురుషుఁడు సాధువర్తనుఁడయ్యేనేని సర్వలోకపూజ్యుఁడగును. కానిచో గర్హ్యుఁడగును. మానావమానములు ప్రవర్తనాయత్తము లయియుండును గుణవంతుఁడని పేరు పడుట దుర్లభము. లాఁతి విధము సులభము. మహాగ్రావమును గ్రావాగ్రము నెక్కించుటంబోలెఁ గ్రిందికిఁదోఁచుట దుష్కరముగాదు.

నావుఁడు గరటకుఁడిట్లనియె. రాజసేవవలని ప్రయోజన మెఱుఁగనివాఁడఁగాను; తొల్లి యీతని వలనఁ బడ్డపాట్లు తలఁచుకొన్నమాత్రానఁ దల కంటగించుచున్నది. కాఁబట్టి యట్లు వచియించితిని. భృత్యుల గుణదోషములయందు వివేకము చాలని రాజును గొలుచుట దుష్కరము. నీవు వివేకివి. అన్యులచేతఁ జెప్పించుకొనవలసిన యర్థము నీ కొకటి లేదు. ఉచితమయినట్లు చేయుము. ఇప్పుడునీవు చేయఁబూనిన కార్యమేమి ?" నావుఁడు దమనకుఁ డిట్లనియె.

"మనరాజు పింగళకుఁడు జలపానార్థము కాళిందికిఁ బోయి యెద్దుఱంకెవిని భయపడి తీర్థావతరణముమాని వెఱఁగుపడి యున్నవాఁడు. పరహృదయము ప్రత్యక్షముగాదు. కాఁబట్టి యాతని చిత్తవృత్తి నీవెట్లు తెలుసుకొంటివనబోకు. ఈయర్థ మాతని యాకారముచేతనే నా కవగతమైనది. ధీమంతునకుఁ బరులభావము సుగమమయి యుండును. తురంగమాతంగాదులు సహితము చెప్పినయర్థము గ్రహించి వహనాది కార్యములఁ బ్రవర్తిల్లుచున్నవి. పరేంగితావగాహి యయిన బుద్ధియొక్కటియే పండితునకు విశేషము. అది లేని నాఁడు పండితునకు బామరునికంటె విశేషమేమి ? అది యటుండనిమ్ము. కర్తవ్యాంశము వినుము. నేనిప్పుడు రాజుపాలికిఁబోయి తద్భావానురూపముగా ననుసరించి వలసిన మాటలాడి యీకార్యము నీవు చేయుమని యాజ్ఞాపింపఁజేసికొని మనసునకెక్కఁ బ్రవర్తించి యాతని మన్ననలు వడసెదను.

అనినఁ గరటకుఁ డిట్లనియె. 'రాజులకొలువుం గోరువారు మెలఁకువ గలిగి ప్రవర్తింపవలెను: వారి చిత్తవృత్తి యెఱిఁగి మెలఁగుట

కడిఁది. అది స్వచ్ఛందవృత్తివంటిది గాదు. నావుఁడు దమనకుఁ డిట్లనియె. ఉద్యోగికి దూరభూమియు, విద్వాంసునకుఁ బరదేశమును, ప్రియవాదికి శత్రువును లేనియట్లు బుద్ధిమంతున కసాధ్య మొకటి లేదు. సద్వర్తనము గలిగి నిచ్చలు తమ్ముఁ గొలుచువారిని రాజు లాదరింతురు. భృత్యుఁడు తేని కోపప్రసాదముల యంగమచ్చము లెఱిఁగి మెలఁగనేని దదనుగ్రహమునకుఁ బాత్రుఁ డవును.' అనవుడుఁ గరటకుఁ డిట్లనియె. "తొలుత రాజునుజూచి నుడువ దొరకొను నర్థమేది?" నా విని దమనకుఁ డిట్లనియె. "ఈ యర్థము వచింపవలెనని నియమము గలదా? ప్రతిభాశాలికిఁ బ్రభువునెదుర సమయోచితముగా వచింపవలసినది బహువిధములుగా నుండును. సేవకుఁ డడఁకువ దోఁపఁ గట్టెదురుపట్టుదలఁగి యేలిక మొగమున చూపునిలిపి యాతఁడు తన వలను చూచునెడఁ దత్కాలోచితముగఁ బౌర్వాపర్యము విచారించి తేసిభావ మూహించి తక్కుఁగల రాజభృత్యులకు నవిరుద్ధముగ నేరిమినీటుఁ బలుకవలసిన యర్థమున పలుకవలయును."

అనినఁ గరటకుఁడు, "నీకు గార్యసిద్ధిఁ గావుత. అదె తేఁడును మరలి తన యిరవునకుఁ జనుచున్నవాఁడు. ఆతఁడిరవు చేరునంతకు నీవుంబోయి దాఁకొనవచ్చుఁ బొమ్ము." నావుఁడు దమనకుఁడు పింగళకుని పాలికిఁ బోయి అడఁకువతోడ నొదుఁకువాటున నిలిచి భయభక్తులు పిరిగొనఁ దొట్రువడుచు జోహారులొనరింప మృగేంద్రుఁ డతని సాదరంబుగ వీక్షించి కూర్చుండ నియమించి "కుశలమా! బహుకాలమునకు నిన్నుఁ జూడగలిగె" నావుడుఁ దమనకుఁ డిట్లనియె.

"దేవా! తావకంబగు నపాంగావలోకంబునకుం బాత్రంబైన యీవనక్షేత్రంబున జంతుసంతానంబుల కావంత యేనిఁ గొఱంత కుశలంబునం గలుగదనం దావక సేవకులగు మావంటివారి కయ్యదియడుగం బనియేమి? అవసరంబగుడు సేవకుం డనాకారితుండయ్యు రావలయుఁ గాదె? స్వామికిం దఱియెఱిఁగి భృత్యుండు హితాహితంబు లెఱిఁగింపవలయును. ఉపేక్షకుండయునం బ్రియవాది యయినను స్వామిద్రోహి

యగు-స్వామిద్రోహికి సర్వశ్రేయంబులు చెడును. సదసద్వివేక సంపన్నుఁడయిన ప్రభువునకు మాబోఁటి క్షుద్రులవలన నరయందగిన యర్థం బొకటి కలదే యని విచారింపఁ బనిలేదు. చక్షుష్మంతునకే దీపంబుగాని యంధునకుం గొఱయగునె? ఒక్కటి విన్నవించెద నవధరింపుఁడు. బహుదేశాటనంబును, బహుశ్రుతులతోడ నిరంతర సాంగత్యంబును, గావ్యశాస్త్ర విచారంబును, రాజాస్థానంబుల బహుకాలసేవనంబును బురుషున కెట్టివాని కేని వివేకంబు బుట్టింప సమర్థంబు లయి యుండును. ఈ నాలుగింట నొక్కండేని నెవ్వానికి లేకుండు' వాఁడు కూపస్థమండూకంబుంబోలెం దనముక్కునకుం జక్కని మీఁదిదె యాకాశంబు, తనగొందియ లోకంబని యెంచి, స్వజీవన మాత్రంబునకుం దృప్తివొంది లోకవృత్తంబున మూఢుండయివసించును. చిరకాలం బేలిన వారి పాదంబుల కొలువుసేయుచున్న మాబోంట్లు ప్రముక్కుడలయ్యు విద్యావివేక సంపన్నులగుట సన్నిధాన ప్రభావంబు చేతంగాదె? స్వామికి క్షేమంబు గాంక్షించు భృత్యుండు ప్రాప్తానుయోగ్యుండయ్యుం దడవి యెఱింగి వలయు నర్థంబు వచింపవలయు. అయినను స్వామి చిత్తంబునకు వేఱొండుగఁ దోఁచునేమో యని మనంబు తేకువం బొరసెడు. నావిని పింగళకుండు, "దమనకా! నీవు మాకు హిత భృత్యుఁడవు. నీవచనంబు మాకవశ్య గ్రాహ్యంబు. మేము నీకు గ్రొత్తవారమే! ఏల జంకువడియెదవు? నీ యిచ్చవచ్చిన చొప్పునం జెప్పవచ్చును." నావుఁడు దమనకుండు కరంబున నోరుమూసికొని యీ వచనంబు లాలించి "బుద్ధి బుద్ధి యని దేవా!" యింతకుం గొంత ముందు యమునాకచ్ఛంబునకుం బోయి యచ్చట ఱిచ్చవడిన తెఱంగు దోఁపం గొంతసేపు చిత్రరూపంబు వగిదింజూపట్టి మరలి యిరవున కరుదెంచితిరి. ఇందులకు నిమిత్తంబుగానక చిత్తం బుత్తలంబు నొందెడు. అయ్యది చెప్పవచ్చునని దేవర చిత్తంబునకుం దోఁచిన సేవకుండు వేచియున్నవాఁడు." నావిని పింగళకుండు "దమనకా! విను మాకు నీవు పరమాప్తుండవు. నీకు దాఁపురము చేయునర్థము మాయందొకటియైన గలుగదు. అఖిలసత్త్వశరణ్యంబయిన యీ యరణ్యంబు మదధీనంబు.

ఈదేశంబున నాయాదేశంబునంగాక యాకయినంగదల వెఱచు. వింటివా నేడొక్క విపరీతంబు? పిపాసార్తితుండనయి యమునా తరంగిణి కరుగుచుండ నుఱుము తెఱంగున మొరపం బొక్కటి కర్ణగోచరంబయ్యె. ఆ నినదంబు విన్న చోటనే వితాకువడి నిలిచితిని. ఇసుమంత యయిన నంతరంగంబున భయంబునం బొరయక యిట్లు ఘోరం బయిన యారావంబు గావించిన జంతువలంతిగ నుండదని చింతించెద! లోకంబున నుత్తముండగు శూరునకుం బరప్రకర్షంబు సహ్యంబగునే? అలంతి వానినేనిం బగవాని నొప్పరికింపం జన దన లాఁతివానిఁ జెప్పనేల? ఎట్టివానికేనిం బలదర్పంబునఁ బగతు నొప్పరికించునట్టివాని కశక్తి భీరుత్వంబులు లోకు లారోపింతురు. వలదని వాకొనకుండ మూఁకుట నోళుల గ్రమ్మవచ్చునే? ఇట్లువడుకంటె నోడలు విడచుట మేలుగాదె? ఊరక దోఁగకంటెఁ బోరునది శ్రేయోదాయకంబయి యుండును. దైవయోగంబున మారుతుఁడు దొరెనేనిం గడుమేలయ్యె. కావున నిప్పుడ దాయపయి నొండెఁబోవుదము. అరాతి నిరాసంబ పరమార్థంబుగం గోరితిమేని దదుపాయాన్వేషణం బావశ్యకంబు. బలవంతుం బగతునుపాయంబు చేతన సాధింపవలయును. కావున నిప్పటికిఁ దొలంగి చని కాలదేశోచితంబగు వలయునుపాయంబు సముపార్జించుకొని విపక్షు శిక్షింత మొండె. ఇందు నీకెయ్యది బోలియున్న యది చెప్పు" మనిన దమనకుండు కొంతవడి చింతించి "తుదముట్టఁ గారణంబు తెలియక తమకింపరాదు, శబ్దమాత్రంబునకు నివ్వెఱ బొరయం జనదు.

స్వామిముదల యిచ్చినం జాలును. ఈక్షణంబ యా చప్పుడుప్పతిల్లిన చాయకుం బోయి తత్కారణం బారసి నీతెంక రాఁగలడు. అనినం బింగళకుం డాతని మొగం బట్టె చూచి కొంత చింతించి. "యిదియ యిప్పటి కుచితం బని తోఁచుచున్నది. కరంబు పరికింపక యే కార్యంబునకేనిం దమకింప లగ్గుగాదు. ఎదిరి సమ్ముఖంబున మాటలాడ నూటివడెనేని బలాబలంబులు కొలది మెఱింగి తత్కాలోచితంబుగ నాపుత్తెంచిన మాటలుగ నాడవలసిన నీకుఁబోలిన తెఱంగున నాడి, యెదిరిని లోఁ గొనవచ్చునేని నట్లు నడపుము. నీవన్నిటం

జతురుండవు. నీకుం జెప్పవలయునే? పోయిరమ్ము. నావుడు దమన
కుండు గ్రక్కున వెడలి తొల్లియా మ్రోఁత యేతెంచిన జాడన పోయి
యాపొలంబు నలుఁగెలంకులు కలయంజూచి యడుగుల చొప్పువట్టి
డాయంబోయి సంజీవకుంగాంచి, "యోయి వృషభేంద్రా! నేను
మృగేంద్రుని భృత్యుండను. ఆతండనుప నీపాలికి వచ్చితి. అతఁడు
దానుగ నీతోటనాడుమాటలు నాకుంగఱపి పుత్తెంచినవాఁడు. వినుము.
ఈ యరణ్యంబు మదధీనంబు దీనంగల సత్త్వంబు లన్నియు నా శాస
నంబు వహించి వర్తించుచున్నయవి. నీవును నా యాజ్ఞానువర్తివయి
యుండునది. ఇంతియకాదు. మదీయానుచరులంగూడి వర్తింప నీకుం
బ్రియంబేని ననురూపంబగు రాజకార్యం బొసంగెద. నీయిష్టంబెయ్యది
యది యనుసరింపవచ్చునని యానతిచ్చె. ఇంతకుమునుపు నీవు నిశ్శం
కంబుగ అఱకై వైచితివి కాఁబోలు! దాని విని యేలికకు నీపాలఁ
కువ విచారణీయంబయ్యె. నీవు భయఁపడకుము. అమ్మహామహుఁడు
కరుణాళుఁడు. ధార్మికుఁడు గావున సజ్జనులకు గమ్యుండయి యున్న
వాఁడు. నీవు శంకింపక యేతెమ్మని నుడివి యొడంబరచి ముందు
మృగేంద్రుని పాలికింజని 'స్వామీ! దేవరయాజ్ఞ చొప్పునఁబోయి పరి
కించితి. మీరావిన్న యారావంబు గావించినవాఁడు మీకనుగ్రాహ్యుఁడు
గాని నిగ్రాహ్యుండు గాఁడు. తావకంబగు నవక్ర విక్రమంబు విని
భయాక్రాంతుడయి యున్నవాఁడు. ప్రభంజనుండు మహాభూజంబుల
భజించుంగాని వినతంబులగు తృణవితానంబులు వెకలింపఁ గడంగు
నెట్లు? శక్తిసంపన్నుండు దన్నుమాఱుకొను వానియందుఁ దనబలంబుఁ
వెలయించుఁ గాని మ్రుక్కడుల లెక్కింపఁడు. ఇట్టిగుణంబు లేలిన
వారికి సహజంబులై యున్నవి. అవసరంబగుడు వచియింప వలసెంగాని
దేవరకు ముందర వాక్రువ్వవలయునె? అతఁడు సంజీవకుండను వృష
భేంద్రుఁడు. బుద్ధిమంతుడు. ఏలినవారి యోలగంబున వర్తింప జాలిన
వాఁడు. అతని స్వామి పాదంబుల చెంతకుం గొనివచ్చెద. ముదలయే;
యనం బింగళకుండు చిరునగవుతోడ నంగీకార సూచకంబుగ మొగం
బెగురవేయ మహాప్రసాదంబనుచు వినమిత గాత్రుండై యొదుగుచు

వైళంబ చనిసంజీవకున కెదురువోయి, "నీభాగ్యము కతంబున మృగరా జొంటిగ నున్నవాఁడు. కానిపించుకొన నిదియె సమయంబు. మసలక యేతెమ్మని" వెంటం దోడ్కొనివచ్చి తేని కట్టెదురు దాలంగించి కొంత చెంత నిలుప సంజీవకుండు భయవినయ సంభ్రమంబులు ముప్పిరిగొన వినమ్రుండయి వందనం బాచరింప మృగేంద్రుండు సాదరంబుగం బ్రసాదమేదురంబగు క్రేగంటిచూ పతనిపయిం బొలయ 'నిను మా దమనకుండు పెక్కుతెరంగుల నుగ్గడింప విని సంతసించినారము. నీయట్టి ధీమంతుఁడు మా కొలువు నీయకొనుట మాకుం బరమ లాభంబని యెన్నుచున్నవారము. మంత్రిపదంబు నీకొసంగినారము. జాగరూకుండవయి మన్నియోగంబులందు మాకు మేలుగఁ గార్యంబులు నిర్వహించుచుఁ బరివార సంరక్షణాది కార్యంబులు కొఱంత వడకుండ జరుపునది.' అని యానతిచ్చి యది దొరంకొని తానును మంత్రియు బద్ధసఖ్యంబున నుండి నానాఁటం దక్కంగల పరివారంబు వలన నిరాదరుండై యుండె.

దానం జేసి దమనకుండుతన యురువున కరుదెంచి చింతాక్రాంతుండయి యుంటఁగాంచి, కరటకుండు 'తమ్ముఁడా నెమ్మొగంబు విన్నంబోవ ఖిన్నుండవయి యున్నాఁడవు. కతంబేమి'? యని యడిగి యాతనిచేతం తత్కారణంబారసి కొండొకతడవు మిన్నకుండి, "మీఱిన పని కూరక విచారపడ నేమిఫలంబు? మన కేల యీ పెద్దతనంబులని మొదలనె పెక్కువిధంబులం జాటి చెప్పితిని. నీవు నేర్చిన నీతులన్నియుఁ జెల్లుగ వల్లించితివి గాని నా పలుకొకటియయినఁ జెవిఁ జొరనిచ్చితివె? తన్నుఁ గట్టఁ ద్రాళ్లు దాఁ దెచ్చుకొన్నట్లు రాఁగల హాని గానక తేని తోడ లేసి పెద్దఱికంబులు కొన్ని నోరి కసిదీర నాయెద్దునకుం గలుగం బలికి చెలికారంబు చేయించితివి. ఇప్పుడనుభవింపక తీఱునె? ఇది నీ నేరమింగాదె?' నావుఁడు దమనకుండు నిట్టూర్పు నిగిడించి తల పంకించి యుంకించి మొగం బెగనెత్తి "కరటకా! నీవచనంబు సత్యంబు. దూరము విచారింపక చేసితిని. ఇంక నేమిచేయవచ్చు? దైవంబు ప్రతికూలం బయినం బురుష కార్యంబెల్ల వ్యర్థంబయి చను. కావున

నన్నూరక దూరకుము. ఇట్లు నేనొక్కండన కాను. ఆషాఢభూతియును వానిచే నొక్కసన్యాసియు మేష యుద్ధంబుచే నొక జంబుకమును ధన ప్రాణంబులు గోలుపోయిరి".

అని చెప్పినం గరటకుం "డెట్టి ధీమంతునకే నొక్కొక్క కాలంబున బ్రమాదంబు వాటిల్లుట స్వాభావికంబు దానికి వగవంబనిలేదు. నీవింకం జేయందలంచిన కార్యంబేమి?" యని యడిగిన దమనకుం డిట్లనియె. "వినాశోన్ముఖ కార్యంబు మేలువరచుటకు భావ్యర్థసంగ్రహంబున కనర్థ ప్రతీకారంబునకు నర్హంబగు మంత్రంబె శ్రేయంబు. కావున నదియ కర్తవ్యంబు. అందుం బింగళ సంజీవకులకు భేదంబు పుట్టించు నుపాయంబు పరికించుట ముఖ్యంబు దానం జేసి మనకెల్ల యర్థంబులు సిద్ధించు. మన మిప్పు డుపేక్షించినం బిదపం బింగళకు డాయుట దుష్కరంబు." నావిని కరటకుం "డదియెట్లు సాధ్యంబగు?" ననిన దమనకుం డిట్లనియె. "ఉపాయంబుచే నే యది శక్యంబగు నాయది పరాక్రమశతంబు చేత నయిన శక్యంబు గాదు. కాకం బొక్కం డుపాయంబుచే దనకు విరోధియగు సరీసృపంబును దోరించె.

బుద్ధిబలంబుగలవానికిం దక్కబలంబు లేకుండినగొఱత లేదు. ధీశక్తి విరహితునకుం దక్కంగల బలిమి యెంతగలిగిన నసత్కల్పంబయి చను. తొల్లి యొక శశకంబు నేర్పునం జేసి యొక సింగంబుం దున్మంగించెను.

పింగళకుం దొల్లి సేవించుచుండి కాటక పాటకంబులను రెండు జంబుకంబులు కృతాపరాధంబు లగుటం జేసి నిష్కాసితంబులయ్యె. అయ్యవి వెండియు జేనియనుగ్రహంబు సంపాదింపం గోరి సంజీవకు ననుసరించుచున్నయవి. ఇదియు మదీయోద్యోగంబున కనుకూలంబయి కానంబడుచున్నయది సెలవిమ్ము పోయివచ్చెద. నావిని కరటకుండు వృక్షమూలంబుం జేరిన ప్రువ్వును మెలపున మూల చ్ఛేదంబుగాకుండ వెలార్చి మాయించుట నేర్పరితనంబు. నీ వెఱుగని యర్థంబు గాదు. నీకుం గార్యంబు సిద్ధించుం గావుత మెడసేయకపొమ్ము." నావుడు

దమనకుండు పింగళకుని పాలికింబోయి ప్రొక్కి మొగంబు వ్రేలవయిచు కొని దీన భావంబు భావించుకొని నిలుచుండం బింగళకుండు గాంచి "దమనకా! యేల యట్లు తెలివిదప్పి యున్నవాడవు. మాకుం బరమాప్తుండవు: లోకంబునం దెవ్వఁడేని జీవింపంగోరువాడు నీకుం గీడు దలంపడు. నీఖేదంబునకు నిమిత్తంబు దెలియునంతకు మా చిత్తంబు త్తలం బడియెడు, గొంచక వాక్రువ్వుము." నావుడు దమనకుండు 'స్వామీ! మతివిహీనుండనయి మహాపరాధంబు గావించితిని. నావలనం గరుణింపుడు. క్షమింపుడు. భృత్యుండు స్వాపరాధంబు స్వామికి నివేదింపక మొఱంగంజనదు. మొఱంగిన వాఁడు రెండు లోకంబులకుంగాక చెడు. అదియట్లుండనిమ్ము. పెక్కండ్ర మనుగడకు మూలంబగు పుణ్యపురుషున కొక్కయెడరు వాటిల్లిన నది యొక్కటి శోచ్యంబుగాని మాదృశుఁడు క్షుద్రుం డొక్కరుండు పొలిసిన దానం గొఱంత లేదు. దానఁ లోకం బస్తమింపదు. సమక్షంబున భృత్యుల వర్తనంబు లెల్లం గీర్తనీయంబులై యుండుంగాని యందు దోషంబు లేశంబుం గానంబడదు. అట్లగుటం జేసి యధీశ్వరుండు స్వపరోక్షంబునం దత్త ద్వర్తనంబులు చారముఖంబునం బరికించి హితాహితుల నిర్ణయించి యనుగ్రహ నిగ్రహంబులు మెరయించుచుం బ్రజావృక్షంబునకు మూలంబగు తన్ను రక్షించు కొనవలయు. స్వామీ! సేవకుం డేమో విన్నవించెదునని యాలంబుచేయక యాలకింపుఁడు. సంజీవకుల వర్తనంబు పరికింపం దొంటి తెఱంగుగాదు. అన్యాయంబు నుడువఁ గూడదు. మొదల సంజీవకుని ప్రవర్తనం బనన్యాదృశంబుగ నుండె. ఆతని చరిత్రంబునకు మేమందరము మిక్కిలి యాశ్చర్యపడుచుందుము. ఈతండు తొల్లి యెల్లతఱి మిమ్ము నవ్యాజ ప్రేమంబునం గొలుచుచు మీ కార్యంబులందుఁ బ్రమాదంబు లేక ప్రవర్తించుచుండు. కార్యంబుతరి నీరు వట్టని యాఁకలియని నిద్రయని చూడఁడు. చక్కెర దిని చేఁదనవచ్చునే? తొంటి తెఱఁగు విచారింప సంజీవకుండు లోకంబులోనివాఁడే! ఏమి కాలదోషంబో యిప్పుడీతం డాతండుగాఁడని తోఁచెడు. ఈతఁడు తొల్లి మీగుణంబులు వేనోళ్ళం గొనియాడుచుండు. అప్పుడాతని నిర్భరానంద పారవశ్యంబునకుఁగొలంది

లేదు. కొంతదూరంబునకు వెనుక మాబోటు లెవ్వరైన మిమ్ముం బ్రశంసించుచో సత్యము సత్యమా నౌనని యంగీకార సూచక వచనంబుల తోడనే నాలించుచు వచ్చె. అనంతరము దేవర ప్రశంసనంబు వచ్చిన మందహాసంబుతో వినుచుండు గాని యట్టిట్టని వచియింపం గానము. ఇటీవల నేమి కతంబొ యేలినవారి ప్రసంగంబులం దెచ్చికోలు వికాసంబె కాని నిక్కంపు మందహాసము లేశంబయినం గానబడక యున్నయది. ఈతని యనుభావంబు వింతయయి కానంబడుచున్నయది. దీనికిం గతంబేమొకో యని మనంబున రోయుచుండుదు. నేఁడు మదీయాప్తులు కొందరు మాటవెంబడి స్వామిచే నిగృహీతులగు వారితో సంజీవకుండు చెలికారంబు సేయుచున్నవాఁడు కాటకు పాటకుల తోడ నిచ్చలు మంత్రంబు నిర్వర్తించుచున్న వాడని వినిపించిరి. దీనం జేసి యీతని భావంబు నిర్ణయించితి. స్వామి హితంబు కాంక్షించు వాఁడు స్వప్నావస్థయందైన స్వామిద్రోహులతోడ సఖ్యంబునకుఁ బాలుపడునే ? " అని నుడివి ప్రక్క వెనుకలు కలయంజూచి కరంబున నోరు మూసికొని శ్రవణమూలంబు చేర మోరసాగించి యల్లన నిట్లనియె! "ఇది దేవరసన్నిధినున్న భృత్త్యులకెల్లం దెల్లంబయి యుండవచ్చు. సంజీవకుని వలని భీతిం జేసి యిచ్చటివారు బయలు పొంగకున్నవారు కాఁబోలు. ఇంతయేల యొక్కనిం బిలచి విచారించినం జిత్తంబునకు విశదం బయ్యెడు." నావిని పింగళకుం డద్భుతరోష విషాదంబులు పెనంగొనం దన సేవకుని నొక్కనిఁ బిలిచి "యిచ్చటి కొలువుడుగాండ్రు డేరేనిం గాటక పాటకులతోడి నేస్తంబు సేయుచున్న వారే? నావుడు వాఁడు భయంబడి గుటకను మ్రింగ "వెఱవకుము. సత్యంబు వాకుఁృవ్వుము. దానం గొఱంతలే" దని ఱేఁడు వలుక విని వాఁడిట్లనియె: "సంజీవకుండు వారిచేరికకు మేలుకొని యున్నట్లు కానంబడుచున్నది" నావుడు విని మే మడిగిన యర్థం బిక్కడన మఱచి పొమ్ము. బయలనుబ్బనీకుము. పొద" మని వానింబుచ్చి పింగళకుండు ఖిన్నుండయి క్రిందు జూచుచు మిన్నకుండంగాంచి; వెండియు దమనకుం డిట్లనియె:"ఇప్పటిచొప్పుపరికింప మనతోడనింక సంజీవకుండు మనః వం

గలసి వర్తింపఁబోఁడు. అతని తెఱంగు కొంత యెఱింగినవార మగుటం జేసి మనకును వొంటిచందంబు డెందంబు పొందియుండదు. అయిన నీతండు పెద్దకాలంబు దేవరయాస్థానంబు నందుండి చిత్తంబున కెక్కం బ్రవర్తించినవాఁడు. చిరకాలసేవి యగు భృత్యుండు తెలిసి తెలియములం జేసి యొక్క యపరాధం బొనరించిన క్షమియింప వలయుఁగాని పెఱలంబోకె వానిం ద్రోసి పుచ్చుట ధర్మంబుగాదు. కావున నీతండింతదనుక జేసిన దుష్కార్యం బావిష్కరించి యలుకు పుట్టించి క్షమియింప వేఁడుకొలిపి యిట మీఁద నిట్టికార్యంబుఁ సేయకుమని నాతికఠినంబుగఁ బలికి యెప్పట చొప్పున నాతనికొలువీకొనుట సర్వవిధంబుల నుచితంబని తోఁచుచున్నయది." అనవుడు మృగపుంగవుం డాకర్ణించి మొగం బెగయించి దమనకుని మొగంబునం జూపులు వొలయ నించుక మనంబునం బరికించి "రాజద్రోహుల నెల్లవిధంబుల దండించుట యుచితంబు. అయినను నాహృదయంబు వానివలన బహుకాలంబు స్నిగ్ధం బగుటం జేసి యొక్క తెగువకుం జొఱదు. కావున వెలార్తమొండె; నీ చెప్పిన చొప్పు గావింతమొండె" నావుడు నక్కలరాయం డిట్లనియె: "ఇది యిప్పటికిం దోఁచిన తెఱంగు. అయినను సాహసంపడి యొక్క కార్యంబు చేయుం జనదు. 'సహసావిదధీత నక్రియా'మని నీతికోవిదులు వక్కాణింతురు. ఇది మఱి యెవ్వరితోడ నేని నొక్కధీమంతునితో దేవరచిత్తంబునకు వచ్చినవానితో విచారింతము. అప్పటికి దేవర కుచితంబని తోఁచిన యర్థంబు మేకొందము. దూరంబు విచారించి చెప్పినదానం గొఱంత లేదు. ఇంతలోనన మిగిలి చనుకార్యం బేదియుఁ గానము." నావుడు మృగపతి 'యిందలి వారందఱు నీవెఱింగిన వారుగాని లాఁతులు లేరు. వారివారి బుద్ధి కౌశలంబులు నీవెఱుంగుదువు. నీ యిచ్చకువచ్చిన వానిం జెప్పుము.' నావిని దమనకుండు కొంతొకవడి తప్పలిడక యుప్పరంబుచూచి మరల మృగరాజుం గాంచి "మదగ్రజుండు కరటకుండు ప్రజ్ఞావంతుండు దేవరహితంబు గోరువాఁడు. అతండు చిత్తంబునకువచ్చు నేని యప్పుడు రప్పించెదనని చెప్పి యొప్పించి యొక్కరాజభటునిం బుచ్చి రాపింపం గరటకుం డనయంబు

వినయంబు మెఱయ వందనంబుగావించి మృగస్వామిచే ననుయుక్త స్వాగ
తుండై తదాదిష్టంబయిన యుచితాసనంబునం గూర్చుండ నతండు దమన
కుంజూచి 'యీ వృత్తాంతంబు ససాకల్యంబుగ నీతనికి వినిపింపు మనవుడు
దమనకుండు కరటకునితోడ సంజీవకుని భూత భవంతి వర్తనంబులును
తేసికిం దనకు నందులకయిన సల్లాపంబును వినిపించి "యిందవసానంబున
మదుక్తార్థంబును తేని వచనంబును వింటివి కదా ! ఇందు నీకుం బోలిన
యది వాక్రుప్పు." నావుడుం గరటకుండు కొండొక మనంబునం బరి
కించి దమనకుం జూచి "తేని యెఱుంగని యర్థం బొక్కండు లేదు.
కార్యాకార్యంబులు నిర్ణయింప మన మెంతవారము? అయిన నమాత్య
పదంబున నున్నవార మగుటం జేసి యవసరంబునం దోంచిన యర్థంబు
విన్నవింపక మిన్నకుండ జనదు. అంతరం బెఱింగి రాజద్రోహంబు
గావించినవానిని సర్వ విధంబుల వెలార్పం జనదు. వెలార్చిన వాండు
పగఱంగూడి బగ సాధింపం గోరుంగాని తన చేసిన దోషంబు పరికింపం
బోడు. మన కప్పుడు గోరంబోవు పని గొడ్డటం దీర్చవలసి వచ్చును.
కాదని యెప్పటి చొప్పునం గలిపికొని వర్తింతుమేనిం బూర్వం బొక్క-
పరి యెడరు వొండింపం గడంగి పెఱ లెఱుంగుట వలన విఫలమనో
రథుం డగువాండు వెండియుం జేయు నుద్యోగంబు ఫలాను మేయంబై
యుండు. అట్టివానిం జేర్చుకంటెం గీడు వేఱొండు గలదె; అధీశుండు
తనకు నపాయంబు రోయు భృత్యు నుపేక్షింపం జనదు." నావుడుం
బింగళకుండు "కరటకా ! నీవు వాక్రుచ్చినయది సత్యంబు అయినను
జిరకాల సఖ్యంబునం జేసి వానిం గొండొక కీడునకుం జొప్పింప మనం
బొప్పదు. నే నేమి చేయుదు ?" నావుడుం గరటకుం డిట్లనియె. "ఆరో
గ్యము గోరువాండు చికిత్సకుని వలన నౌషధంబుంబోలె శ్రేయంబుగా
రక్షించు నాయకుండు భృత్యునివలన హితం బవశ్యంబు గ్రహింప
వలయు. దేవరకుం దెలియని యర్థం బొక్కండు లేదు. కొండొకదప్పు
పరికించినం గర్తవ్యంబు చిత్తంబునకుం దేటపడియెడు. నీతికోవిదుండగు
భూవల్లభుండుపధాశుద్ధుం గొలువున కీకొన వలయునుగాని తక్కు-
తెఱంగయినం బర్యవసానంబునం దప్పక ముప్పువాటిల్లు. ముందు

మంద విస్ఫురణీయును చిరపోతు డిండిమంబను మత్కుణంబుతోఁ గొలఁది తెలియక సాహసంబున కీకొని హానిం జెందె."

అనిన విని పింగళకుం డిట్లనియె. "నా విక్రమంబు జంతు సంతానంబులకు మృత్యుప్రాయంబని లోకవిశ్రుతంబు. సంజీవకుఁడు నాపయి నెత్తుట కాలాగ్నిపై నుఱుకుటగాదె! అయిన నిన్నడిగెద. సంజీవకుండు నాకు నే వెరవున నెదురొడ్డఁగలండు." నావిని కరటకుండిట్లనియె: "క్షుద్రుండయ్యుం జిరపరిచయంబుచే జాతమర్ముం డగువాడెంత వాని నేనిం దరివేచి సాధించుట సుకరంబై యుండును. ఏవారి కేని నొకప్పుడు గాకుండిన నొకప్పుడు ప్రమాదంబు వాటిల్లకుండునే? నీతికోవిదుండు శాత్రవుని క్షుద్రునే నొప్పరికింపం జనదు." నావిని పింగళకుండుకొంత చింతించి "మన మీమంత్రంబుతోడన కార్యంబు నిశ్చయించి సంజీవకు నొక్క కీడునకు లోపఱిచితిమేని లోకంబు మనల నిందించుం గాని లోగుట్టు తెలియంజాలదు. లోకాపవాదంబునకు భయంపడవలయును. అంతియకాదు ప్రకృతివర్గం బవిమృశ్యకారియగు రేనియందు విరక్తిం బొందదు. దానంజేసి సర్వశ్రేయంబులు చెడును- కావునందుదకుఁ దోఁచిన యొక్క యర్థంబు వక్కాణించెద. దమనకుండు సంజీవకు పాలికింబోయి వానితోడ నిట్లు వాక్రువ్వనవలయు. "నీవు రాజద్రోహుల తోడం జెలికారంబు చేయుచుంట రేఁడెఱింగినవాఁడు. కరంబు కుపితుండయి యున్నవాఁడు. అయిన నతండు దీనవత్సలుండు గావున నీవు నావెంబడిం జను దెంచి నిజాపరాథంబు నివేదించి ప్రార్థించితివేనిం బ్రసన్నుండగు" నని వచియింపుము. మనచే నయినంత దనుకం గలుపు కోలుఁదనంబున కడంగుదము. "నీచాః కలహమిచ్ఛన్తి సంధిమిచ్ఛన్తి సాథవ"యని ధర్మజ్ఞులు వచియింతురుగాదె? ఊరక వేరిమికయి యాడికొంట కెంతసేపుపట్టు? మనము ఋజుమార్గంబునం బ్రవర్తింతము. సంజీవకుండు నీ వచనంబులకు ననుకూలుండయివచ్చెనేని మేలొందెడు. తక్కినఁ దత్ఫలం బనుభవించెదును." అని పలికి దమనకుం జూచి "నీవు పోయిరమ్ము మన యిక్కడి తక్కిన వచనంబు లేవియుం బ్రవ్వకుము." నాపుడు దమనకుండు వల్లెయని యల్లల్లంజని యానసంబున

దీనభావంబు గదురఁ బదంబులు దొట్రిల డాయంబోవ సంజీవకుండు
గాంచి బ్రత్యుత్థానంబొనరించి యుచితాసనంబునం గూర్చుండఁ జేసి తదను
భావంబునకు నిమిత్తంబు మానసంబునం బరికించుచు "మీయందఱకుం
గుశలంబే?" యనిన దమనకుండు విని "పరాధీన వర్తనులకుం గుశ
లంబున కెంత యంతరంబు? రాజసేవా పరుండు మృత్యుగ్రస్త
తుల్యుండు. లేనిమచ్చిక నచ్చికయిడి పెద్దకాలంబు సుఖియింప
గాంక్షించు వాఁడు మృగతృష్ణికా ప్రవాహంబుం గాంచి యుదన్యాప
నోదనంబుకయి ప్రధావించువాఁడుగాఁడె? ఏకతంబున నేని లేని సాకతం
బునకు మోరకు తీరున ధీరుండు మోసంబొందఁడు; నావిని నోవల్ల
భుండు "నీవచనభంగి విచారింప నేదియో నొక్క విశేషంబు గలుగం
బోలునని తోఁచెడు" ననుచు నేకాంత కాంక్షాసూచకంబుగం దన
యిరుపక్కియలుం బిరుచక్కియు నాలోకింపఁ బిఱింది దెసనున్న
కాటకపాటకు లల్లన లేచి యెడఁగలుగంబోవుడు, దమనకుండు వారి
దెస యపాంగ వీక్షణంబున సూచించుచు "వీరలఁ జేరుటయె నీయిడు
మకు మూలంబయ్యె" నావుడు సంజీవకుండు భయాధీన మానసుం
డయి "యచ్చట జరిగిన వృత్తాంతం బేమి?" యని యల్లన నడిగిన
దమనకుం డిట్లనియె. "చేటెఱుంగని పాటుపడియెదవు. కాటకపాటకులు
రాజద్రోహులని యెఱింగియుండియు వారలతోడ సఖ్యంబు సేయు
చున్నవాఁడవు. ప్రభువునకె కాదెవ్వరికయిన నిది యనుచితంబని
తోఁపకుండునా? ఈ యర్థంబు పార్థివుం డెఱింగి దుర్వార క్రోధ భీష
ణుం డయియున్నవాఁడు. తొల్లి నావచనంబునందు విశ్వాసంబిడి లేని
పాల జేరితివి. కావున నున్నరూపు వచియించెద వినుము. సంజీవకు
పక్షం బవలంబించి మత్సమ్ముఖంబున వసియించువారి నెవ్వరినేనిం
దక్షణంబ కృతాంతనిశాంతావేశకులం జేసెదనని హర్యక్షాధ్యక్షుండు
కరంబు క్రూరంబుగ సంగరంబొనరించి యీక్షణంబ సంజీవకుం
దోడ్కొని రమ్మని నన్నుఁ బుచ్చినవాఁడు. మీఁది కార్యంబు నీయిచ్చ
వచ్చినట్లు గావింపుము. ఈయనర్థంబూరక పుట్టదు. చేరువం జేరి
యెవ్వరో చెవిగఱచెదరు. వెండియు నిట్టివి యేమిపుట్టునో యెఱుగము.

నేఁడు నీకయినయది ఱేపు మాకయ్యెడు. అతీతకార్యంబులకు విచారం పడ నయ్యెడు ఫలంబేమి? ఎన్నఁడు ఱేనికి బానిసతనంబునకుం బూని కొంటిమి, నాఁడె మృత్యువునోరం జొచ్చితిమి. ఇందులకయి యిప్పుడు వగచుట గతజలసేతుబంధనంబు" అని నిట్టూర్పు నిగిడించి ఖేదవిషాదంబు లభినయించువాఁడు క్రిందుచూచుచు మిన్నకుండ సంజీవకుం డవ్వచనంబు వజ్రపాతం బాహార్యంబునట్లు ధైర్యసారం బగలింపం గొంతవడి వెఱపెల్లిదంబున నివ్వెఱపడియుండి యెట్టకేలకు హృదయంబు పదరించుకొని దమనకుం గనుగొని యిట్లనియె.

"అనారతంబు ఱేనికి లగ్గు దలఁతు గాని యొగ్గు గలయందయినం దలంచి యెఱుఁగ, లాఁతివారి కయిన నొక [illegible]ప్పమి గావింప మనంబు చొప్పడి యుండునే? అకారణంబుగ ఱేని కిట్టి బెట్టిదంపు గ్రోధంబు పుట్టించి సాధువులం జెఱుప నొడిగట్టిన పుణ్యాత్ము లాబ్రహ్మకల్పాంతంబు మనియెదరు గాఁబోలు! సర్పంబులకు విషంబుం బోలె ఖలులకు దోషంబు సహజంబు వారిం జెప్పనేల? ఱేని యవివేకంబ సర్వానర్థకంబులకు మూలంబు. పార్థివుం డెద్దినె నసినం గొట్టంబునం గట్టింపు మనువాఁ డయ్యేనేని లెంకలు కొంకుమాని యిచ్చకు వచ్చినట్లు ఱేని నకార్యంబులకు ద్రోఁచి యశోహాని బుట్టించి పరలోకదూరుం జేయుదురు. ఇంత కాలంబు పార్థివు ననుగ్రహంబు సంపాదింపఁగోరి నా పడిన పాటులెల్లం బొల్లయయ్యె. వివేకరహితుం డగు దొరం గొలుచుట నిష్ఫలంబగుట మాత్రంబ కాదు. ప్రాణహానియు నాపాదించు. మనోవాక్కర్మంబుల నొకప్పుడయిన నీషత్తయిన దోషంబుచేసి యెఱుంగ. సంతతంబు స్వామికి క్షేమంబ కాంక్షింతును. అట్టి నా కిప్పుడు మృత్యువు వక్త్రబిలంబు చొరవలసివచ్చెఁ గాదె? అన్యులకు నెన్నండును గీడు రోసి యెఱుఁగను. నా కొరుఁడు నెరగు వెదకునె యనం జనదు. రాగద్వేష దూషితాత్ముల మానసంబులు సాధువుల యందు వికృతింబొరయును. తొల్లి కాక వ్యాఘ్ర జంబుకంబుల్లు పరమసాధువగు లొట్టియం గపటోపాయంబుఁ బన్ని దమస్వామి యగు సింగంబుచేఁ ద్రుంగించెను."

సజ్జనుండయ్యు దుర్జనులతోడి సంసర్గంబునం జేసి దుర్జనుండు నాఁబడు. బకోటఝూటంబుతోడ వసియించు హంసంబును బకం బండ్రుగాదె? భూనాథుండు సాధుచరిత్రుఁడయ్యు నే ప్రకృతివర్గంబు నట్లగు "యథారాజా తథాప్రజా" యని నీతికోవిదులు వక్కాణింతురు. తేనిపాల నెవ్వండొఖలుండు కల్లనిజంబులు విపరీతంబులుగ పలికి యాతనికి నాయందప్రతిరోధంబగు క్రోధంబు పుట్టించినవాడు. మించిన కార్యమునకుం జింతించి ఫలంబేమి. ఊరక మరణంబు నొంద నేల? రణంబుగావించి లబ్ధవిజయుండనయి యశోలక్ష్ములం బడసి యిష్ట సుఖంబు లనుభవించెద నొండె. వేరొండయిన శూరలోక శ్లాఘ్యుండనై నాకలోక భోగంబు లనుభవించెద నొండె" నావిని దమనకుండు 'నీవు చెప్పినది శూరలోక శ్లాఘనీయంబ. అయిన నుపాయాంతరంబుచే బగరసాధింపనొండెఁ, దప్పించుకొని తొలంగనొండె. గొలందిగాని యెడం గడయుపాయంబు సమాదరణీయంబుగాని సాహసంపడి రణమరణంబు శ్రేయంబని కడింది మార్తురతో నొరసి యుసురు దొరంగుట ధర్మంబుగాదు. 'జీవన్భద్రాణి పశ్యతి' యను వచనంబుఁ బాటింపవలదె? తన తరంబు బగఱతరంబు నెఱింగి కరంబు జయంబు నిశ్చయించుకొని మాఱ్కొనవలయును. విపరీతంబయినం బరాభవంబు తప్పదు. తొల్లి సముద్రుండు కరంబారయక యొక్క టిట్టిభంబు బరాభవింపం బూని తాన పరాభూతుండయ్యె.

నావిని సంజీవకుం డిట్లనియె; "దమనకా వినుము కలకాలంబు బ్రతుకఁబోము. చావు నిక్కంబు. మనకన్నులముందర బుట్టిగిట్టినవారి నెందఱంగానము. నిన్నయున్నవాఁడు నేఁడు లేఁడు. నేఁడు పగతు మొగంబునకు దొలంగిన రేపుమృత్యువు మొగంబునకుం దొలంగవచ్చునే? దానం జేసి యపయశంబు దప్పం బ్రయోజనంబు గలదె? పగతుకడిమిఁ దడవక కడఁగినవాడంగాను. లాఁతివెరవు లావుగామిం జేసి ప్రకృతోద్యమంబుం బూనవలసె. కడమాట యొక్కటి వినుము. ప్రాణహాని కయిన నోర్తుంగాని మానహాని [illegible] నీవింక నాకడంకకు నడ్డవాట్లు వేయకుము. నేనిదె [illegible]

యితంబయి యుండుమని రేనికింజెప్పుము. వేగిరింపుము. లెమ్ము. పొమ్ము." నావుడు దమనకుండు సరభస గమనంబునం జనువాఁడు రేని యిరవు మోసలం గరటకుం గనుంగొని లోనికిం బోవచ్చునె? సమయంబు గాదుగదా ?" నావుడుం "బోవచ్చును. సమయంబ. రేఁడు నీరాక వేచియున్నవాఁడు. పోయినపని యేమయ్యె" నని కరటకుం డడుగ దమనకుండు మొగంబునం జిరునగవు మొలకెత్త విలోకించి "యేమో యేలయయ్యెడు ? గార్యంబు పండించికొని వచ్చితిం, బిదపఁ దుదముట్టఁజెప్పెద. నీవుపోయి సన్నిధానంబుననుండుము. వెంబడి నేవచ్చెద" నని కరటకుంబుత్తెంచి కొంతవడికిం దానుంజని రేనిం గనుగొని "రమ్ము, కూర్చుండు వృత్తాంతంబేమి?" యని యాతండడుగఁ జేరువకుం జేరి యోరసిలం గూర్చుండి యల్లన నిట్లనియె. "నేను బోయిన సమయంబున సంజీవకుఁడు లోని యిరవునం గాటక పాటకుల తోడ మాటలాడుచుండి ననుంగనుంగొని వారితోడి సల్లాపంబు సాలించి ప్రత్యుత్థానంబు గావించి యుచితాసనాసీనుం జేసి కుశల ప్రశ్నంబు గావింపఁ దదవసరోచితంబుగం గొన్ని మాటలాడి యేకాంతంబాకాంక్షించు మా జాడ యెఱింగి కాటకపాటకులు లేచి యెడ గలుగం బోవుడు, నయ భయంబులు దోఁప వచనీయం బశేషంబు వచియించితి. ఆతండును దనకుం బోలిన వచనంబులు తెంపరితనంబు దోఁపం బెక్కులు వచించె. అవియెల్ల నాకు వాకొన మీకు నూకొనం బోలవు. ప్రయోజనంబును లేదు. ఆతని యుద్యమంబు సమస్తంబు ప్రతికూలంబగుట తద్వచనభంగి నెఱింగితి. చిరకాలంబు సంగాతంబు గావించినవాఁడం గావునఁ, గాని చేఁతకు నాతండు చేయు నుద్యమంబు నకు మనంబునం దాళంజాలక యాతనికి హితంబుగ నాకుంగోఁచిన యంత యొత్తిచెప్పితి. ఎంత చెప్పిన నతండు, 'తాను బట్టిన కుందేటికి మూఁడేకాళ్ళనుచున్నవాఁడు. "వినాశకాలే విపరీత బుద్ధి" యను వచనం బేలతప్పు ? కాలంబాసన్నంబైన నాతని కిట్టి కుబుద్ధి పుట్టెం గాబోలు. అతండు పర్యవసానంబునం దన యుద్ధోద్యమంబు తెల్లంబుగం బలికి "యింక నాకడంకకు నడ్డవాట్లు వేయకు. నేనిదే వచ్చెదం

గట్టాయితంబై యుండుమని రేనికిం జెప్పుము. లెమ్ము పొమ్మని దిట్టతనంబు మీఱం బలికె. అతండింతకుం గృత సన్నాహుండై డాయ వచ్చుచుండు. కర్తవ్యాంశంబు దేవర చిత్తంబునకే విదితంబు” నావిని “యహహా సాహసంబు? ప్రలయజ్వలనంబుపయి శలభంబు లంఘింపం దలంచె : ఔర! కావరం” బని యధిక్షేపించుచుం గ్రోధదుర్నిరీక్షుం డయి హర్యక్షువల్లభుండు విపక్షశిక్షాదీక్షితంబూని సమర్థితుండయి నిర్గమించి ఖురప్రహారంబుల దుమారంబు లాకాశంబు నిరవకాశంబుగం దిరోహించి ప్రావృషేణ్య ధారాధర వారంబు విడంబింప. ధరాతలం బదుర, దురవలోక భీకరాకారంబు మీఱం, బాఱుతెంచు నుక్షాధ్యక్షు వీక్షించి ధరాధరంబులు మాఱుచెలంగ క్ష్వేళారవంబు గావించి, సటా ఝూటంబు నిక్క గర్ణంబులు ఱిక్కించి పింగళేక్షణంబుల విస్ఫులింగంబు లెగయ నరాళ దంష్ట్రాకరాళంబుగ నాస్యగహ్వరంబు దెఱచి, జిహ్వా పల్లవం బల్లార్చుచుంగుప్పింప జొప్పుదప్పించి వృషభేంద్రుండు సముక్షిప్త వాల విక్షేపంబుమీఱం బెల్లుద్రుళ్ళి, వెనుకటికాళ్ళం బయలజాడించుచు భూనభోంతరంబు బూరటిల్ల నుదారా రావంబు గావించుచు మస్తకంబు వాంచి యేటవాలుగం గొమ్ము లొడ్డుకొని మెఱపుమెరసిన తెరగున నురికి యురమ్ము గ్రుమ్మ నమ్మెకమ్ముల యెకిమీడు సొమ్మసిల్లి తెప్పు నం తెప్పిరి ముప్పిరిగొను కోపంబుదీపింప నాటోపించి లాఘవంబున లంఘించి వజ్రసఖంబులగు నఖంబు లూదుకొన మూపురంబు చరిచిన దొరంగు కీలాలజాలంబు నగళ్ళంగనిస్సరఝురీపూరంబు ననుకరింప గోవల్లభుడు తొలంగక మలంగి, శాతశిఖరంబులగు ఖురంబులు కరంబు డిగ నురంబుదాఁచిన నత్తాపుకంబెం దత్పరాభవంబు గుండియ లవియింప బెండువడి కంఠీరవ వల్లభుండు దండతాడిత భుజంగంబు భంగి రోజుచు నిలువం గరటకుండు దమనకుంజూచి “యవలోకించితే భవదీయ దుర్మంత్ర శ్రవణ ఫలంబు రేడనుభవించెడు. ముందునీవు మృగరాజు తోడ సంజీవకునకు మైత్రిపుట్టించితివి. పిమ్మటంజూపోవక యిరువ కు భేదము పుట్టించితివి. మొదల దూరము విచారింపవయితివి. పండిత మానియగు భృత్యుండు తనక కాదు, స్వామికి నయితము హానిపుట్టిం

చును. అహహా! మన యధీశ్వరుం డిప్పుడు మహాపదం బొందియున్న వాఁడు. ఇప్పుడీయిడుమకు రాజునుందలంగు వెరవు పరికించితి మేని వలంతు లమ? పొంకంబుగా బింకములు నూఱాడవచ్చును. గాని యొక్క పోరామి వచ్చినప్పుడు కార్యంబు పయివేసికొని సంబళించుట సుకరంబు గాదు. రాజును గుణవంతునేని దుర్జనసేవితుని హ్రదంబును గమలమండ మండితంబును గ్రాహాక్రాంతంబుంబోలెఁ బ్రజలు డాయ వెరతురు. స్వార్థ పరుండవయి యిట యనర్థంబు పుట్టించి రాజు నేకాకిం జేసితివి. భృత్యుల నేరిం జేరనీవు. ఏవారిం జేరనీక యాదర కార్యంబులు పయివేసికొని తిరుగువాఁడు తన రాజునకు బగవాఁడగును అసాధువులకు హితంబు గావించు వాఁడుంబోలె సాధువుల కహితంబు గావించువా డవశ్యంబుం గీడువొందును. భృత్యుండు స్వామికి హితాపాదియయి తత్ప్రసాదంబు బడసిన సంపద యెన్నటికి నశింపదు. అహితంబు గావించి గడియించినది కడువడిం జెడిపోవును. కొందరర్థశాస్త్రాభిజ్ఞులయ్యుఁ బండితమానులయి తాము కృత్యాకృత్యంబులు నిర్ణయింతురు. ఫలవైపరీత్యంబున దైవ ప్రాతికూల్యంబు నిమిత్తంబుగ వచింతురుగాని తమ యజ్ఞానంబు దలం పరు. అట్టిమూర్ఖులకు బుద్ధిజెప్పఁగడంగువాఁడు వానరములకు బుద్ధిజెప్ప బోయిన సూచీముఖమువలె హానిజెందును.

బుద్ధిహీనునికి బుద్ధిమంతుఁడు చెప్పిన వచనము హితంబుగాఁ దోఁపదు. లోకంబునందుఁ బ్రియవాదులు పెక్కండ్రు గలరు. హిత మాడువాఁడు దుర్లభుండు. హితవాదికంటె హితశ్రోత కడుదుర్లభుండు. తనకు మేలుగోరి పరులకుఁ గీడురోయువాఁడు తప్పక చెడిపోవు. తొల్లి నందిగుప్తుం డను వాఁడు సుదర్శనగుప్తుం డనువాని మోస పుచ్చం దలంచి తన తండ్రిని ధనంబును గోలుపోయెను."

అని చెప్పి కరటకుండు వెండియు నిట్లనియె. "మొదలదూరంబు విచారింపక నీ పలుకు లీకొంటి నిది యకార్యంబని ముందుఁ దోఁపఁ దయ్యె. సంజీవకుం డెన్నండే నొక్క యుపకారంబు మనకుఁ గావించిన [illegible] వేనును

సహాయుండనైతిని. ఇది మనకు శ్రేయంబుగాదు పరుల వంచింపం బోయినవాడు తాన వంచితుడగు.

అని కరటకుండు మఱియు నానా ప్రకారంబుల దమనకు నుపాలంభించుచుండె.

తదవసరంబున మృగంబుల రాయండు వోడ పొందిన కాతాళం బనం గడు నడరి మెడజుంజురులు నిక్క బెడిదంపు టురుము నుఱివి నెఱబొబ్బ యిడి చంగున నెగిరికోలగగ్గరకుంబోలె నేలం గూలద్రోచి ముంగాళ్ళ నొత్తిపట్టి కుత్తుకంగఱచి నెత్తురు గుటగుటం ద్రావి యా బసవని నుసురునకుం బాచి ప్రశాంతకోపుండయి మరలి యురవున కరిగి యనుతాప పరీత మానసుం డగుచు డాయవచ్చిన కరటక దమన కులం జూచి యిట్లనియె.

“కటకటా! ఎంతదారుణకర్మంబు గావించితిని. భరణక్షమంబులం బ్రకృతి రంజనంబు గావించువానికిం జెల్లుగాని నాకు రాజనామంబు గాల్పనే! దూరము విచారింపక సంజీవకుని జంపుకొంటిని. విషవృక్షమేని సంవర్ధించి తాన ఛేదింపఁజనదు. ఎఱిగియే నెఱుఁగకే నేరమి యొకండు నొనరించిన భృత్యుని నయంబు భయంబుంజూపి వాని వేడుకోలునం దెలుపంబడి నట్లభినయించి తొలుత మిన్నక విడువ వలయు. ఆవల మరికావించిన వాని నిజాధికారంబు వలన దలంగ వలయు. ఇంతకు హెచ్చుఁదీంద్రదంబు గానిపింపంబోలదు. కానిపించినం దక్కుంగల లెంకకూటపు కాయువుందొరంగు. దాన రేనికి దోసంగు పాసంగు నిందు సంశయంబు లేదు. ఎట్టికడిందికర్జంబయిన సాధింప వచ్చుగాని తగిన భృత్యుని గడియించుట సుకరంబుగాదు.

అది యట్లుండనిమ్ము. లోకంబునందుఁ గలకాలము దుర్వారంబయిన దుర్యశంబు దెచ్చుకొంటి. ఇంక నేమి చేయుదు?” నని మిన్నక క్రిందు చూచుచుండె. అంత దమనకుం డిట్లనియె; “స్వామీ! దాయం బరిమార్చి యివ్వడువున నుమ్మలంపడం బోలదు. ఱేఁడు తన నెరఁగ్గు పఱుపం గడంగువాని నేని నొప్పరికింపక దోరింపవలయునని పాడినెఱి

నెఱిఁగిన గఱువలు వలుకుదురు. నేరమిం బొనరించినవారియుం దొరిమితాపసులకుం గాని భూపాలురకుం జనదు. రాజ్యలోభంబు వలనంగాని యహంకారంబు వలనం గాని స్వామి పదంబుం గోరువారికి వధంబు దక్క దండంబు లేదు. ఈ యర్థంబు సర్వ సమ్మతంబు" నావిని పింగళకుండు సంతుష్టుండయి భద్రాసనంబు నధిష్ఠించె. దమనకుండు ప్రహృష్టుండయి "మహాస్వామి! దేవరకు లోకంబులకు స్వస్తి యగుం గావుత" మని వచియించి తానును సకల పరిజనంబులును సుఖంబుండె.

అని విష్ణుశర్మ సుహృద్భేదంబు సాంతంబుగ వచియించి యిట్టి భేదంబు మీరు మీ శత్రువులందుం బ్రయోగించి విజయంబుఁ బొందుండన రాజపుత్రులు కరంబు హర్షంబునొందిరి.

---

# 15 అమరావతీ స్తూపము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

[ఈ వ్యాసము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచించిన 'అమరావతీ స్తూపము' అను గ్రంథమునుండి గ్రహింపబడినది. శర్మగారు ఆంధ్రచారిత్రక పరిశోధకులలో మిక్కిలి ప్రసిద్ధిచెందిన పురుషులు. వీరు చరిత్రపరిశోధనమందు చేసిన సేవ అమూల్యమైనది. నష్టభ్రష్టమై శాసనరూపములుగా నున్న పూర్వాంధ్ర వైభవమును కష్టపడి సేకరించి ఒక చక్కని రూపములో మనల కందించిన అమృతిరూపులు వీరు. వీరి శైలి మృదుమధురమై, మంజులశబ్ద సంశోభితమై, ప్రత్యక్షరము పాఠకుల తన్మయుల జేసివైచును. వీరి చరిత్రరచనా విధానమే విశిష్టమైనది. దానికదే సాటి. నిండుదనముతో కూడిన వీరి రచనలు సారస్వతోపాసకులకు, చారిత్రక జిజ్ఞాసువులకు మార్గదర్శకములు. వీరు కొంతకాలము ఆంధ్ర విశ్వవిద్యాలయమందు పనిచేసి, ప్రస్తుతము మద్రాసులో తెలుగుభాషా సమితియందు పనిచేయు చున్నారు.

'ఆంధ్రచరిత్రసంగ్రహము' 'అమరావతీస్తూపము' 'రెడ్డిరాజుల చరిత్ర' మొదలగు పరిశోధనాత్మక గ్రంథములు, నాటికలు, సారస్వత వ్యాసములు, మొదలైనవి వీరి యితర రచనలు.]

భక్తులయిన యాంధ్రదేశ కళోపాసకులు బుద్ధ భగవానుని పాద పీఠికి కానుకగా సమర్పించినయట్టి పూజాకుసుమములలో అమ

రావతీ స్తూప మొకటి. ఇది కృష్ణానదీ తీరమున. ఆ నది ముఖ ద్వారమునకు రమారమి యిరువది మైళ్ళ కెగువను, ప్రాచీ నాంధ్ర రాజధానీ నగరమైన ధాన్యకటకమను నిప్పటి ధరణికోటకు తూర్పున నరమైలు దూరమున నున్నది. ఇది యిప్పటి అమరావతీ గ్రామమునకు నడుమ నుండుటచేత అమరావతీ స్తూపమని దీనికిపేరు కలిగినది. క్రీస్త్వారంభ శతాబ్దులలో ధాన్యకర మని నామాంతరముగల ధాన్య కటక నగరము దక్షిణపథము నందలి నగరములలోని కెల్ల నవతంసమై ప్రఖ్యాతిఁ గాంచుట వలన నిది ధాన్యకటక చైత్య మనియు, బౌద్ధ సంఘము నివసించుట కనువయిన విహారములు మొదలగున వనేకము లిచట నుండుటచేత ధాన్యకటక సంఘారామ మనియు బౌద్ధ వాఙ్మయ మున నిది ప్రసిద్ధమైనది. ఈ స్తూప మెప్పుడు నిర్మిత మయినదో స్పష్ట ముగాఁ దెలిసికొనుట కాధారములు లేవు. శారీరకస్తూపము లెనిమి దింటిలో అశోకుడు డేడింటిని తెఱపించి యందలి ధాతువులను చిన్న చిన్నవిగ పెక్కు విభాగములు గావించి, యందొకొక్కక్క దాని మీఁద నొక్కటొకటిగ దేశమునందలి వేర్వేరుభాగములందు మొత్తము మీఁద నెనుబది నాలుగువేల స్తూపములను గట్టించినట్లు తరువాతి కాలపు బౌద్ధగాథలు తెలుపుచున్నవి. కొన్ని యిట్టి గాథల వలననే అమరావతీ స్తూప నిర్మాత అశోక చక్రవర్తియని తెలియుచున్నది. ఈ గాథలు విశ్వసనీయములనుటకు ప్రమాణాంతరములు లేకపోయినను ఈస్తూపపు రాలమీఁద మౌర్యలిపిలో శాసనము లుండుట వలన మౌర్యవంశమువారి పరిపాలనమున మాత్ర మిది నిర్మింపఁబడి యుండు ననుట నిస్సంశయము. స్తూప శిల్పమునందలి యపరిచితములయిన ప్రాచీన రీతులను పరిణతములుగఁ గానవచ్చు నర్వాచీన రీతులను వేరు పరచి చూచినయెడల ప్రాచీనరీతుల ననుసరించికూడ ఇచ్చట ప్రాథ మిక స్తూపము క్రీ. పూ. రెండువందల ప్రాంతమున వెలసినదిగనే కన్పట్టును. అశోక ప్రేషితుడయి యాంధ్రదేశమున కరుదెంచి మహా దేవ భిక్షువు స్థాపించిన చైత్యక పంథ కిది ప్రధానపీఠమగుటచేతను, అటుతరువాతి కాలపు శాసనములం దిది మహాచైత్య మని పేర్కొన

యందును బరస్పరము వీరికి నెట్టిభేదములు కలవో తెలియదు కాని వీరలెల్లను నొక్క పంథకే చెందినవారని శాసనముల వలన స్పష్టమగుచున్నది.

## అంధకులు

ఎట్లయిన నేమి, ఆంధ్రదేశమున కరుదెంచి చాలాకాలము గడచిన మీఁదట మహాసాంఘికులలో పెక్కు తెగలేర్పడినవి. పైని పేర్కొనినవికాక శాసనాధారమున రాజగిరికులు లేక రాజగిరి నివాసకులని, సిద్ధాంతికులని మఱిరెండు తెగలపేర్లు తెలియుచున్నవి. ఇవి యన్నియు బౌద్ధ గ్రంథములందును బేర్కొన బడినవి. హిమవత, వాజిరియ, పుబ్బశేలియ, అపరశేలియ, రాజగిరీయ, సిద్ధాంతిక సంఘములు మహావంశము వలనఁ దెలియవచ్చును. పూర్వశైల, అపరశైల, చైత్యకులతోపాటు హైమవతులు, లోకోత్తరవాదులు, ప్రజ్ఞప్తివాదులు అను మూఁడు క్రొత్తతెగలను బర్గెస్‌దొర పేర్కొనియున్నాఁడు. ఈ తెగల పేర్లెట్టి వయినను చైత్యక, పూర్వశైల, అపరశైల రాజగిరిక, సిద్ధాంతిక నికాయములు కేవలము తెలుగు దేశపు తెగలని తెలుగుదేశపు ప్రాకృత శాసనములందు వీ రుదాహృతులగుటవలన నిశ్చయింపవచ్చును. వీరిలోఁ గడపటి నాలుగు తెగలవారు బౌద్ధ గ్రంథములందు అంధకులు అనుపేర బేర్కొనబడిరి. అంధకులే ఆంధ్రులు.

క్రీస్త్వబ్దమున కించుక పూర్వమునఁ గూడ ఆంధ్రదేశమందలి యీ ధాన్యకటక ప్రాంతము బౌద్ధమతమునకు పంట పొలమయి, బౌద్ధులకుఁ బట్టుకొమ్మగ నుండె ననుటకు సింహళద్వీప చరిత్రమే యాధారము. బౌద్ధవాఙ్మయమున 'తాంబపణ్ణి' యనఁ బరఁగిన సింహళద్వీపమును క్రీస్త్వబ్దమునకు రెండువందల సంవత్సరములకుఁ బూర్వమున పాలించుచుండిన 'దుట్టగామణి' యను ప్రభువు అనురాధపురమున 'మహాథూపము' (ర్వాన్‌వెల్లి మహాస్తూపము)ను నిర్మించుచుండిన సందర్భమున హిందూదేశము నందలి వేఱు వేఱు ప్రాంతముల

నుండి అర్హతులు, ఆచార్యులు వేలకొలది బౌద్ధసాంఘికులతో నచ్చటి కరిగిరఁట. ఇట్లు వెళ్ళినవారిలో అర్హతుడయిన మహాదేవు డొక్కఁడు. ఇతడు 'పల్లవ భొగ్గ'మున నుండి నాలుగులక్షల యఱువదివేల భిక్షువులను వెంటనిడుకొని వెళ్ళెనట భిక్షువుల సంఖ్య యతిశయోక్తియని త్రోసివేసినను, 'పల్లవభొగ్గ' మున బౌద్ధమత మత్యంతాభివృద్ధి చెందుచుండెనని యూహించుట సమంజసము కాకపోదు. 'భోగ' ('భోగ్గ') పదము 'మహాంధ్రభోగము' 'కవచకార భోగము' 'హామనిభోగము' అని ప్రాచీన శాసనములందు దేశ విభాగ పరముగ వాడుక చేయబడినందున 'పల్లవభొగ్గ' (పల్లవభోగ) మనునదియు నొక దేశ విభాగమయి యుండుట నిశ్చయము. దేశ విభాగ మను నర్థమున 'భోగ' మునకు బదులు దేశ, విషయ, నాఁడు పదములు ప్రాచీనశాసనములందుఁ బ్రయుక్తము లగుటవలన 'పల్లవభొగ్గ' మనునది 'పల్లవవిషయ' మనికాని 'పల్లవనాఁ' డని కాని చెప్పవలసి యుండును. 'పల్లవనాఁడే' యిప్పటి 'పలనా' డనునదని కొందఱు చరిత్రకారుల యభిప్రాయమగుట వలన పల్లవభొగ్గ' మనునది 'పలనాఁ' డని నిర్ణయింప దగును. పల్లవనాడును, అందలి ధాన్యకటకమును ప్రాచీనకాలమున పల్లవులు పాలించిరని శాసనముల వలనను గాథల వలనను కూడఁ దెలియుచున్నది. త్రిలోచన పల్లవునికి ధాన్యకటక మొకప్పుడు రాజధానిగా నుండినట్లు గాథలుకలవు. కాంచీపురమును పాలించినట్లు శాసనములు తెలుపుచున్నవి. క్రీస్తుశక మాఱవ శతాబ్దిని విష్ణుకుండల విజృంభణము ననంతరమునఁ గాని పల్లవులు కృష్ణానదీ తీరమును విడిచి యింకను దక్షిణ దిశకు సాగియుండలేదు.

స్వతంత్రరాజ్యము స్థాపించుటకు పూర్వము కూడ ఆంధ్రరాజులయిన శాతవాహనులకు సామంతులును, సైన్యాధిపతులు నయి, పల్లవులు ప్రాముఖ్యము గడించి బౌద్ధగ్రంథములందు నాగదేశ మని ప్రసిద్ధమయిన యీ ప్రాంతము నందలి వారితో సంబంధ బాంధవ్యములు నెఱపి, వర్ధిల్లుచుండిరి. పల్లవులకు జన్మస్థలముగఁ గాక పోయినను వారికిగల యితర సంబంధాధిక్యము వలన 'పల్లవభొగ్గము' (పలనాడు)

అనుపేర బరఁగిన యీ ధాన్యకటక ప్రాంతము క్రీస్తవ్దమునకుఁ బూర్వమునఁ గూడ బౌద్ధ మతమునకు 'చేవపట్టు'గ నుండెనని నిరూఢమగుచున్నది.

బౌద్ధ మత మట్లు ప్రబలుచుండినను అమరావతీస్తూపమునఁ గడు ప్రాచీనచిత్రము లరుదుగను, అర్వాచీనము లయినవి, అనగా మొదలి స్తూపము నిర్మితమయిన రెండువందల సంవత్సరములకుఁ దరువాతవి, అధికముగను గాన్పించుటచేత మొదటి నాళ్ళలోకంటె తరువాతనే యిచ్చటిస్తూపము పెంపుచెంది గొప్ప బౌద్ధక్షేత్రముగ ప్రఖ్యాతమయిన ట్లూహింపవలసి యున్నది. ఆది బౌద్ధమునం దద్భుత పరివర్తనము జరిగిన కాలముననే యీ స్తూప మత్యంతము పెంపు చెందుటచేత దీని పేరు పెంపులకుఁ దోడుపడిన యీపరివర్తనమును గుఱించి యించుక తెలిసికొనుట యావశ్యకము.

---

# 16 జగన్నాథ పండితుడు

శ్రీ జమ్ములమడక
మాధవరామశర్మ

[ఈ వ్యాసమును రచించినది శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు. వీరు ప్రస్తుతము గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో పండితులుగా నున్నారు. వీరు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. సంస్కృతాలంకారికులు: వీరి రచనా విధానము సుస్నిగ్ధమై, విమర్శనాత్మకమై యొప్పుచుండును.

'ఆంధ్ర ప్రతాపరుద్రీయము' 'నవరసగంగాధరము' అను అలంకార గ్రంథములును, పెక్కు విమర్శనాత్మక సాహిత్య వ్యాసములును, వీరి యితర రచనలు.]

భారత దేశమునం దాంధ్రులకొక విశిష్టత గలదు. పామరుల నుదాత్తుల నందర నాదరింప గలిగిన ప్రజ్ఞావిశేషము మొదటనుండియు తెలుగువారు నెన్నతో బుచ్చుకొనిరి. కొందఱకు వ్యాకరణమునందు ప్రజ్ఞయుండును. మరికొందఱకు న్యాయశాస్త్రమునందు పాండిత్య ముండును. కొందఱు వేదాంతము మీమాంస విశేషించి యధ్యయనము

చేయుదురు. స్వభావ సుందరమైన యాంధ్ర హృదయము సాహిత్య మృదులము. నాటినుండి నేటివఱకు సాహిత్యమం దాంధ్రుల కృషి; చక్కగ భావింపగల వారికి ప్రశంసా పాత్రము.

ఆంధ్రుల సాహిత్యముదాత్తుల కనుదాత్తులకును సంబంధము గల్పించినది. రాజ, ప్రజా సామరస్యము సంపాదించినది. తత్ఫలితముగా నతి దరిద్రులు నతిధనికులు తెనుగు నేలలోలేరు. మధ్యమవర్గ ప్రజ సుందరమైన సాహిత్యమును సృజించినది. అందముగా నాస్వాదించినది.

పండితరాయలు జగన్నాథు డాంధ్రుడు. గొప్ప సాహిత్య వేత్త. చెప్పదగిన లక్షణకారుడు. ఎన్నదగిన కవి. సమర్థుడైన పండితుడు. నిశితమైన విమర్శకుడు సౌహృదయుడు. ఉత్తమ గృహస్థుడు.

ఆతని సాహిత్య సృష్టి భారతదేశమునకే సాహిత్య విశేషము నందించినది. లక్షణ విజ్ఞానము కలుగజేసినది. అట్టి కావ్య మర్మజ్ఞుడు మరల నెవడు నుదయింపలేదు.

తెలుగు దేశములో గోదావరీ తీరము చిరకాలము నుండి సర్వ విధముల సంపన్నము. కవి పండితులకు నివాసము. సప్త గోదావరమను ప్రసిద్ధి బొందిన భూఖండము నేడు కోనసీమ. ఇప్పటి అమలాపురము తాలూకాలోని 'ముంగండకు' మునిఖండమని ప్రాచీన నామము. అచ్చట విద్యాసంపన్న బ్రాహ్మణ కుటుంబము లనేకములు కలవు. వేగినాటి బ్రాహ్మణ కుటుంబమును శ్రీలక్ష్మి తల్లిగా, పేరు భట్టు తండ్రిగా జగన్నాథుడు జన్మించినాడు. వారింటిపేరు ఉపద్రష్ట వారని పరిసరము వారందరు. జగన్నాథుని శిష్యుడు శ్రీకులపతి మిశ్రుడు త్రిశూలోపపదమును జగన్నాథునకు జేర్చినాడు. తాను రచించిన భామినీ విలాసమునందు మొగలు సామ్రాజ్యమునందు నవీన వయస్సును గడపినట్లు వ్రాసుకొనెను. క్రీ. శ. 1590-1620 లోపుగా నాతని ఆ వయస్సు నూహింపవచ్చును. అందుచే 1590 ప్రాంతమున జగన్నాథుడు జన్మించియుండును. అంతకన్న నిశ్చితముగ కాలాధార ములు లభింపలేదు. జగన్నాథుడు బాల్యమునుండియు మేధావి.

తనవంశ సంబంధమును నిరూపించు కొనెను. మంజునాధశాస్త్రి జయపుర సంస్కృత మహా విద్యాలయములో సాహిత్యాధ్యాపకులుగా నున్నారు. పండిత రాయలకు కామేశ్వరియందు గలిగిన సంతానము తెలియదు.

షాజహాను పెద్ద కుమారుడు దారాషుకో పండితరాజునకు స్నేహితుడు. ముత్యాలగొడుగు నీడలో దారాషుకోయును దానును సంచరించుచు పండితరాయలు మహావైభవము ననుభవించెను. సాధారణకవి పండితుల కీర్త్యాసూయలు గలుగునట్లుంగరంగ భోగము లనుభవించెను. దారాషుకోకుమిత్రుడై, గురుడై కవితలు నేర్పెను. భారతీయ దర్శన తత్త్వములు జెప్పెను. దారాషుకోయు జగన్నాధ పండితరాజ సమక్షమున నేర్చుకొనిన యుపనిష ద్విజ్ఞానమును పార్సీ అరబ్బీభాషలలో నిరూపించినాడు. అసఫ్‌ఖాన్ సంతోషమునకు దారాషుకో వినోదమునకు మనోహరములగు వర్ణనములతో కూడిన కొన్ని కవిత లల్లెను. షాజహాన్ మహమ్మదీయులకు, హిందువులకును వివాహాది సంబంధములు లేకుండునట్లు జగన్నాధుని సూచనానుసారముగ శాసనము జేసెను. విదేశీయులు, విధర్ములునైన మొగలుల పరిపాలనమున గూడ ప్రతిభావైదుష్యములుగల పండితరాయలు భారతీయమైన ధర్మమును ప్రజా సముదాయమున కుద్బోధించుటకై తన కవితను ద్వారముగా నపూర్వమైన భావోద్యమము నిర్వహించెను. కావుననే పాలక వంశము నందలి వ్యక్తులును జగన్నాధుని సరస కవితలకు స్వాగతము లిచ్చి సమాదర మతులైనారు.

ఔరంగజేబు మహమ్మదీయ ధర్మప్రతినిధి యయి స్వమతోద్ధరణము నందలి పట్టుదలతో మొగలు సామ్రాజ్యమున ప్రభువయ్యెను. తండ్రి షాజహానును నన్న దారాషుకోను కారాగారమున బెట్టెను. ఇక షాజహాను సమ్మానితవ్యక్తులకు సమాదర ముండుటెట్లు? 1650 సంవత్సరమున ఔరంగజేబు పరిపాలనములో పండితరాయలు ముత్యాల ఛత్రఛాయలో తిరుగుట కవకాశము లేదు. మొగలు దర్బారులో తాంబూలద్వయమందుకొనుట వలను బడదు. దారాషుకో తనకింటికి

గనబడదు. షాజహాను సహృదయత గోచరించుట లేదు. అసఫ్‌ఖాన్ యాదర మతిదూరమైనది. ఢిల్లీపట్టణమున తానెట్లుండగలడు? కామేశ్వరిని పుట్టింటికి బంపెను. తానొకడయ్యెను. తన కవిత దోడుగా నటునిటు సంచరింప మొదలిడెను. విష్ణుభక్తి పరాయణమైన మధురా పట్టణమున కొంత కాలము సంచరించెను. ఆ పండిత వీరునకు మధురాపట్టణ మంతగా దృష్టినీయలేదు. ప్రాక్‌దేశ పర్యటన మాచరించి తనస్వరూప పరిచయ మంతట నందించుచును గాశీపట్టణ మేగెను. అప్పటి కాశీపట్టణము తనవాదప్రౌఢిమలు జవిజూచిన కాశీపట్టణము గాదు. నేడు తన వ్యాకరణ సంప్రదాయము లచట గోచరింపవు. పండితరాయల కెచట జూచినను నసూయ లధికముగా గన్పించిరి. అప్పటిలో సాధారణముగా సనాతన సంప్రదాయావలంబులగు పండితులకు లౌకికోద్యోగము గిట్టదు. యవన పరిచయ మిష్టముగాదు. విదేశీయుల సహవాసము వారు సహింపలేరు. పండితరాయల కన్నియు నున్నవి. పండితులెట్లు సహింపగలరు? పండిత జనతకు సులభము గాని సంపద్విలాసములు జగన్నాథున కధికము లైనవి. అవియన్నియు కాశీ పండితుల కీర్ష్యాజనకము లైనవి. సిద్ధాంతకౌముదీ రచయిత భట్టోజీ దీక్షితుడు శేషశ్రీకృష్ణుని సమక్షమున వ్యాకరణ మభ్యసించెను. కాని తన విశిష్టతలకే ప్రాధాన్యము నిచ్చుకొని గురుమతమును ఖండించుచు దానొక వ్యాకరణ సంప్రదాయమును ప్రచలితము జేసెను. జగన్నాథుడు కాశీపట్టణమున నివసించిన సమయములో వీరేశ్వర గురుప్రసాద బలముచే భట్టోజీ మతమును ఖండించెను. ఆ భట్టోజీ ప్రభావ మిపుడు కాశీపట్టణ మంతయు ప్రకాశించినది. భట్టోజీ వేదాంత గురు వప్పయ్య దీక్షితు లప్పటిలో కాశీపట్టణమున ధర్మపీఠాచార్యులు. అప్పయ్య దీక్షితుని యలంకార గ్రంథములను బండితరాయలు నిశితముగా విమర్శించెను. అప్పయ్య దీక్షిత, భట్టోజీ దీక్షిత ప్రభావముతో గూడుకొనిన గాశీపట్టణ మండలి నేడు పండిత రాజ జగన్నాథుని యాదరింప లేక పోయినది. జగన్నాథుడును వృద్ధుడయ్యెను,

కామరూపదేశ ప్రభువు ప్రాణనారాయణుడు జగన్నాథుని ప్రజ్ఞా విశేషములను గుర్తించెను. తన దేశమున కేతెంచిన జగన్నాథునకు స్వాగత మిచ్చెను. తన యాస్థానమున నాశ్రయమిచ్చెను. అతని పాండిత్యము దెలిసికొనెను. కవితలాస్వాదించెను. ప్రాణనారాయణుడు జగన్నాథున కాశ్రయ మిచ్చితినని సంతుష్టుడయ్యెను. తుదకు శాంతోదార చిత్తుని జేరితినని పండితరాయలును కరితృప్తుడయ్యెను. ఆత్మ విచారణ మొనరించెను. ఆత్మయోగముల ననుష్టించెను. అన న్యాధ్యాత్మ విధుడయ్యెను. 1666 సంవత్సరము వఱకును పండితరాయలు ప్రాణనారాయణుని నాశ్రయించి యనంతర మాత్మ నారాయణుని జేరెను.

పండిత రాయల జగన్నాథుని విషయమై చరిత్రాధారముగా తెలియదగిన వాస్తవకథ పైని చెప్పినట్లున్నది. లోకమున విపరీతమైన నానాకథలేర్పడినవి. లవంగి యను యవన కన్యను జగన్నాథుడు స్వీకరించెనని కింవదంతి వ్యాపించినది. తద్విషయమై కొన్ని కవితలును కొందఱు చూపుచున్నారు. అవి జగన్నాథుని గ్రంథములం దెచ్చటను లేవు. యువతీ సౌందర్యమేనియు జగన్నాథ వర్ణితమై లేదు. ఆత డంతట దాంపత్య శృంగారమునే మధురముగా నిరూపించెను.

సంస్కృత వాఙ్మయమునందు సంస్కృతభాషా కవితల సౌందర్యాతిశయము జగన్నాథునితో ఆగిపోయినదని భావింపవచ్చును. ఆతడొక మహా కావ్యమును వ్రాయక పోయినను ఆతని ప్రత్యేక శ్లోకమొక్కొక కావ్యమై భావదీప్తిని సంపాదించునదిగా నున్నది. గద్య గ్రంథముల రచించెను. పద్య కావ్యముల గ్రథించెను. ఆయా యాశ్రిత పాలకులపై కావ్యముల రచించెను. 'గంగాలహరి' మొదలగు స్తోత్రములను నిత్యపఠనీయములగు వానిని రమణీయముగా రచించెను. అన్నిటికన్న జెప్పదగిన యాతని మహాకృతి యొకటిగలదు. అది రసగంగాధరము. సాహిత్య శాస్త్రమునకు రసగంగాధర మొక మహా భాష్యము. దాని ననుసరించియే కావ్యము, రసము, అలంకారము,

గుణము మొదలగు వాని స్వరూప పరిష్కారములను దెలియవలసి యున్నది. అదియు సంపూర్ణముగ లేదు. ఉన్నంతవరకైన యాంధ్రుల పెన్నిధిగా, సన్నిధిగా జెప్పదగిన రసగంగాధర గ్రంధము నాంధ్రులంద అధ్యయనము జేయుట యత్యంత ముపకారమగును.

---

## 17 సాహిత్య పరిణామము

శ్రీ పిల్లలమఱ్ఱి
వేంకట హనుమంతరావు

[ఈ వ్యాసము శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావుగారు రచించిన 'సాహిత్య సమాలోచన'మను గ్రంథమునుండి గ్రహింపబడినది. శ్రీ హనుమంతరావు గారు ప్రస్తుతము గుంటూరు హిందూ కళాశాలలో ఆంధ్రభాషోపన్యాసకులుగా బనిచేయుచున్నారు. వీరు సాహిత్య విమర్శకులు. కథకులు. కవులు. నాటకకర్తలు. వీరి రచనా విధానము సరళమై, విమర్శనాత్మకమై, హృదయంగమముగా నుండును.

'మధుకణములు' : 'హృదయరాగము' మొదలగు ఖండకావ్యములు, 'వెలుగు నీడలు' మొదలగు కథా గ్రంథములు, 'దీపకలిక' 'వత్సల'వంటి నాటికలు, 'ఆంధ్ర సాహిత్య సంపద'వంటి సమీక్షా గ్రంథములు వీరి యితర కృతులు.]

### ప్రవేశిక.

ఆంధ్రులది పాలకజాతి. క్రీ. పూ. 234 నుండి క్రీ. త. 207 వరకు నాంధ్రరాజులు దేశమును పాలించినారు. శాతవాహను లాంధ్రులని చారిత్రకుల సిద్ధాంతము. ఈ యాంధ్రరాజుల పోషణమున వైదిక, జైనమతములు వర్ధిల్లినవి. కాని వైదిక మతమునే వా రనుస రించుచు వచ్చినట్లు వారుచేసిన యశ్వమేధాది యాగములే ధ్రువ పఱచుచున్నవి. నాటి సంఘము వర్ణాశ్రమధర్మములకు బద్ధమై యొప్పారి నది; కావున నేవిధములగు సంఘర్షణములు లేకపోయినవి. ఆనాటి ప్రజలు శాంతి యుతమైన జీవితమును గడపినారు. శ్రద్ధాభక్తులు, మాట మర్యాదలు, ధైర్య సాహసములు, వినయ విభూతులు వారి మనసులలో సంపూర్ణావకాశము పొందినవి. సంస్కృత భాషా సాహి

త్యములే నాటి పండితుల యాదరము నందినవి. వాని సంప్రదాయ సూత్రములే ఆదర్శ వంతముగా భావితములైనవి. తరువాత హాలుడు ప్రాకృతమందును, గుణాఢ్యుడు పైశాచి యందును గ్రంథములను రచించి రాబోవు తెనుగు సాహిత్యమునకు మార్గదర్శకులైనారు. నాటికి ఆంధ్రభాష రాజాస్థాన ప్రవేశమున కర్హత గడింపలేదు. దైనందిన వ్యవహారములోనుండి జనబాహుళ్యము నాశ్రయించినదే కాని రాచరికమును, ఉత్తమ సాహిత్యము నాధారముగా జేసికొన లేదు. పసితనములోనుండి యవ్యక్త మధురనాదము లీను జిలిబిలి పలుకులతో ప్రజల హృదయముల నార్ద్రీభూత మొనర్చుచుండినది.

## సాహిత్యమునకు మతమే ప్రోద్బలకము.

క్రీ. వె. ఏడవశతాబ్దికి - అనగా చాళుక్యరాజుల పరిపాలనా కాలములో ఆంధ్రభాషకు క్రమముగా గౌరవము లభించినదని తెలియుటకు వారి శాసనములే నిదర్శనములు. నాటికి బౌద్ధమత ప్రచార ముత్కృష్టమైనది. బౌద్ధవాఙ్మయము ప్రాకృతమున విరివిగా పెరిగిపో జొచ్చినది. వైదికమత సంప్రదాయముల నిలువద్రొక్క వలసిన కర్తవ్యము హెచ్చినది. సంఘజీవనము దేశకాల పరిస్థితుల ననుసరించి మార్పుజెందుచుండును. దీని ననుసరించియే యా యా జాతి సాహిత్యములు వర్ధిల్లుచుండును. పూర్వ సాహిత్యములో సంఘ జీవితము ప్రతిబింబించుట లేదని యిటీవల కొంద అభిప్రాయ పడుచు న్నారు. కాని అది సరిగాదు. పదునొకండవ శతాబ్దములో చాళుక్య నృపాలుడైన రాజరాజు వైదికమత ప్రచారార్థము దీక్షబూనినాడు; ఆంధ్రవాగనుశాసనుడైన నన్నయభట్టారకుని పవిత్ర వచస్సుతో నాంధ్రభారతావతరణము పొసగినది. మహాత్ముడైన నన్నయ స్వస్థాన వేషభాషాభిమతులైన రసప్రలుబ్ధమయిన మనస్సుగలవారలు పెద్దలు దేశభాషా కావ్యముల గౌరవింప వలెనని ప్రబోధించినాడు. ఈ విధముగా నాంధ్రదేశ భాషాసాహిత్యములపై నాదరాభిమానము లుద్బుద్ధము లైనవి.

## దేశికవిత – తత్ప్రభావము.

ఇంతలో వీరశైవమతము విజృంభించినది. తత్ప్రభావము నిమిత్తము వాఙ్మయ మాశ్రయమై వృద్ధికాజొచ్చినది. ప్రజల కందు బాటులో భాషాభావములుండ వలెననెడి యభిప్రాయము బౌద్ధకాలము నాటికే ఉదయించి యీకాలమున నభివృద్ధి నొందినది. సులభబోధకై 'దేశికవిత-జాను తెనుగు' లత్యంతోపస్కారములుగా కనిపెట్టినారు. శబ్దకాఠిన్యము లేక సరసమగు పదములతో కూడి, రాగరంజితమై ప్రజల ఆచారవ్యవహారములకు ప్రతిబింబమై, జాతీయముల నిమిడ్చి కొనినదై పామరుల కష్టములను మరపించి కార్యసాధనములో నుత్సాహమును ప్రసాదించునట్టిదైన పదకవిత్వమునకు బీజ మానాడే నాట బడినది. ప్రజాదరమే కవితకు లక్ష్యమనీ ప్రజల సంస్కరించుట కవితా ధర్మమనీ, ఆనాడే గుర్తింపబడినవి. ఏ రాజుల కనుసన్నలకును ఆనాటి పద కవిత బద్ధముకాలేదు. అట్లుకానిచో నాకవితలో నంతటి యుద్రుతము, స్వేచ్ఛా స్వచ్ఛత లుండుట కవకాశము లెక్కడివి?

ఈ 'దేశికవితోద్యమ' ప్రభావము, తరువాత వచ్చిన తిక్కన కవితలో గన్పించుచున్నది. తెలుగు నుడికారమును మూటకట్టుకొనిన యాతని జాతీయ రచనయే యిందులకు తార్కాణము. పిమ్మట వచ్చిన ద్విపద రామాయణ హరిశ్చంద్ర నలోపాఖ్యానములు కూడ నీ 'దేశి' మార్గమునకు జెందినవే. శ్రీనాథుని కూడ నీ సిద్ధాంతము లోబరచుకొని యాతనిచే పల్నాటి వీరచరిత్రను వ్రాయించినది. ఇవి తోలుబొమ్మలాటల ద్వారా, వృత్తి సంఘములుగా వరలిన జంగముల ముఖములను ప్రచారమందినవి. ప్రజలకాహ్లాదము గూర్చుచు పౌరాణిక గాథలను బోధించుచుండుట కీ ద్విపదలు తోడ్పడుచువచ్చినవి.

## కావ్యములు ప్రభుసమ్మితములు.

పిమ్మట చాలకాలము వరకు మనసాహిత్యము ప్రభుసమ్మితమైనది. కవులు సంస్కృత కావ్యాను వాదములతో గాలముగడపుచు

వచ్చినారు. కావ్యములు పాండితీ ప్రకర్ష కాలవాలమైనవి. ప్రజల హితము పైగాక ప్రభువొసంగు కానుకలపై కవుల దృష్టి పడినది. ప్రభువులు సహజసౌందర్య విలసితములగు వనములలో విహరించుట మాని కృత్రిమోద్యాన విహారములకు మురిసిపోవుట పరిపాటయినది. ఈ సూత్రమే కవులనుగూడ పరిపాలించినది. ఆదర్శసత్కథల గైకొని చిత్రించుట కల్పనా కవులచే మురిపించుటలు జరిగినవి. రాజాశ్రయము లభించిన కవులకు ప్రజలతో నిమిత్తమేమి? వారి కష్టనిష్ఠురములు కావ్య వస్తువులగుట కవకాశ మెక్కడిది?

క్రమముగా కవులు ప్రభువులకు మిత్రులై పొట్టలో చల్లకదలక ప్రవర్తిల్లినారు. వాతావరణాను గుణముగా ప్రణయ చింతనము హెచ్చినది. రాజాంతః పురములు కవులకు సుపరిచితములగుటచే నచటి వస్తువులు, సన్నివేశములు వారి కావ్యములలో ప్రతిబింబితములగుచు వచ్చినవి.

"నిరుపహతిస్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు కర్పూర విడెమాత్మ కింపయిన భోజనమూయెలమంచ, మొప్పుతప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్" దొరికెడి వారికి. తినమరగినవాడు వస్తుండగలడామరి? అంతటి సౌఖ్యముల నందినవారు గనుకనే నాడు వారి ప్రాపుసడలినంతనే శ్రీనాథ పెద్దనలు 'జీవచ్ఛవముల' విధముగా నున్నట్లు వ్రాసికొని విలపించినారు.

## సంపూర్ణ భాషా భావకల్పనా సౌష్ఠవము.

శ్రీ కృష్ణరాయలకాలము తెనుగుజాతి వైభవమునకు సర్వవిధముల శిఖరప్రాయము. సాహిత్యమునకు భాషాభావకల్పనా సౌష్ఠవము నా నాటి కవులు సంపూర్ణముగా నిచ్చినారు. తెలుగు సాహిత్య క్షేత్రములో విశిష్టమైన ప్రబంధ వృక్షము శాఖోపశాఖలై విరాజిల్లి రసవత్ఫలముల నీనిన దీ కాలమందె?

## సాహిత్యసౌధ పతనము.

కృష్ణరాయల యనంతర మల్పకాలముననే విజయనగర సామ్రాజ్యము క్షీణించినది. కవులించుమించుగా పొట్టలు పుచ్చుకొని బయలుదేరవలసి వచ్చినది. చిన్నచిన్న సామంతులు రాజులైనారు. వారికి తాము చక్రవర్తులమనెడి యహంకారము పెరిగినది. విషయలాలసులై ప్రజాపరిపాలన మందలి కాంక్షకంటె బహుకాంతా పాలన మందలి ప్రీతి హెచ్చినది. వీరి ప్రాపుగోరిన కవులు వారి చిత్తవృత్తుల ననుసరించియే మెలగివలసి వచ్చినది. అందుచేతి పదునారు పదునేడు శతాబ్దములలో సాహిత్యము జుగుప్సావహమగు కేవల శృంగార వస్తు చిత్రణముతో నిండిపోయినది. ప్రబంధమే దిక్కూచియగుటచే గతానుగతికమై పేలవమై పోయినది కవిత. అనుకరణానుసరణములు హెచ్చెనవి. ఈ విధముగా నాంధ్రరాజ్య వైభవముతో సాహిత్య వైభవ మడుగంటినది.

## చెప్పుకొనదగిన అంశములు.

కాని నాయకరాజుల కాలములో చెప్పుకొనదగిన అంశము లేకపోలేదు. దేశికవిత కాదరణము మరల రగులుకొన్నది. సంగీత నాట్యముల కాస్థానములో నధిక గౌరవము లభించినది. ప్రజలమీద దృష్టిమరలినది. జాతీయమైన రూపకప్రక్రియకు దోహద మీయబడినది. యక్షగానములు విరివిగా రచింపబడి ప్రదర్శింపబడినవి. వ్యావహారిక భాష యుపాదేయమైనది. రఘునాథరాయల పరిపాలనా కాలమునకు కృష్ణరాయల పరిపాలనాకాల ముపమానమగును. ఆతడు సంగీతమును ప్రోత్సహించి పదసాహిత్య పోషకుడై ప్రసిద్ధినొందినాడు. ఆంధ్రులు గర్వింపదగిన క్షేత్రయ్యపదములు, త్యాగరాజు కీర్తనము లాకాలమునకు చెందినవే. వాని ననుసరించి తర్వాత దీక్షితులు, శ్యామశాస్త్రి మున్నగువా రనేకులు కీర్తనలను, పదములను, రచించినారు. శృంగార భక్తిపరముగా నీవిధమైన కవిత రచింపబడి ప్రజలను మురిపించి సంస్కరించునదై వరలినది. నాయక యుగములో ప్రజలకు విషయ

బోధ సులభముగా చేయుటకు పద్యముకన్న వచనమే అనుకూలమైన ప్రక్రియగా కనిపెట్టినారు. వచనములోనున్న అన్వయ సౌలభ్యము పద్యములో నుండదుగదా! అందుచే రాయవాచక కర్త కళువె వీరరాజు, సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు, విజయరంగ చొక్క నాథుడు మొదలైనవారు వచన రచనకు పూనుకొని ప్రజాసేవ చేసినారు. ఈవిధముగా సాహిత్యమును ప్రజలకు సమీపములో నుంచి వారిని విజ్ఞానవంతులుగా చేయుటకు ప్రయత్నము లాకాలమందు జరిగినవి.

## ఆంగ్లసాహిత్య ప్రభావము - నూతన ప్రక్రియలు:

తరువాత బ్రిటిషు పరిపాలనా ఫలితముగా నాంగ్లభాషా సాహిత్యముల ప్రభావము మనపై బడినది. పందొమ్మిదవ శతాబ్ది మధ్యకాలములో నిది మిక్కుటమైనది. సంఘములో, మతములో, సాహిత్యములో మార్పువచ్చినది. 'క్రొత్తయొక వింత ప్రాతయొక రోత' అన్నట్లుగా కొంతకాలము మనవారా మోహాంబుధిలో తల మునకలువేసి మన సార్థక్యమును విస్మరించినారు. మనకుగలిగిన మేలునే యెంచుకొందము. ఆంగ్లసాహిత్యములో మనకులేని నూత్న ప్రక్రియలకు మురిసిపోయి మనసాహితీసేవకు లట్టివి రచించుట మొద లిడినారు. 'నవల' 'ఉపన్యాసము', 'ప్రహసనము', 'విమర్శ' 'వ్యాసము', 'స్వీయచరిత్ర' మొదలైన వచన ప్రక్రియల నవతరింప జేసి శ్రీవీరేశలింగముపంతు లాధునిక యుగకర్తలైనారు. తాను సంఘ సంస్కర్తయై స్త్రీ జనోపయోగార్థ మనేక రచనల సాగించినాడు. దీనిని పురస్కరించుకొని తరువాత అనేకులు స్త్రీలకు పాటలు, కథలు వ్రాయుచువచ్చి సులభశైలిలో నాంధ్రజాతీయ జీవనమును పాతివ్రత్య ధర్మమును ప్రబోధించినారు. వీరేశలింగముపంతు లవతరింపజేసిన నూతన ప్రక్రియలలో తర్వాత నెందరెందరో కృషిసల్పుచు వచ్చి నారు. కాని నేటికి ఒక్కదానిలో నైనను పరిణతి పొందలేదు.

వీరేశలింగము పంతులు గద్యశైలీసౌలభ్య కల్పనమునకై చేసిన పరిశ్రమనే తిరుపతి వెంకటకవులు పద్యశైలీసౌలభ్య కల్పనమునకై యొనర్చినారు. వీరి ప్రభావము యావదాంధ్రదేశముపై బడినది.

## భావకవిత్వము.

1910 ప్రాంతమున కాంగ్లసాహిత్యములోని 'రోమాన్‌టిక్' కవిత మనవారి నాకర్షించినది. ఆ విధమైన ప్రత్యేకభావకవిత 1 మన కంతవరకు లేదని యువవిద్యార్థులు గమనించినారు. వారికి వయస్సు వాతావరణము లనుకూలించినవి. ప్రేయసి, కోకిల, ప్రకృతి నవ్య కవితా ముఖ్యసామాగ్రిలో చేర్చినారు. దీనిని అభినవకవిత్వ మని నారు. శ్రీ రాయప్రోలువారు వరుసగా నావిధమైన కావ్యాలు ప్రచు రించినారు. సంఘ సంస్కారమును, చుక్కానిగా పెట్టుకొని శ్రీ గురుజాడకవి మాత్రాచ్ఛందస్సులో కవితారచన సాగించినాడు. పతితోద్ధరణము సూత్రముగా గ్రహించి పల్లీయులను నాయికా నాయ కులుగా గ్రహించి నండూరివారు 'ఎంకిపాటలు' రచించినారు. పూర్వ మార్గమును వదలి, నవీన మార్గమందు విశ్వాసములేని కొందరిని బౌద్ధవాఙ్మయమందలి సత్యాహింస లాకర్షించి కవితావస్తువు లైనవి. సౌందరనందాదు లట్టి రచనలే. దీనినంతటిని అప్పటిలో భావకవిత్వ మనినారు. ఇది మొదట కొంతకాలము దూషణమునకు గురియైనది; కాని తరువాత నిలువద్రొక్కుకొనినది.

## వ్యావహారిక భాషావాదము

ఈ కాలమునకే శ్రీ గిడుగు రామమూర్తి పంతులువారి వ్యావ హారిక భాషావాదము ప్రచారములో నున్నది. మన సాహిత్యములో వచనబీజ మంకురించి పెరిగి పెద్దదై కొలది యాలంకారికశైలి పుణికి పుచ్చుకొనుచు వచ్చినది. వ్యాకరణముపై నక్కరలేని మోజుపెట్టుకొని పాండిత్యము నంతయు దీర్ఘ జటిల సమాసములలో ప్రదర్శించి కొందరు వచనమును దురవగాహ మొనర్చినారు. అది కృతకభాషయై

పోయినది. పద్యమును వదలి వచనమును గ్రహించిన హేతువును విస్మరించినారు. ఈసత్యమును దర్శించి శ్రీ గిడుగువారు భాషావాదమును లేవదీసినారు. ఆంధ్రసాహిత్యపరిషత్తు దీనిపడికొనినది. రామమూర్తిపంతులు శత్రుకోటి నెదుర్కొనినాడు. ప్రజామోదము, నవ్యకవుల అనుసరణమునుబడసి విజయుడైనాడు. దీనికి నిదర్శనముగా నేడు వ్యావహారికభాష దేశమంతట చక్కని వ్యాప్తిలోనున్నది. పై రాయప్రోలు, గురజాడ, గిడుగుల ఉపజ్ఞకమైన భాషాభావ సంస్కరణ ప్రచారము చేయుటకై సాహితీసమితి పుట్టి, పత్రికను స్థాపించి మిక్కిలి సేవచేసినది. తత్పరిణామముగా వచ్చిన సాహిత్య ప్రక్రియలగు ఖండకావ్య కథానికా ఏకాంకికాదులకు సాహితీపత్రిక దోహద మొసగినది. తర్వాత 'ప్రతిభ' పుట్టిఆపనిని నిర్వర్తించుచున్నది; ఇది యంతయు నవ్యసాహిత్యమను పేర నేడు పరగుచున్నది.

## పరిశోధనము–చారిత్రకవిమర్శ.

1912 ప్రాంతమునకే ప్రజలందు విజ్ఞాన వ్యాప్తికై శ్రీకొమర్రాజు లక్ష్మణరావు పంతులవారు పాటుపడుచుండిరి. ఆంగ్ల సాహిత్యములో పరిశోధనము, విమర్శ లత్యంతముగా పెరిగినవి. ఏభాషా సాహిత్యమునకైన నివిలేనిదే ప్రశస్తిలేదు. ఈసత్యమును దర్శించి పంతులుగా రావిధమైన కృషిచేయ నారంభించినారు. చారిత్రక విమర్శకు మార్గదర్శియైనారు. తర్వాత కట్టమంచివారు సాహిత్య విమర్శనమునకు బీజావాపముచేసి తమ ఉపాయనము నొసంగినారు. ఇట్లే సాహిత్య చరిత్రలుకూడ వెలసినవి. ఈవిధమైన విమర్శన సారస్వతము మన కీనాటికిని విరివిగా పెరుగలేదు. అక్కడక్కడ చిన్న చిన్న యత్నములు జరుగుచున్నవి కాని యేకముఖముగా కొనసాగుచు నిర్మాణ పరిణతి నందుటలేదు. ఈకాలముననే విశ్వదాతగారు ఆంధ్ర పత్రిక స్థాపించి విజ్ఞానవ్యాప్తికి కారకులైనారు.

గత యుద్ధానంతరము మనకు ప్రత్యేక విశ్వవిద్యాలయము వచ్చినది, కాని రాష్ట్రము రాలేదు. ఇది ప్రజలలో చాల నిరుత్సాహ

మునకు కారణమైనది. ప్రజల హృదయాలలో నంతకుముందే యాంధ్రోద్యమము బాగుగా పాదుగొన్నది. ఉపన్యాసములద్వారా ఉద్బోధ చేయుట యాచారమైనది. ప్రాచీనాంధ్ర వైభవమును త్రవ్వి పోయు ప్రబోధ పద్యములు రచింపబడినవి. ఆనాటివే—

'అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు'.

మొదలైన రాయప్రోలువారి పద్యములు. కాని 1921 లో అసహాయోద్యమము వచ్చి దేశమంతట వ్యాప్తమైనది. అందులో మన రాష్ట్రోద్యమము లీనమైపోయినది. జాతీయ గీతము లనేకములు వచ్చినవి. వానిని రచించినవారిలో శ్రీ గరిమెళ్ళవారు ముఖ్యులు. ప్రజాప్రబోధమునకు ఆంధ్రరత్న మొదలైనవక్తలు పాటుపడినారు. ఈవిధమున ప్రబోధ వాఙ్మయము పెరిగినది. నేటికిని ఆంధ్రరాష్ట్రగీతము విన్పించుచునే యున్నది. కొడాలివారి 'హంపీక్షేత్రము', విశ్వనాథవారి 'ఆంధ్రప్రశస్తి', తుమ్మలవారి 'రాష్ట్రగానము' మొదలైన విందుల కుదాహరణములు.

ఇట్లుండగా యుద్ధానంతరము యూరపు సాహిత్యము మన దేశమునకు దిగుమతి యయ్యెను; తత్పరిణామముగా శ్రీ శ్రీ గారి 'అతివాస్తవికత' అంకురించినది. ఈమార్గమిపుడంత ప్రజల ప్రచారములో లేదు.

## నేటి సాహిత్యస్థితి.

ఇంతలో రెండవ ప్రపంచయుద్ధము రానేవచ్చినది; దీనితో మనదేశమునకు దెబ్బతగులునను భయముహెచ్చినది. రష్యా యుద్ధప్రవేశము ప్రజాయుద్ధమను భావమంకురింప జేసినది. ఆత్మ ప్రణయపరమైన నవ్య సాహిత్యముపై తిరుగుబాటు పొసగినది. ప్రేయసిని, కోకిలను విడిచి మనదేశస్థితిని పర్యాలోచింపవలసిన కాలము వచ్చినది. ప్రభువు, పాలేరు సమానమను భావ మంకురించినది. దేశాభ్యుదయమే నేటిమన రచయితల పరమాయశమని గ్రహించినారు. ప్రజావాఙ్మయము కావలె

ననెడి యాకాంక్ష పొడమినది. రష్యా వాఙ్మయ సూత్రములాదర్శము లైనవి. అక్కడి సామ్యవాదము కృషి ఘనత్వ సిద్ధాంతములు మన దేశమున కనూదితములైనవి; కాని నియంతృత్వలేఖ లీలగా పొడ చూపుచున్నది. వీనికన్నిటికి ఫలితముగా "అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘము" స్థాపితమైనది. అన్నిభాషలలో నువసంఘము లేర్పడినవి. మనదేశములో వివిధ భాషాసాహిత్యముల నేకముఖముగా నడుపవలెనని వీరి కుతూహలము. వైమనస్యములులేక దేశస్థులంతా చెట్టపట్టాల్ పట్టుకొని నడవవలెనని వీరి సంకల్పము. ఆదర్శము లుత్తమములైనవే; కాని యాచరణములో బెట్టుటకు ప్రయత్నము లత్యంతముగా జరుగవలసియున్నవి.

## నూతనచైతన్యము.

ఆంధ్ర సాహితీలోకమున నేడు నూతన చైతన్యము కలిగిన దనక తప్పదు. దేశభాషాసేవకులను గుర్తించి వారిని గౌరవించుచు న్నారు. ఇది శుభసూచకము. ప్రజలలో సాహిత్యాభిరుచి, గ్రంథ పఠనాసక్తి యధికముగా నున్నవి. ఎచ్చట చూచినను సాహిత్య సమా వేశములు, కవి సమ్మానములు కన్నులపండువుగా జరుగు చున్నవి. ఎన్నెన్నియో ప్రచురణ సంఘములు, సారస్వతసమితులు పుట్టుచున్నవి గ్రంథ ప్రచురణ మత్యంతముగా జరుగుచున్నది. పత్రికలు హెచ్చినవి. తదనుగుణముగా రచయితలకు లెక్కయే లేకున్నది. ఈవిధముగా వాఙ్మయము విరివిగా పెరుగుచున్నది. ఏజాతిసంస్కృతియైన నాభాషా సాహిత్య ప్రచారము ద్వారా జరుగుచుండును. ప్రజలు తమ సాహి తీరోచిస్సులను ప్రజ్వలిత మొనర్చినచో జాత్యభ్యుదయకారకమగును. కావున జాత్యభ్యుదయకారక మగు సాహిత్య మీనాటి మనవాఙ్మయ ములో నెంత యున్నదో పరిశీలించుకొనవలసియున్నది.

## సాహిత్యార్చకుల కర్తవ్యము

ఈనాడు సాహితీపోషణము ప్రజలపై నెక్కుడుగా నాధార పడియున్నది. నేటి ప్రజలలో కేవల సాహిత్యాభిరుచి కలిగి నందు వలన ప్రయోజన మంతగా లేదు. ఉపన్యాసములను వినోదములుగా గ్రహించినచో నవి నిష్ప్రయోజనము లగును. "ఆంధ్రుల కనేకత్వ" మను ప్రవాద మొకటి మనపై నున్నది. దీనివలననే మన సంస్థలు, ఉద్యమములు వృద్ధినొందకున్నవి. వర్గవైమనస్యములు లేక సహృద యులై ప్రజలు సానుభూతితో తిలకించు దృష్టి నలవరచుకొనవలసి యున్నది. వివాదముల ఫలమును మనము రుచిచూచియేయున్నాము. కావున ప్రతి ఆంధ్రుడును విద్యావంతుడై, లోకకావ్యాద్యవేక్షణ ముతో వ్యుత్పన్నుడు కావలెను. తనజాతి భాషాసాహిత్య సంప్రదాయ ములను, పవిత్రముగా నెంచవలెను. సాహిత్యములో వివిధ మతము లను చారిత్రకదృష్టితో చూడవలెనే కాని పాక్షికదృష్టి పనికిరాదు.

ఉత్తమమైన మానవ జన్మము లభించినందులకు సద్వినియోగ మొనర్పవలెను. తదితర జీవులవలె గాక మానవున కాత్మభావ వ్యక్తీ కరణమునకు యోగ్యత యున్నది. అతనికి విజ్ఞాన సముపార్జనమునకు వలయుశక్తి బీజభూతముగా నున్నది. కాని మానవ జీవితము పరిమిత మైనది; విజ్ఞాన వంతమైనది. కాలముయొక్క విలువను గ్రహించి ప్రతిమానవుడు తనజాతి సార్థక్యమును తెలిసికొనుటకు సాహిత్యార్చ కుడుగా నధికారము సంపాదింపవలెను.

ఏది మానవలోకమునకు హితము బోధించుచు సార్వకాలికమై సార్వజనీనమై వర్తిలు. సాహిత్యమో, ఏది నిమిత్తప్రయోజనము కలదియై పరిమితావకాశములకల వాఙ్మయమో వివక్షించుకొనగల శక్తిగడించి అల్పమైన జీవితకాలములో సాహిత్యము నర్చించి యేనంత

రస గ్రంథుల సాధ్యమైనన్ని విప్పి యనుభవించుటకు ప్రయత్నింప వలెను. అధికారము లేనిదే రసజగత్తులో ప్రవేశము లభింపదు. ఈ లోకములో సుఖమును మోసములతోడను, లంచములతోడను పొందగలుగుదు మేమోకాని, కావ్యజగత్తులో నానంద మట్లు సులభ ముగా లభింపదు.

కావున ప్రతిఆంధ్రుడును తమసాంబుధినుండి తెప్పరిల్లి, కాలముయొక్క విలువను గుర్తించి, వ్యుత్పన్నుడై, ఉత్తమ సంస్కారియై స్వస్థాన వేషభాషాభిమానము కలిగి, సాహిత్యార్చనము చేసి ఆత్మ వికాసముపొంది తపస్విలి గావలెను. సాహిత్యార్చకులు తా మధి కారముచే మథించి దర్శించిన రసతత్వమును విమర్శలద్వారా తిరిగి లోకమున కందజేయవలెను. ఆంధ్రసాహిత్యములోని వెలుగుజిలుగు లను విప్పిచూపునట్టి గ్రంథములు నేడు విరివిగా రావలసియున్నవి. తాత్కాలిక ప్రయోజనమును దీర్చుకార్యములకన్న శాశ్వతముగా మన జాత్యభ్యుదయమును జాటుకార్యములలో ప్రజాసంస్థలు, సాహి త్యపరిషత్తులు పాటుపడవలెనని సవినయముగా మనవిచేయు చున్నాను. ఏనాడు ప్రతి ఆంధ్రుడట్టి కార్యాచరణమునకు దీక్షవహించి దానిని సాధించునో ఆనాడే తెలుగుజాతి సంపూర్ణావకాశమును పొంది సర్వాంగసుందరముగా విరాజిల్లును; అంధతమసము లడుగంటి జ్యోతి ర్లోకమునకు సుగమమైన మార్గమప్పుడుగాని యేర్పడదు. ఆ శుభప్రద మైన ముహూర్త మనతికాలములో రాగలదని విశ్వసింతును.

---

## 18 అజంతా లేఖ — శ్రీ కొణిదెన బాలకృష్ణయ్య

[ఈ 'అజంతా లేఖ' శ్రీ కొణిదెన బాలకృష్ణయ్యగారు రచించినది. వీరు నర్సరావుపేట, 'కొణిదెన' గ్రామ వాస్తవ్యులు. 'వసంతలేఖ'లను పేరిట ధ్వని ప్రధానములగు వీరి వ్యాసములు దాదాపు శతసంఖ్యగలవి, పదునైదు సంవత్సరముల క్రితము ఆంధ్ర వారపత్రిక సారస్వతానుబంధమున ప్రతివారము ప్రకటింపబడి పత్రికా పాఠకబృందము నలరించెను. వీరి రచనా విధానము సునిశిత హాస్య సమ్మిళితమై, వ్యంగ్యప్రధానమై, విమర్శనాత్మకమై యొప్పుచుండును.

'బొబ్బిలి బెబ్బులి', 'రాణీ దుర్గావతి', 'బ్రాహ్మణ యోధులు', 'శబరీ నిరీక్షణము' మొదలగు ఖండకావ్యములు, 'ఆంధ్ర రామాయణములు', 'ప్రవరుని హిమవద్గిరియాత్ర' 'మనుచరిత్ర రసచర్చ' 'రామరాజ భూషణుడు' అను విమర్శనలు, 'తారక ముక్తావళీ, సంకీర్తనకవుల చరిత్రము మొదలగునవి వీరి యితర కృతులు.]

నెచ్చెలీ!

ఆత్మీయులగు బంధుమిత్రుల వీడ్కోలుగైకొని ప్రయాణమై అయిదవనాటికి అజంతా ప్రాంతమునకు జేరి హాయిగ సంచారము ముగించుకొని వచ్చినారము.

నీ లేఖ౦ దిలకించితిని. సంతసించితిని. 'అజంతా' యాత్రగావించి, ఏనును మిత్రబృందమును మొన్నటియుదయ మిచటికి జేరితిమి. ఇంటికి జేరునప్పటికి బెక్కు తెఱంగులగు ప్రశ్నలతో గూడిన నీ యుత్తరము-మా పర్యటన విశేషములను గుఱించి తెలిసికొనదలంచి వ్రాసినది-వచ్చియున్నది: దానిగాంచి నాలో నేను నవ్వుకుంటిని. దర్శనీయతమములగు ప్రదేశములను వింతలను, ఆరసి నేత్రపర్వ మొనర్చుకొనుటకు బదినోళ్లేసరయు జీవితమున వెచ్చింప దలంపుగొనక సోమరివై, పయనము సాగింపక, పయనించు సన్నాహ మొనర్చుకొనుచుండిన మమ్ము జూచి యానాడు బరిహాసించితివి. నేడు నాల్క గొఱుకుకొనుచు బశ్చాత్తాప పడిన ప్రయోజన మిసుమంతయు గలుగునా? నీ యుత్తరము చేటభారతమంత యున్నది. దానికంతటికి సమాధానము లీయ

నుంకించిన నాలేఖయు నొక కంబరామాయణమంతయై, నీకు విసుకు బుట్టించునేమో ; అయినను నాయోపినంతవట్టు-తెలిసికొనినంత దనుక-సంగ్రహముగ నీకు నివేదింప దెంపుసేయుచున్నాడను.

గమ్యస్థానము అజంతా అయినందున మాసంచారమునకు అదియు నామకరణమైనది. ఈ లేఖకుగూడ నదియు అభిధానము. మార్గ మధ్యమున బెక్కు వక్కణముల విడిసితిమి. క్షేత్రముల సేవించితిమి. పుణ్య తరంగిణీ తరంగముల దేలుచు నోలలాడితిమి. మహాభక్తుల, పండితుల, కవిపుంగవుల యోధాగ్రేసరుల, పరహితాచరణాసక్తులగు విశ్వకుటుంబుల. జితేంద్రియులగు యోగి పుంగవుల దెలియవచ్చినంత వట్టు, దూరమనక, భారమనక, నిరసింపక. గాసికోర్చి డాసి చూచి ఆసదీర వినయవిధేయతలఁ బూజించి వారివారి యాశీర్వాదములను, మన్ననలను గాంచితిమి. "మే మాంధ్రదేశమువారము-యాత్రీకుల" మని దెలిసికొనినంతన నెల్లరును మమ్ము బ్రత్యేకాభిమాన పురస్సరముగ గౌరవించి యుపచరింప సాగిరి. విద్యారణ్యస్వామిని, ప్రతాపరుద్రుని కృష్ణరాయని, పతాపరుద్రుని ప్రధానిని, భద్రగిరి రామదాసును దేశోద్ధారకుని. దేశభక్తుని, ఆంధ్రరత్నమును, మంగళాద్రి నృసింహుని, బేరొక్కనియు, కృష్ణా గౌతమీ మహానదుల నెంచియు, నెల్లూరు,మచిలీ పట్టణము, విజయవాడ, మున్నగు నాంధ్రనగరముల వృత్తాంతముల దెలిసికొన దలచియు, ననేకు లనేక విధముల బ్రశ్నలపై బ్రశ్నలు వేయుచు, మాచే బ్రత్యుత్తరములు వడసిరి.

మా పయన మొకరకముగ సాగలేదు. కొంతవఱకు ధూమ శకటము, మఱి కొంతవట్టు మహీతైల సారయంత్ర (Motar) శకటము, ఇక గొంతదవ్వు అశ్వశకటము, ఆవలనేక వృషభశకటము, పదపడి విధి లేని యవసరముల ద్విచరణ శకటము-ఇటుల జరిగెను. ఈ శకటముల విషయమున నొక శంకనీకు తప్పక కలిగితీరును. అది ద్వితీయ శకట మును గుఱించి. ఆ పేరు నిన్న మొన్న మా పాఠశాలా పండితుడు నామ ధేయావధానులుగారు పెట్టిరి. దానినిర్వచనమిది. మహీతైలము (మంటి

నూనెయని దత్తమండలముల వాడుక) కిరోసిన్ ఆయిల్ (Kerosine Oil) దాని సారము పెట్రోలు (Petrol) నేలగనినుండి యుత్పత్తియైన నూనెనుండి తీయబడిన సారము గు పెట్రోలుతో నడుపబడు చున్నందున మోటారుబండిని, సాంస్కృతికము జేసి వారి తెరగున నిర్వచించి యున్నారు. శాస్త్ర సాంకేతిక నూతన పదనిఘంటు కర్తల కీయుదంత మెంతయేఁయు సంతసము గొల్పినటుల యిటీవల వారిని ప్రశంసించుచు వ్రాయుచున్నారు.

మార్గమున మనవాంధ్ర కోలాహల మింతంతగాదు ఒకడు కవిత్రయ భారత పద్యములెత్తిన నింకొకడు వర్తమానమున ప్రభుత్వాస్థాన కవులగు శ్రీ కృష్ణశాస్త్రిగారి భారత పద్యములు, అవి వినరాకుండ ఇంకొకఁడు కింకవీంద్ర ఘటాపంచాననుల భారతనాటక పద్యములు, ఒకడు పాల్కురికి వారి ద్విపదనాలపించిన మఱియొకడు చిన్నన్న ద్విపద, ఒకడు పోకిపాటలు మొదలిడిన నింకొకడు క్షేత్రయ్యపదములు, ఒకడు పలనాటికథ, ఒకడు బొబ్బిలిగాధ వేఱొకడు కాటమరాజు సుద్దులు. ఒకడు కవుల ప్రసంగము ఇంకొకడు నీరుల పొగడ్త – ఈ వడువున మహోల్లాసములగు ప్రసంగముల రంగురక్తిమలతో బొంగిపోవు నానందముతో జాములు విఘడియలుగ, యోజనములు గోష్పదముల పోలిక గడచెను.

వెంటతెచ్చుకున్న మాషచక్రములు, మధుర పదార్థములు పులియోగిరము, దధ్యన్నము, అన్నము, ఊరుగాయలు, మొదలగు వానితో మూడుదినములు పుచ్చితిమి. ఆవల నచట నచట ప్రాంతీయ భోజనమున దనియసాగితిమి. ఒక తల్లిబిడ్డలువోలి అందరము జేరి, ఏక పంక్తి నారగింపులు గావించితిమి. మాలో "నానా గోత్రైభ్యః" గల దని నీవెఱుగుదువు. కావున వివరింపనేల ? తుదకు హిమాచలరావు పంతులు, సూపశైలశాస్త్రులుగారును, నింటికిజని జందెములు మార్చి సాలిగ్రామ తీర్థము తీసికొనవచ్చునని, ఏకరాసిగతులై అందరతో విందారగించిరి. హెరహెచ్చెములు లేవు. హెచ్చుతగ్గులు పులిక్కి.

పొట్లచెట్టు వాలకము పూజ్యము. "ఏకమేవా అద్వితీయంబ్రహ్మ" అను లక్షణమునకు సూటియై మెలంగినారము. మా ప్రధానోపాధ్యాయు లా సౌభ్రాతృత్వము నారసి "ఈ విధమున నాంధ్రసంఘముండెనేని ముక్కాలు మూడుఘడియలలో బ్రిత్యేకాంధ్రరాష్ట్రము రాదా? ఆ భాగ్యమీ పలుతలల తెలుగులకు నెన్నటికేని రాగలదా?" అని విచారించిరి.

ఇది మా ప్రయాణవిషయము. సూత్రప్రాయముగ వ్రాయగలిగితి. అజంతా విషయములిక వివరింతును.

## అ జం త

ఆ పేరుగల గ్రామమొకటి దక్కను పీఠభూమియందున్నది. అది నిజాము ప్రభుత్వముయొక్క ఏల్బడిలోనిది. అజంతాకు చేరుటకు రెండు రైలుమార్గములు గలవు. ఒకటి ఔరంగాబాదు నుండియు, (మన్మాడు సికింద్రాబాదు రైలు) రెండవది చాలీస్ ద్వారాను (జి. ఐ. పి.) రైలు లైను. ఆ జనపద నామమునుబట్టియే యచటి పర్వతపంక్తికి 'అజంతాపర్వతము' లని పేరువచ్చినది. మఱియు నచటికిబోవ మోటారునడచుట కనుకూలించు రోడ్డుగూడ నిపుడు గలదు.

## ప్ర కృ తి శో భ.

'అజంతా'కు రెండుక్రోసులు దూరమున గొప్ప కొండలవరుస యున్నది. పరిసర ప్రదేశమంతయు భీకరారణ్యముచే నావరింపబడి క్రూరసత్వముల యారవముల బ్రతిధ్వనించు చుండెను. కొండలనుండి యెన్నియో సెలయేళ్ళుపుట్టి వానియందలినీరు జలజలమనుచు నేలకు దిగజారుచుండెను. అందందు విశాలములగు శాద్వల ప్రదేశము లున్నవి. తత్ప్రదేశముల సొగసుగుల్కు హరిణతండములు దూర్వాంకురాదికములు దినుచు చిత్రవిచిత్ర వర్తనముల చెంగనముల దీయుచు చెంగుచెంగున నెగురుచు జూడముచ్చటగ విహరించుచుండెను. తీరు

తీరులగు విహంగములు, అతిస్పష్టముగ నరచునవి కొన్ని, కలకలారవ
ములు చెవులకు విందుగొల్పునవి మఱికొన్ని. వాని వన్నెలు చిన్నెలు
కన్నులఁగన్న దిన్నఁగ దెలియును. మిన్నక నెన్నిచెప్పిన నంతగా
నెమ్మది కెక్కదని నా నమ్మకము. వింతవింతలగు మహావృక్షములు
వానివర్ణములయొక్క యాకృతులు, పిందెలు, కాయలు, పండ్లు, చూడ
రెండు కనులు జాలవు. మనోరంజకములగు పూదీవెలు, నలుదెసల గమ్మ
తావుల గ్రమ్మించుచు, లలితాతి లలితములై వికసించి లతాసమూహ
ముల చెలువలరు నలరులు; అలరుల మకరందమునాన నాసగొని
వ్రాలుచు లేచుచు తంబుర మీటినటుల ఝుంకృతు లొనర్చు నెలతేటి
తుటుములు; అందందు జల్లని తీయని తేటనీటితో నిండిన కొలంకులు,
వానియందు జెలువమరు కమలషండములు, తదంతర విహారమొనర్చు
జలవిహంగములు. చెలికాడా ! ఆహా ! అచటి ప్రకృతిసోయగము
నెంతని పోల్చి చెప్పగలను. ఇంత ఎందుకు ? ఆ ప్రదేశములయం దడుగిడిన
వెనువెంట మమ్మందఱ నద్భుతస్థితి యావేశించినది. సంభాషణలు
సన్నగిల్లెను. కూనరాగములగోల యణగెను. వాగ్వాదము లుడిగెను.
నిశ్శబ్దముగ బ్రతియొకరును ఆ దృశ్యముచే నాకర్షింపబడి అనిర్వాచ్య
మగు నానందరసమగ్నులమై లోలోన గ్రుక్కిళ్ళు మ్రింగి కొనుచుఁ
దద్రమణీయతకు ముగ్ధులమై నడయాడ సాగితిమి. ఇది యచటి ప్రకృతి
వైచిత్ర్యమునగల యసాధారణశక్తి విశేషము. ఆ యాటవిక వృక్ష
ముల, దీవెజొంపముల జొచ్చి మన యువకు లొనర్పసాగిన క్రీడా
విశేషముల గాంచి, "ఓరీ ! మీయాగడములు త్రేతాయుగమునాటి
వానరవీరుల మధువనవిహారమును దలపునకు దెచ్చుచున్నవిసుమీ !
అని సూపశైల శాస్త్రులవారు దలయూపి నగుచు నాహ్లాదమును
బ్రకటించిరి.

## పరిధానస్థానము.

సాంద్రారణ్యముచే నావృతమైయున్న యీ పర్వత శ్రేణియందు
ఒకటి "అజంతా" యనుచు బిలువ బడుచున్నది. అదియ 'అజంతా

పర్వతము.' దీనినుండి "వాఘుర్" యను చిన్న సెలయేఱు ప్రవహిం చుచున్నది. ఈ వంకకు ఉత్తరంపు టొడ్డున అజంతా గుహాలున్నవి. అజంతాగ్రామమున కీగుహాలు నాల్గుమైళ్ల దవ్వున నెలకొన్నవి. వింధ్యపర్వత కనుమ ద్వారము వీనిస్థానము. నెలవంక పోలిక గలిగిన రెండు వందలఏబది అడుగుల ఎత్తుగల కొండయందీ గుహాలు నిర్మితము లైనవి. "గుహాలు తూర్పునుండి పడమటికి ౬౦౦ గజములు వెడల్పున నున్నవి. ఇట్టి దుర్గమారణ్య మధ్యమునందు గుహాలును, వినోదము లును, చైత్యములును, కుడ్యములును" బౌద్ధమహాయుగమున కళా యోగ పట్టభద్రులగు శిల్పులచే సృష్టింపబడి వారి ప్రతిభను అనంత ముఖముల బ్రకటించుచున్నవి. అయ్యదియే అంజతావిహార ప్రదేశము.

## కనిపెట్టిన వారు ?

ఏనాం డే కళావిదగ్ధులచేనివి నిర్మింప బడినవియో! ఎచట నుండినవియో; వాని యునికికిగల రహస్యార్థమెయ్యదియో; అటు వంటి నిగూఢస్థలమున నిట్టి విశేషములు నిర్మింప గత మెద్దియో, భారతీయులెవ్వరికి దెలియకుండెను రానురాను అజంతా గాథా సం దర్భమే విస్మృతమైపోయెను. తద్విషయమున గాఢాంధకారమున బడి యున్న లోకమునకు క్రీ. శ. ౧౮౧౯ సంవత్సరమునందు యూరపి యను సైనికులు వీనియునికిని కనిపెట్టి లోకమునకు జాటిరి. ఏతద్వర్ణ నలు ౧౮౨౯ సంవత్సరమున రాయల్ ఏషియాటిక్ పత్రిక ప్రకటించి నది. క్రమముగ అజంతా విహారములు, అజంతా చిత్రములు, అజంతా శిల్పములు అను పేర్లతో దిగంతముల స్వీయప్రభావమువలన వ్యాప్తిజెంది ప్రపంచ చరిత్రమున భారతదేశమున కొక విశిష్టస్థాన మును సంపాదించి పెట్టినవి. వీనిని తొలుదొలుత గనిపెట్టి వ్యాపింప జేసిన కీర్తిగౌరవములు ఖండాంతరులకు జెంది వారికి గర్వకారణము లైనవి. మనకో.... .... .... ....? మనజడ భావమునకు, ఈలాటివే నిదర్శనములు.

## ప్రతిబింబములు, ప్రకటనలు.

౧౮౪౩ సంవత్సరమున సుప్రసిద్ధ శిల్పజ్ఞుడు జేమ్సుఫర్గూసర్ అను నతడు "హిందూస్థానము నందలి గుహావిహారము" లను వ్యాసమును బ్రకటించెను. అం దజంతాకు సంబంధించిన విషయములున్నవి. ఈస్టుఇండియా కంపెనీవారు మేజరుగిల్లు మూలమున 30 పెద్ద రంగుల చిత్రములను ౧౦౦ ఛాయాచిత్రములను ౧౮౮౫ సంవత్సరమున వీని నుండిసిద్ధముచేయించి అజంతావృత్తాంత మంతయు బ్రచురించిరి. ఇటుల బాశ్చాత్యులు, యీవిషయమునం దత్యంత శ్రద్ధబూని తమతమ విధుల నిర్వహించిరి. భారతీయులును, ముఖ్యముగ నిజాం ప్రభుత్వము వారును వర్తమానమున నీగుహావిహారముల బోషిదిసేయ మిగుల నభిమానము వహించి కర్తవ్యమును నెరవేర్చుచున్నారు. ఇపుడీ విషయము అక్షరజ్ఞులగు నాబాలగోపాలమునకు సుస్పష్ట మగునటుల సాహితీధురంధులు చిత్రకళావేత్తల తోడ్పాటున ప్రచురణములొనర్చుచున్నారు. ఈయుద్యమము స్తవార్హము. నిజాము ప్రభుత్వముగూడ నీవిషయమున గొల్లబోయినంత వాఙ్మయమును చిత్రపటములతో బ్రచురించి నానాటమిగుల యాదరమును బ్రకటించుచున్నది. "స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనమ్" అనిగదా; పూర్వపురాజులు శాసనములలో ఘోషించిరి. ఘోరగహన పరివృతములై దుర్గమప్రవేశ ప్రదేశములై యుణగారియున్న అజంతా విహార పరిసరములిపుడు ప్రవేశ యోగ్యములై, చక్కని బాటలు గలిగియున్నవి. రాకపోకలకు అనుకూల సౌకర్యము లేర్పడియున్నవి. యాతాయాత ప్రేక్షక సమూహమునకు జక్కని వసతులును గలవు.

## నిర్మాణ హేతువులు.

కారణములేని కార్యమును మూఢుడుగూడ నొనర్పడు. కార్య కారణముల కవినాభావ సంబంధము. అందుచేత అజంతాపర్వత కందరముల యందీ గుహాలయ నిర్మాణమునకు బ్రబలకారణము లుండి తీరవలెనని స్పష్టమగుచున్నది. స్థూలముగ జెప్పవలెనన్నచో, బౌద్ధ

మతమును జిరస్థాయిగ నొనర్చు పరిశుద్ధ సంకల్పమే యీ విహారాదిక సృష్టికి బీజహేతువై కార్యరూపమున బరిణమించెనని యనక దప్పదు. ఇది సత్యము. భారతదేశమున నెందుజూచినను బౌద్ధమత నిర్మాణము లన్నియు శిలామయములై నదీ, పర్వత దరీ. యాశ్రయములై నేడును గూపట్టుచున్నవి. తమ మత చిహ్నములు విజయ ధ్వజములువోలి యజరామరముగ నుండవలెనని బౌద్ధభిక్షుల కోర్కె. శిలా నిర్మితములు చెక్కుచెదరకుండగలవని వారి విశ్వాసము. మిత్రుడా! విమర్శించిచూడుము. శాశ్వతనిబంధనమై యుండగలదను భావమును వెల్లడింప వలయుపట్ల నేడును మనవారు "అది శిలాక్షర మువలె నున్నది" అనుచుందురు. మహారాజుల శాసనములు శిలాలిఖితములు. దేవతామూర్తులు శిలానిర్మితములు. ముఖ్యముగ శాశ్వతస్థాయి నభిలషించియు; ఏకాంత ప్రశాంతములును నిర్మలవాయు సంచార సమేతములును, తృణకాష్ఠ జల సమృద్ధియుతములును అగు స్థానముల బరిశోధించియు; బౌద్ధవిహారములు నెలకొల్పబడినవి. అట్టి వానియం దన్నిట అజంతాగుహాలు తలమానికములు. అజంతా యందలి బౌద్ధమత చిహ్నములయందు విపులార్థ వంతములగు పుణ్యగాధలెన్నో నిక్షిప్త మొనర్చి సృష్టిగా నర్పబడినవి. ఆయా వృత్తాంతము లామూలాగ్రముగ నాకళింపు చేసికొని చెప్పుటకు బోధారులగు బౌద్ధసిద్ధాంత వేత్తలే సమర్థులు. దైవదత్తమగు నాధ్యాత్మిక దృష్టిచే కళాభిజ్ఞులగు బౌద్ధకార్మికులు చూపర యుల్లములు పల్లవింప జేసి యాకర్షింపదగు వెలవున నీ శిల్పములను, చిత్రములను, దీర్చిదిద్ది, తమ మత ప్రచారాభివృద్ధి కిందుమూలమునదోడ్పడి మృతజీవులై యశశ్శరీరులై అవ్యక్తనాములై శతాబ్దముల తరబడి దేశీయుల పొగడ్తల నందుచున్నారు. "సుకుమార భావములు, సునిశితమగు గ్రహణశక్తి, సౌందర్యోపాసన, రూపకల్పన, నభూతో నభవిష్యతి యనదగు వర్తమాన నాగరకతా ప్రభావము, ఖండాంతర, మతాంతర, తత్వసాహిత్య కళాభిజ్ఞత గలిగియున్నా"మని యుత్సాహితలూగుచున్న నేటి మనకీ యజంతానిర్మాణములు ఆదర్శము లైనవని చెప్పవలసి

వచ్చినపుడు ఆనాటిశిల్పి. చిత్రకారుల మేధాశక్తికి, కళాశిల్పమునకు, ఈనాటి మన యపూర్వ బుద్ధికుశలతాదికములకు నెంతతారతమ్యము గలదు? వారి దలంచినపుడు మనకు స్థావ మెచటగలదో ఊహింపుము. కోపపడకు. ఉన్నమాట యన్నచో రోండిగాలిచినటు లుండునుగదా ! ఒక్కమనదేశమున గాదు. ప్రపంచమునం దెచటను నిట్టి యనన్య సామాన్య మూర్తివంతములగు చిత్రములుగాని శిల్పములుగాని లేవు లేవని తాయిగ్రుద్ది చెప్పవచ్చును. ఇవి మన మాటలుగావు. నేడు ప్రపంచ శాంతిస్థాపనాచార్య పీఠముల దమంతదాము స్థాపించుకొని యాక్రమించి లోకులను ప్రబోధించుచున్న పాశ్చాత్యదేశములవారి అభిప్రాయము. భారతదేశలక్ష్మికి బౌద్ధులు సమర్పించిన యమూల్య తేజోరేఖా సమంచితమగు భూషణరాజ మీయజంతా విహారమనిన దప్పుగాదు.

అజంతా విహారము రమారమి రెండువేల ఏండ్లనాటిదని-అనగా ౧౯౦౦ సంవత్సరములకు బూర్వపుదని-క్రీస్తుశకము మొదటి శతాబ్దమున బ్రారంభమై ఎనిమిదవ శతాబ్దమున ముగిసియుండునని - తజ్ఞుల యభిప్రాయము. వీనికి ఆనాటి బౌద్ధమతాభిమానముగల నరపాలుర యాదరాభిమానములు గలిగియుండెను. అశోకమహారాజు పంథా ననుసరించి మనమీ యూహను సత్యముగ దలంపదగును. ఆయనకు బూర్వ పరములయందుగల రాజులును బౌద్ధారామ విహారాదిక నిర్మాణలకు ఆధారభూతులై యుండిరి. వారిపోషణమున నిపుణులగు శిల్పులు, చిత్రకారులు, శాస్త్రకోవిదులు ఆయా నిర్మాణముల సృష్టించి మతాభివృద్ధియందు బాల్గొనిరి. వర్తమానమున గాశీ మున్నగు మహాక్షేత్రములయందు యాత్రికుల వసతులకై భక్తుల నివాసములకై మహారాజులెన్ని సత్రాదిక వసతులు గల్పించియుండలేదు. తద్విధమున నాకాలపు రాజులు, మతాభిమాన బద్ధచేతస్కులై బౌద్ధభిక్షులకు, తపస్వులకు ఏకాంత నివాసాభిలాషులకు యోగులకు అనుకూలములగు నీవిహారములు గల్పించి యంచిత యశోవిరాజమానులైరి. వీని నిర్మాణకాలమునూహాజన్యమేకాని యింతదనుక నిదమిత్థమని నిర్ణయముకాలేదు.

## అజంతా గుహలు.

క్రమముగ వృక్షావరణముల నధిగమించి చని వాఘుర సెల యేటి దరి ననుసరించిపోయి గుహా ప్రాంగణమునకు జని నిలుతుము. అచట అర్ధవలయాకారమున గుహావళి మనకు దృగ్గోచరమగును. ఇవి నానాకాలముల నొక్కే పాఠశాలకు జెందిన శిల్ప నిపుణులచే నొనర్పబడినవి కావని వాని పనితనమే తెలుపుచున్నది. ఆకృతులు, పరిమాణములు, శిల్పభేదములు, తీర్పులు వివిధము. ఆకాలపు మేటి శిల్పుల చేతులలో గండశిలలు నవనీత పిండములకంటె మృదులములై వారు అనుకొనినటుల సాగినునుపులు దేలినవి. గుహాలయందు మంట పములు, పంచపాళులు, అంతరాళములు, గర్భాలయములు గలవు. అడ్డదూలములు, వానియందు జెక్కబడిన లతలు, జివురులు, ఆకులు మొగ్గలు, పూవులు, పిందెలు, రెమ్మలు, రేఖలు, చక్రములు మొదలగు ననేక మనోజ్ఞములగు జిలుగు శిల్పములు గుహాలయందు గలిగి మన హృదయముల వశపరచుకొనును. పైనుండి అర్ధవలయాకృతిగ నిర్మింప బడి శిలాఫలకములు తాపటము జేయబడినటులు దోచు శిల్పకళా విన్యాసములు గల ముఖద్వారములు, వానికి భిన్నములగు శిల్పవిశేష ములు గల మధ్యద్వారములు అసదృశములు. స్థల భేదమునుబట్టి, మహాకవుల రచనములుబోలి ఔచిత్యమును పాటించి, తన్నిర్మాతలు ఆయా శిలాచిత్ర ఫలక సృష్టి చమత్కారములను ప్రదర్శించి మించిరి గర్భాలయమందుగల బుద్ధభగవానుని విగ్రహము దర్శనమాత్రమున దన్మయులజేయును. చెలికాడా! ఎంతని వివరింపగలను. అచటి శిల్పకళా విశేషములు చూడవలెను. బ్రహ్మానందము నందవలెను. ఈ గుహాలయందు వెలుపల లోపలకూడ నిట్టి శిల్ప విద్యాపరిణతియే గోచరించును. ఈ గుహావళిచే ప్రశస్తి వహించిన ప్రదేశమునకే విహారమని పేరు. ఈ గుహావళులే బౌద్ధ భిక్షుకుల తపోగృహములు. పవిత్ర ధ్యానమందిరములు. నిర్వికల్ప సమాధికనువగు పుణ్యగేహ ములు. పామరజన సమూహమునకు యాత్రాస్థలములు. శిల్పశాస్త్ర పరమావధి కాకరములు. బుద్ధ ప్రభావమునకు ప్రతిబింబములు.

ఒక విచిత్ర విషయముగలదు. ఒక గుహయందలి స్తంభము తల మీద నొక కురంగము మలువబడి యున్నది. తలయొకటి. నాలుగు మూలలనుండి నాలుగు మొండెములు దానికి కలిపి యమర్పబడినవి. ఎటునుండి చూచినను ఒక లేడి యాకృతి సుస్పష్టముగ జూపట్టును. అణుమాత్రము వ్యత్యయములేక ప్రత్యవయవమును సరిసమానముగ నొకదానితో నొకటి పొందికగ గల్పింపబడి మనోహరమై యున్నది. అనగా కురంగ చతుష్టయమున కొక్కటే మస్తకము. ఇది వింతలలో వింత. అజంతా గుహాలయ నిర్మాతలకు శిల్పులప్రమాన ప్రతిభా విశారదులు. వారి కళానైపుణ్యము వర్ణనాతీతము.

## చిత్రరువులు.

గుహాలయములు శిల్పకళానిలయములై ప్రకాశించుచుండ దదంతర్భాగ కుడ్యములు చిత్రకళా విజ్ఞాన సంపుటములై చూపఱ రా బిల్చుచు స్వాగత మొసంగుచున్నవి. వత్సర సహస్రములు నిండు చున్న ప్రాయమున నుండియు నందలి బొమ్మల రంగులు, సొగసులు మందహాసములు, వాల్చూపులు, ధ్యానముద్రలు, శృంగారములు, నగల బెడంగులు, నయనముల తళుకులు, కేశకురుల మెఱపులు, ఎంతచూచి నను తనివిదీఱని యొరపుచ జీవకళ లుట్టిపడ సొంపు సంపాదించుచున్న యవి. 'పంచాంగములు పోయిన నక్షత్రములు పోవునా?' భారతీయ సంస్కృతికి దర్పణములై, ప్రాచీన సంప్రదాయ సూత్ర పంక్తులు దెలుపు శాశ్వత ఫలకములై, విస్మృతికి వచ్చుచున్న భారతీయ మహిమా విశేష సంపదకు పెన్నిధులై, హైందవ జాతికి జీవగఱ్ఱయగు ఆధ్యాత్మిక తత్వమున కాశ్రయములై, జ్ఞానవిజ్ఞానభక్తి వైరాగ్యములు మూర్తీభవించినటుల శాంతము రూపొందినటుల, సాత్విక తేజో విశేషము బింబరూపముల వాలిచినటుల; నీ యజంతా చిత్రములు; భాసమానము లగుచున్నవి. సంకీర్ణ జీవనులమగు మనకు-స్వీయ సంస్కృతి నుజ్జగించిన మనకు- స్వస్వరూప జ్ఞానమున దూరమై యంధ తమసమున నణగారుచున్న మన సంఘమునకు,ఖండాంతర నాగ

రసతాభిరుచి మఱగి జడతాహంకాముల భజించుచున్న సంతానముచే నిండి క్రుంగి కృశించుచున్న భరతఖండమునకు; యీ చిత్రములు తొంటి వైభవమును స్మృతిపథమునకు దెచ్చుచున్నవి. మీమార్గ మిదియని చూపుచున్నవి. మీవాలక మిదియని చాటుచున్నవి. కనులు దెఱచి యిటుచూచి మిమ్ముమీరు తెలిసికొండని యుపదేశించు చున్నవి. నమానాధిక రహితమగు మీ సంప్రదాయమిది యని ఘోషించుచున్నవి. వేయేల? పచ్చడి పాత్రము దగ్గరనుండి మహా రాజాస్థానము దనుకను, నిరుపేదయొద్దనుండి కోటీశ్వరుని వఱకును, గృహస్థ జీవనమున, అధ్యాత్మికముగ, శృంగార విశేషమున, పూజా సమయమున, దర్బారున, ధ్యానమున, త్యాగమున, దాంపత్యమున, స్వామి భృత్య సందర్భమున. గురుశిష్యవిధానమున ఇంకా ఏవేవో.... విషయముల నెన్నెన్ని యవస్థలు, ఆకృతులు, రసవత్తర ఘట్టములు గలవో; చేష్టలు, భావములు, ముఖకవిళికలు, అవయవ విన్యాసములు గలిగి యుండదగునో; అవన్నియు నీ చిత్రముల ప్రస్ఫుటములు; తమ యుద్యమమున బౌద్ధులు పరమావధి గాంచిరి. కళను వృద్ధిజేసిరి. సంఘము నుద్ధరించిరి. ఉపజ్ఞయన నిట్టిది. శాంతిమూతయగు బుద్ధ భగ వానుని అనంతప్రేమరసలేశ మీవిహారమునకు జీవప్రాయము. చిత్రముల గొన్ని భగవానుని జాతకగాథల ప్రదర్శించుచున్నవి. కొన్ని బౌద్ధమ తేతి హాసాదికములగల గాథావృత్తముల వివరించుచున్నవి. జాతక కథలు బుద్ధదేవుని పూర్వపు జన్మములకు సంబంధించినవి. అందుచేత నానా భాగములగూర్చి చిత్రములు జిత్రించవలసి వచ్చిన పట్ల ఆ యా ప్రదే శములు, అచటి ప్రకృతి సంపద, మానవసంఘము, వారి యలంకార ములు, మున్నగునవి కల్పింపబడి యున్నవి. ప్రతి చిత్రము నందును భావము స్ఫుటముగ ప్రకాశించుచున్నది. మహాజనక జాతకము షడ్దంత జాతకము, లనునవి కొన్నిమాత్ర మిపుడీ చిత్రరూపమున ఉపలబ్ధమానమగుచున్నవి. కొన్ని భిన్నములైనవి. కొన్ని దృశ్యా దృశ్యములుగ నున్నవి. కొన్ని యెడల నడవ గోడలమీద నున్న విగ్రహము లతి సుందరములు.

చిత్రము లోకదానిని మించి యింకొకటి యున్నవి. అన్నిటికి దలమిగిలి యొక దివ్యసుందర విగ్రహము చూచువారి హృదయము నువ్వెత్తుగ హరించునట్లు లిఖింపబడియున్నది. ఆయాకృతి పద్మపాణి బోధి సత్త్వునిది. అదియొక దివ్యసుందరాకృతి. ఆకాలమునందిట్టి యాకృతులతో భారతీయు లుండిరేమో; ఆ ముఖవర్చస్సు, శాంత కరుణారసాలవాలములగు నిడువాలు అరమోడ్పు గన్నులు, వెడంద యురము దృఢములగు భుజములు, శిరమున గిరీటము, అజుత మణీ హారము గలిగి పద్మపాణిమూర్తి ప్రకాశించుచున్నది

## చిత్రకారులు.

రూపకల్పనమునందును, అలంకరణము లందును అజంతా చిత్రస్రష్టలు కడుంగడు నిపుణులు. చిత్రణము లిఖింప నుద్దేశించిన భావకల్పనమునకు ఆవశ్యకముగ వలయు సన్నాహమును ఇంచుకయు వదలి పోనీక నైసర్గికముగ చిత్రనిర్మాణముల దీర్ఘసమర్థులు. వారు దమ రంగుకుంచియల విన్యాసములచే గళాన్యాస పూర్వకముగ ప్రాణప్రతిష్ఠ లీ చిత్రములకు నొనర్చియుందురా? లేకున్న జీవకళ లుట్టిపడుచుండ అనేక శతాబ్దము లిట్టుల నిలచి యీ చిత్రములు భాసింపగలవా? చిత్రముల ప్రభావ మనంతమై యమోఘముగ సంఘాన్నత్యమును వెల్లడింపవలయునను పరిశుద్ధ సంకల్పముతో శిల్పులీ రచనములు గావించియుందురు. వారిసంకల్ప బలముననే నేడీ యజంతా చిత్రములు ఖండ ఖండాంతరముల గౌరవభాజనము లగుచున్నవి.

ఇది మత ప్రచార సంబంధమగు ప్రణాళిక యొక్క ఫక్కి-సంప్రదాయ సిద్ధముగూడను. శ్రీరామకోటిని చిత్రములుగ రామాయణ పాత్రముల రూపములతో లిఖించి వర్ణములలంది పూజించు భక్తాగ్రగణులు మనదేశమున గలరు. 'శ్రీరామ' అను మూడక్షరములే యూర్ధ్వతిర్యగ్గ్వలయ రేఖలుగ లిఖింపబడును. అట్టి చిత్రములయొక్క మార్పుచేత రామాయణ మంతయు ముగింపబడును. కావున

నాకాలపు బౌద్ధ శిల్పుల మూలమున మత ప్రచారములు శిల్పకళా విశేషమును సంఘాభివృద్ధి నిమిత్త ముపయోగించుకొనిరని యీ చిత్రములు చెప్పక చెప్పుచున్నయవి. ఎప్పుడును ఆవేశమున్నగాని మహాకార్యనిర్వహణము కానేరదు. అట్టి మతాభిమాన ఆవేశమే చిత్ర-శిల్పకళాభివృద్ధికి గారణమై, ప్రప్రథమమున అజంతా విహారనిర్మాణ కార్యరూపమున బరిణమించి చెలగుచున్నది. "ఇటుల గోడలమీద జిత్రింపబడిన రంగురంగుల మతప్రచారపు బొమ్మలకును. తోలుఅట్టలపై రంగులచేవ్రాసిన రూపములు గలిగిన బొమ్మలాటవారి చర్మచిత్రములకును సంబంధము లేవైనా ఉండునా? ఉన్నచో బూర్వమేది పరమేది?" అను సంశయము మన చరిత్ర పరిశోధక మండలివారిలో గొందరకు గల్గినది.

## బౌద్ధమత దేశసేవ.

భారత దేశ విజ్ఞానమునకు బౌద్ధమత మొనర్చినటుల లాతి మతములెవ్వియు దోహద మొనర్పలేదనవచ్చును. కరుణారసమూర్తి యగు గౌతమ బుద్ధుని ప్రాణిహితైకవర్తన మనన్యదుర్లభము ఆ యన ఘనుని త్యాగదీక్ష నిర్వ్యాజము. ఆయన ప్రేమ యనంతము. వ్రతము అస్ఖలితము. ధర్మస్వరూపమును అజ్ఞాన ప్రపంచమునకు బ్రత్యక్షముగ జూపిబోధించిన జ్ఞానప్రదాత. అతని మతతత్త్వమునందు, ప్రజాసేవ, దేశసేవ, కళాసేవ, అంతర్భూతము లైయున్నవి. అతని తత్త్వము సత్యాహింసలకు దావలము. కావున నెల్లరు దలధరించిరి, స్తుతించిరి. మొ్రొక్కిరి. ఉదయభాస్కర కిరణములు పడమటి దెసకు బ్రసరించుచుండ, బౌద్ధవేదాంతభాను మయూఖములు తూర్పు దిక్కునకు బ్రాకి తమోనివృత్తి నొనర్చుచున్నవి. కావుననే చీనా, జపాను దేశములవారికి సిద్ధాంతము లనుసరణీయములైనవి. అజంతా విహారము

మూలమున బశ్చిమ ఖండములవారు బౌద్ధకాలమునాటి హైందవ నాగరకతను దెలిసికొని మెచ్చి తలలాడించు చున్నారు. బుద్ధదేవుని ఆశీర్వాద బలముననే అజంతా చిత్రముల వర్ణమింతదనుక నిల్చియున్నది. ఆయీహేతువులను బట్టి భారత భూమికి బౌద్ధసంఘము గావించిన మహోపకృతి మఱువరాని దని స్పష్టపడుచున్నది. తమ కనువగు చోట్లనెల్ల ఆరామములు, విహారములు, స్తూపములు, చైత్యములు నిల్పి, చిత్తరువులు వ్రాయించి, బౌద్ధలు భారత చిత్రకళలకు-శిల్పములకు చిరకాల జీవత్వమును బ్రసాదించియున్నారు. ఈ కృషి బౌద్ధసంఘమునకు, భారతభూమికి నుభయతారకముగ స్థిరఫలముల సమకూర్చినది.

## చిత్రములయొక్క రంగులు.

చిత్తరువులు వ్రాయ నక్కరయగు రంగులు వారి కచటనే యున్నవి. సర్వసాధారమగు నల్లనిమసి, ఎఱ్ఱజిగురు, పచ్చజిగురు, వైడూర్యము ఉపయోగించిరి. మహారణ్యమగుట, కొండలుండుట, వలన నీ పదార్థములు సులభముగ లభించును. రాతిమీద ఊక, గోదు కలిపిన మట్టితో మొదట పూతపూసి, దానిమీద సున్నపు గచ్చు వేయబడినది. తరువాత దానిమీద రంగులతో రేఖలు, చుక్కలు లిఖించుచు మూలాకారమును జిత్రించి తదనంతరము వర్ణములు వేయుదురు. మొదట నీరంగులు గోడలకు, స్తంభములకుగూడ గలవు. కాని జీర్ణించుచున్నవి.

అజంతాకళ "Ajanta Art" అనుమార్గము వర్తమాన చిత్రకారులకు ఉపాదేయమైనది. తత్కళాకౌశలమునందు తీర్ణులై ఖ్యాతి నార్జించుటకు బుద్ధభగవాను డనుగ్రహించుగావుత. జిజ్ఞాసువులగు వారు అభ్యసించుటకు చిత్రకళాసంబంధి గురుకులములు స్థాపింపబడు

గావుత. శిష్యపరమాణువులు గురువుల కనుసన్నల మెలంగుచు వారి యనుగ్రహమున మేధాసంపద నార్జించి పేరుప్రతిష్ఠల నందెదరుగావుత. ఇది మదీయాకాంక్ష.

ఇది అచటి గాథలసంగ్రహము. మా విషయ మాదియందే ప్రస్తావింపబడినది. నీవు రానికొఱత యన్నిట గానవచ్చినది. రాబోవు వేసవి సెలవులయం దైనను నీవువెళ్ళి అజంతా చిత్రములను చిత్త మానందింప దర్శించి జన్మ కృతార్థత జేసికొందువని భావించెద. మా అజంతావిహార సందర్భ సంతోషసూచకముగా రేపటి కార్తికమున ధాత్రీపూజయు, సమారాధనమును జరుప దలంచినారము. నాటి కైనను దయసేయ ప్రార్థన.

చిత్తగింపుము.
ఇట్లు మిత్రుడు
వ సం తు డు.

[విజ్ఞానసర్వస్వ సంపుటమున విశ్వదాత కీ. శే. నాగేశ్వరరావు పంతులుగారి అజంతా విహార వ్యాసమున్నది. ఈ లేఖ అందందు దాని ననుసరించి వ్రాయబడినది. ఇందులకు కృతజ్ఞతా పూర్వకముగ లక్ష్మణరావు, నాగేశ్వరరావు పంతులుగార్లను మానసమున స్మరించి నమస్కరించుచున్నాను. కో. బా.]

# 19 ప్రాచీన భారతీయ సంగీతం

శ్రీ నటరాజ రామకృష్ణ

[ఈ వ్యాసమును వ్రాసినవారు శ్రీ నటరాజ రామకృష్ణగారు. వీరు భరతనాట్య సంప్రదాయమును బాగా గుర్తించిన ఆంధ్ర యువకులు. తంజావూరు నృత్యము, కత్తక్, కథకళి, మణిపూరు నృత్యములందు ప్రవీణులు. జావా, బాలీ, సిలోన్, కంబోడియా నృత్యములు చిరపరిచయములు. ఇంగ్లీషు, తెలుగు, హిందీ మొదలగు భాషలందు వ్యుత్పన్నులు. చిత్రలేఖనము, సంగీతమును కరగతములు.

ప్రస్తుతవ్యాసము వారి 'నృత్యాంజలి' అను గ్రంథమునుండి గ్రహింపబడినది.]

లలిత కళలన్నియు ప్రకృతి దృశ్యములలో నాట్యమాడుచున్నవి యని చెప్పవచ్చు. మండుచున్న యగ్నిజ్వాలలో మనం నృత్యం చూస్తున్నాము. పర్వతశ్రేణుల నుండి, పల్లపు ప్రదేశములకు జలజల ప్రవహించుచున్న సెలయేళ్ళలో మధుర సంగీతం వింటున్నాము. పిల్ల వాయువుల కల్లల్లాడుచున్న ఆకులు, బాగుగా పూచి కాడను విడిచి భూమిపై పడు పువ్వులరెక్కలు, పండుటాకులు, నయనానందకరముగా నృత్యంచేయుచున్నవి. పౌర్ణమినాడు సముద్రతీరాన ఇసుకతిన్నెలపై కూర్చున్నప్పుడు భయంకర ఘోషతో తరంగములు చేయు గంభీరనృత్యం మనం చూడగలము. పక్షుల ప్రియసంభాషణములో సంగీతము వినుచున్నాము. వసంతము నందు నెమళ్లు తమ ప్రియురాండ్ర నాకర్షించుటకు జేయు నంగచలనములో నాట్యకళ కనపడుచున్నది. మేఘగర్జనములో మృదంగవాద్యము, కోయిల కంఠస్వరము నందు మధుర మురళీనాదము బెబ్బులుల గర్జనలలో వీణాఝుంకారములు, మనకు వినబడుచున్నవి. వసంత ఋతువునందు ప్రభాత సమయమున ప్రకృతి, వివిధాలంకారములతో, చిత్రకారుడు చిత్రించిన సర్వాంగసుందరివలె మనముందు ప్రత్యక్షమగుచున్నది. చెట్ల లేతయాకుల మీదబడిన మంచుబిందువులు యౌవనవతి కుచములపై దళదళ

మెరయు ముత్యాల మాలవలె మనకు ప్రాతఃకాలమున దర్శన మిచ్చు చున్నవి. ఈవిధముగా ప్రకృతి నెచ్చట జూచినను, మనకు లలిత కళామయముగా గనబడుచున్నది.

ప్రకృతి సహజముగా, నభినయించుటయే, ప్రదర్శించుటయే, కళ. కళారాధకునివలన ప్రకృతి తన రమణీయతను ప్రపంచమునకు ప్రదర్శించుచున్నది. కళారాధకుడను దర్పణమునందు ప్రకృతి సహజ సౌందర్యము ప్రతిబింబించుచున్నది. సృష్టిరహస్యముల నర్థము జేసుకొనుటయే కళాపిపాసి యాదర్శము. ప్రకృతి సాయమున దన స్వయం కృషివలన దాని నర్థముజేసికొని ప్రవీణతను సంపాదించి ప్రకృతికి మెరుగులుదిద్ది, ప్రకృతిలోని లోటులను సవరించి, ప్రపంచమున కర్థ మగు విధమున సృష్టిలోని వివిధరహస్యములను ఆదర్శకళారాధకుడు ప్రదర్శించుచున్నాడు. సృష్టిరహస్యములు సామాన్య ప్రజానీకమున కతిసులభముగా నర్థమగుటకు వారు దాని నభ్యసించి మరల ప్రదర్శించు టకు వీలుగానుండుటకై కళావేత్తలు శాస్త్రరచనము జేసినారు.

వర్షాకాల మేఘగర్జనములే మన మృదంగ వాద్యమునకు జీవము. ప్రకృతిలోని వివిధనాదములే సంగీతశాస్త్రము. సృష్టిలోని జీవకోటి సంచలనమే నృత్యము. ప్రకృతిశోభయే చిత్రకళకు మాతృక. జవ్వనుల శృంగారచేష్టలే అభినయము.

కళ సజీవముగా నుండవలెనన్న గళారాధకుడు కళకు జీవమగు ప్రకృతి నారాధింపవలయును. కేవలము శాస్త్రపఠనముతో సంతృప్తి జెందక ప్రకృతిలో లీనము కావలెను. అప్పుడే కళ, (గీత వాద్య, నృత్య, చిత్రలేఖన, శిల్పములలో నేదైనను) శాశ్వతముగా, సజీవ ముగా నుండగలదు.

శ్లో॥ "గీతవాదిత్య నృత్యానాం త్రయం సంగీత ముచ్యతే."

గీత, వాద్య, నృత్యముల సమ్మేళనము సంగీత మనబడును. భారతీయ గానకళా చరిత్రమును మూడు యుగములుగా విభజింపవచ్చును.

1. వేదయుగము:—

ఈ యుగమునందు ప్రతి స్త్రీ, ప్రతిపురుషుడు విధిగా గానకళ నభ్యసించెడివారు. ప్రపంచమున కాధారమైన పంచభూతములను నృత్య గీతములలో నారాధించెడివారు. సంగీతకళ యిప్పటి మన సంఘమునందు వలె నే కొందరి సొత్తుగనో యుండక, ప్రతిమానవుని దైనిక కృత్యములలో నొకభాగమై యుండినది. ఇప్పటికిని యడవి జాతులలో (గోండులు, ఓరియనులు, సంతాలులు, ముండా, మొదలైన ద్రావిడులు) ప్రతియొక్కరును, సంగీతకళ నభ్యసించుచున్నారు. ఈ విధముగనే బాలీద్వీపపు ప్రజలలో గూడ, ప్రతిస్త్రీ, పురుషులు లలిత కళల నభ్యసించు సంప్రదాయ మిప్పటికిని గలదు.

2. శాస్త్రయుగము:—(స్వర్ణయుగము).

ఇది మనదేశ గానకళ చరిత్రలో చాల ముఖ్యమైన యుగము.

ఋగ్వేదమునుండి వాద్యమును, యజుర్వేదమునుండి యభినయమును సామవేదమునుండి గానమును, అధర్వణవేదమునుండి రసమును గ్రహించి పంచమవేదమనెడి 'భరతనాట్య' శాస్త్రమును బ్రహ్మ రచించినాడని ప్రతీతి. భరతనాట్య శాస్త్రమనగా; 'భ' యనగా భావము, 'ర' యనగా రాగము, 'త' యనగా తాళము. భావ, రాగ, తాళములతో గూడిన నాట్యమును గురించి తెలుపు శాస్త్రమని యర్థము. ఆ శాస్త్రమునే సంగ్రహించి, నందికేశ్వరుడు, ఇంద్రుని కోర్కెపై 'అభినయ దర్పణ' మను గ్రంథమును రచించెను. శివుడు, పార్వతి, తాండవ, లాస్య, నృత్య భేదములను నిరూపించిరి. విష్ణు; దత్తిలుడు, కోహాలుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, హనుమంతుడు, షణ్ముఖుడు, విఘ్నేశ్వరుడు, రావణుడు మొదలగువారు గానకళ నభ్యసించి సంగీత గ్రంథములను వ్రాసిరి. సప్తతాళ నిర్ణయము, రాగముల

సృష్టి యేయే రాగముల నేయే సమయములలో బాడవలయునో, యట్టి కాల నిర్ణయము నేర్పరచినారు. ప్రకృతిని బహు జాగరూకతతో బరిశీలించి, విమర్శించి, నాట్యకళ కుపయోగబడు దృష్టి, గ్రీవాది భేదములను గూర్చి వ్రాసినారు. ముద్రలకు గూడ చాలమటుకు లక్షణము లీ కాలమునందే పుట్టినవి. నృత్యమునకు బనికివచ్చు వాద్యములు (వీణ, మృదంగము, మురళి, మొదలైనవి) సృష్టింపబడినవి. గానకళ శాస్త్రరూపముదాల్చినదీ యుగములోనే.

తరువాత శ్రీకృష్ణుడు, అర్జునుడు, ఉషాకన్య, విక్రమాదిత్యుడు, హర్షుడు మొదలగు మహారాజులీ కళను పోషించినారు. శాకుంతలము వంటి గొప్పనాటకమును వ్రాసిన మహాకవి కాళిదాసు, మృచ్ఛకటికమును వ్రాసిన శూద్రకుడు నీ యుగమువారే. కాళిదాసుని కాలమున నృత్యకళ రెండు విధములుగ నుండినది.

నృత్యమును దైవికముగ నారాధించుటకు దేవళములలో దేవదాసీ లేర్పరుప బడినారు. వీరినృత్యమే "మార్గ" నృత్యము. తర్కము వేదాంతము, సంగీతకళ నభ్యసించి రాజదర్బారునందు దమ పాండిత్యమును బ్రదర్శించి ప్రభువుల గౌరవమునకు బాత్రులైన స్త్రీ కళారాధకులే "గణికలు." వీరి సంగీతమే "దేశి" సంగీతము.

ఈ యుగమందు ప్రతినాగరికుడు నీ కళ నభ్యసించినను, యీ కళయందు గృషిజేసి మంచి ప్రవీణతను సంపాదించుటకు సంఘము, ప్రత్యేకముగా నొక జాతి నేర్పరచినది. అదియే యిప్పటి కళావంతుల జాతి. ఈ కళావంతుల నృత్యములో ఛురిత, యౌవరిత, అని రెండు భేదములు కలిగినవి. శాస్త్రయుక్తముగా జేయునృత్యము 'ఛురిత' నృత్యము. శాస్త్రోదితముగా గాక, కేవలము పురుషుల హృదయములను రంజింపజేసి, వారిలోని పశుత్వమును తృప్తిపరచిన నృత్యమే 'యౌవరితము'. దీనికే 'కులటా' నృత్యమనియు బేరు. ఈ నృత్యమును మనవారు బహిష్కరించిరి. ఇట్టి ప్రదర్శనములు జూచిన బాపమనియు బుట్టగతు లుండవనియు శాసించినారు.

ఈ కాలమున భారతదేశము నందంతట సంస్కృతమునకే యెక్కువ ప్రాముఖ్య మిచ్చుటచే, కావ్యములు, పాటలు, పద్యములు, నాటకములు మొదలగు నవన్నియు సంస్కృతమునందే వ్రాయబడినవి. అందువలన దక్షిణోత్తర హిందూదేశమునందంతట సంగీత మొకేరీతిగ నుండెడిది. కాని యుగాంతరములో ప్రాంతీయ భాషకు ప్రాముఖ్యము హెచ్చినది. దక్షిణదేశములోని భాషలన్నిటిలో తెలుగతి మధురమైన దగుటచే సంగీత శాస్త్రజ్ఞు లాభాషలో వ్రాయుటకు మొదలు బెట్టిరి. ప్రతాపరుద్రుడు మొదలగు మహారాజుల కాలములో నృత్యమున కుపయోగపడు నట్టి పదవర్ణములు, తానవర్ణములు, స్వరజతులు, పదములు వ్రాయబడినవి. ఉత్తరదేశమున వ్రజభాషకు ప్రాముఖ్యము హెచ్చినది. ఆ భాషకు సరియగునట్లు స్వరముల నేర్పరచి, యారాగములకు గ్రొత్తపేర్లిచ్చి, యిప్పటి హిందూస్థాని సంగీతమును క్రమముగ, నుత్తరదేశీయులు రూపొందించినారు. ఈ విధముగ నుత్తర దక్షిణ దేశములలో సంగీత మేర్పడినది.

3. నవయుగము:—

ఈ యుగము మహమ్మదీయులు మనదేశముపై దండయాత్ర జేసినప్పటినుండియు ప్రారంభమగుచున్నది. క్రమక్రమముగ మనలోని యున్నతాశయము లొక్కొక్కటిగ నశించిపోయినవి. మనలోని పశుత్వమును సంతృప్తిబరచు కళనే మన మారాధించుటకు మొదలిడినాము. మన పూర్వులచే బహిష్కరింపబడిన 'కులటా' నృత్యమునే బోషించుటకు బూనుకొన్నాము; స్వచ్ఛమగుకళ యంత మొందినను, కళావంతుల జాతిమాత్రము మనకు మిగిలినది. దేవదాసీలు తమ కర్తవ్యమును మరచి, ప్రేమదాసీలుగాను, ధనదాసీలుగను తయారైనారు. కాని, యుత్తరహిందూస్థాన లలితకళ కీ యుగము చాలముఖ్యమైనది. మహమ్మదీయ నవాబుల కాలములోనే, ఇప్పటి ఉత్తరహిందూ

స్థానపు"కత్తకి" నృత్యమొక ప్రత్యేకకళగా వర్ధిల్లినది. 'ఖ్రోండిక్‌దిర్'
'యూలలియులల' మున్నగు శబ్దములతో తరాణలు వ్రాసిన అమీర్
ఖుస్రూ, తాన్‌సేనువంటి మహాగాయకులు హిందుస్థానీ సంగీతమును
మహోన్నతస్థితికి దెచ్చిరి. తబల, సితార, సారంగి, మొదలగు నూతన
వాయిద్యము లెన్నియో కనిపెట్టబడినవి. "కవాలీ" గీతములు పాడు
టయు నీకాలమునందే ప్రారంభ మైనది. అభినయమున కుపయోగపడు
నట్టి 'ఠుమ్రీలు' 'గజల్' 'టప్పా' మొదలగున వెన్నియో వ్రాయబడి
నవి. కాని దక్షిణదేశపు సంగీతము మాత్రము వింతరూపముదాల్చుచు
వచ్చినది. శాస్త్రమన నేమియో దెలియని వ్యక్తి తన పశులగాయుచు
నూదు మురళీగీతములోని మాధుర్యము, దినమంతయు జేలలో బని
జేసి సాయంత్ర మిండ్లకు బోవుచు బల్లెపడుచులు పాడునట్టి జానపద
గీతముల విన్నప్పటి యానందము మన కీశాస్త్రీయ సంగీతము వినునప్పుడు
గాని, నృత్య ప్రదర్శనములు జూచినప్పుడుగాని కలుగక గష్టపడెదము.
బృందావనములోని పదునారు వేల గొల్లపడుచులను, జ్ఞానశూన్య
మైన పశుపక్ష్యాది ప్రాణిసమూహము నానందపరవశులజేసి యాకర్షిం
చిన సంగీత మిదియేనా? అని సంశయించుదుము. చైతన్య రహితము
లైన రాళ్ళను సయితము గరగించెడి, నదుల నుప్పొంగ జేసెడి, చెట్ల
నూగులాడించెడి ఫణిరాజు నానందపారవశ్యమున నృత్యమాడించు
నట్టి "నాదము," త్రిమూర్తులనుగూడ బంధితులను జేయు, నా
నాదము, హృదయమున్న మానవుని యాకర్షించుట లేదన్న తన్నాదో
పాసకులలోనేదియో లోటుండి తీరవలెను.

మన గాయకులకు, వారు పాడుచున్న పాటలోని భావ
ముతో నవసరము లేదు. కేవలము స్వరమునకే ప్రాముఖ్య మివ్వ
బడుచున్నది. ఉదాహరణమునకు 'ఎందు దాగినాడో మారామ
చంద్రుడు'-అను కీర్తన బాడినప్పుడది తోడిరాగములో నపస్వరము

లేక నాదితాళముతో బాడుచున్నారో లేదో యన్నదానికే యెక్కువ ప్రాముఖ్య మిచ్చెదరుగాని, ఆ తోడిరాగములో నాది తాళమునకు సరిపోవునట్లు, పాటలోని భావము స్పష్టమగునట్లు నెవ్వరు ప్రయత్నించుటలేదు. అటులనే నృత్యప్రదర్శనములలోగూడ నేదైన నొక పదము నభినయించ వలసినప్పుడు కేవలము శాస్త్రమునకే (టెక్నిక్) ప్రాముఖ్య మీయబడుచున్నదిగాని, వారి భావప్రకటనము సహజముగా నున్నదాయను విషయముతో వారి కవసరములేదు. అనగా శాస్త్రమునకే యెక్కువ ప్రాముఖ్య మొసంగుచు ప్రకృతి యారాధనము బూర్తిగ మాసివేసినారు మన కళారాధకులు. ఇది యే మన దక్షిణదేశ కళారాధకులలోని గొప్పదోషము. కాని యుత్తర దేశీయులు మాత్రము చాలవరకిట్టి దోషమునకు గురికాలేదు. కనుకనే మన సంగీతములో విద్వత్తు యెక్కువగా నున్నను, ఉత్తర హిందూస్థానీ సంగీతము నందున్న మాధుర్యము, హాయి మన సంగీతమున చాల తక్కువ. కనుక కళారాధకుడు, కేవలము శాస్త్రపఠనముతో కాలవ్యయము జేయక, ప్రకృతిలో లీనమైననాడే శాశ్వతమును, సజీవమునైన కళను బ్రదర్శించగలడు. ఇది ప్రతికళారాధకుడు గమనించ వలసిన విషయము.

---

# లఘుటీక.

## 1. తెనుగు తల్లి.

1. దయార్ద్ర......స్ఫురణంబున–దయచే తడిసిన చంచలమైన నేత్రముల చివరిభాగము నందలి ప్రకాశము. 2. వార్ధృత–ఉదకముచే ధరింపబడిన; భద్రపీఠి–సింహాసనము; వీచీ–అలలు; సమావృత–ఆవరింపబడిన; గళిత–ప్రసరించిన; శీకర తుంపురులచే;సిక్త–తడుపబడిన; మండనము–అలంకారము; అజానుదీర్ఘ–మోకాలిపర్యంతము పొడవైన; అహార్యపంక్తి–పర్వత పంక్తి; లోలోర్మికా ఫేన చంక్రమణము–చంచలములైన తరంగములలోని నురుగుయొక్క దాటుట; హల్లీసకము–కోలాటము (స్త్రీలు గుండ్రముగా తిరుగుచుచేయు నృత్యము. 3. ప్రథిత–ప్రసిద్ధమైన; ప్రౌఢి–అతిశయము; పటిష్ఠము–సమర్థమైనది; తేజాకొల్పి–అతిశయింపజేసి; పరార్థితము–శ్రేష్ఠమగునట్లుగా; భూరిసంభారము–అతిశయించిన సమూహము; సునిశిత–అత్యంతము తీక్ష్ణమైన. 4. ఆనంద సంధాయకముగా–ఆనందము కూర్చునట్లుగా; సందీపకము–బాగాప్రకాశింపజేయునది; కళావధి–కళలయొక్క తుది భాగము. 5. ప్రాక్తన... శ్రీశిశుకమ్మ–ప్రాచీనమైన మంగళకరమగు సభ్యతాశోభయొక్క కన్యలు; పురాను భూతి నిర్దేశపథమ్ములన్––ప్రాచీన అనుభవమును సూచించు నట్టిమార్గములలో. 6. శతపత్రము–పద్మము; శబలము–చిత్రవర్ణము; శ్లథమానము–శిధిలమగునట్టి. 7. దురంతము–కష్టము; ఉడివోన్–నశించిపోవు నట్లు; అధరీకృతము–తిరస్కరింప బడినది; ప్రధనము–యుద్ధము.

## 2. అభియోగము.

1. పంబిన–అతిశయించిన; సమయము–ప్రతిజ్ఞ; ప్రతానము–సమూహము. 1. శుద్ధాంతరంగము–నిర్మలమైన మనస్సు: దుర్దమప్రతిభటులు – నశింపజేయుటకు శక్యముగాని శత్రువులు; పఱుపంగన్ – పడజేయగా; ఒకడుపఱచు – అవమానించు. 3. తగమైన–న్యాయమైన; వెడవలుకు–చిన్నమాట; 4. అస్పందిత వర్తనన్–అంతట ప్రసరించిన చరిత్రగల; తఱి–సమయము; 5. ఒడయుండు–ప్రభువు; దూఱదగున్–నిందింప దగును; పాడి–న్యాయము. 6. అక్కటికము–దయ; సత్త్వము–బలము; కుందు–వ్యథ; 8. సైరంధ్రి–(వ్యు) అంతఃపురమున పరిమళవస్తువులు సిద్ధముచేయునది; ప్రందుట–దుఃఖపడుట; విన్నదనంబు–దైన్యము. 9. ఘర్మవారి–చెమట; ఎలుగు–కంఠస్వరము. 10. తెఱగు–విధము; తెఱవ–స్త్రీ; సమయము–నియమము. ఉదగ్ర వృత్తిన్ – అతిశయించిన వ్యాపారము. 12. గఱువచందము – గౌరవవిధానము. 14. శైలూషి–నర్తకి. 15. కితవుడు–జూదరి; 16. జంత–గయ్యాళి; వైచియిడు–నిందపెట్టు. 17. శాఠ్యము–గడుసుదనము: ఉమ్మలించు–బాధపడు. 18. చెన్ను–అందము; ప్రస్వేదము–చెమట; వఱ్రొద్దు–ప్రవహించు.

## 3. పరాభవము.

1. సాఱుడు – బ్రాహ్మణుడు; పాపవర్జునా – పాపములు లేనివాడా. 2. వేదుఱు – కంపము; పఱచు – పరుగెత్తు; వాచఱచు – నోరుదెఱచి అడుగుట 4. శిబిరము–డేరా. 5. సురరాజ సుతుడు(వ్యు) దేవేంద్రుని కుమారుడు (అర్జునుడు) శోకయుత-దుఃఖముతో కూడిన; 6. పరాఙ్ముఖుడు–పెడముఖము గలవాడు. 8. భాసురుడు – ప్రకాశించువాడు; సందోహ–సమూహము; అసురకృత్యము – రాక్షసకార్యము. 9. ఉత్సేకము–అతిశయము. 10. విషణ్ణచిత్త–ఖేదము పొందిన మనస్సు; పొక్కుట–దుఃఖించుట. 11. శిఖి–అగ్ని. 14. నిర్వ్యళీకము–నిష్కపటము. 16. సంరంభము–తొందరపాటు. 17. అవ్యుడు–సాధువు; అతతాయి–దుర్మార్గుడు; బ్రహ్మబంధుడు–దుష్టబ్రాహ్మణుడు.

## 4. ఆగడము.

1. మాటపొందు–పలుకులోని చాతుర్యము; నాకాధినాయకుడు–దేవేంద్రుడు; అమరావతి–దేవేంద్రుని పట్టణము. 2. పాశి_వరుణుడు (వ్యు) పాశము ఆయుధముగా గలవాడు; అంతకుడు_యముడు; దిశాపట్టంబు గావించుట–దిగంబరము చేయుట; పూర్వ + ఆశా + అధీశ్వరుడు–తూర్పుదిక్కునకు ప్రభువు (దేవేంద్రుడు); వెన్నడించనుట–వెంబడించుట; ధనాధ్యక్షుడు–కుబేరుడు; విభాళించుట–తిప్పలు పెట్టుట. 4. లావు–బలము; పేర్మి–గొప్పదనము; అలవు–శౌర్యము. 5. మనుజ + అశనులు–మానవులు భోజనముగాగలవారు (రాక్షసులు) నమోవిశ్వసృజే–సృష్టికర్తకు నమస్కారము; కొట్టు–శూలము. 7. మఖ + అంశ + శ్రీలు–యజ్ఞ సంపదలు; సేసలువెట్టుట–తలబ్రాలు పోయుట: బేలదనము–మోసము. 8. దయ్యము (వి)–దైవము; చదురు–నేర్పు. 10. ఆటోపము–అతిశయము. 11. పరంపరాకము–యజ్ఞములోని పశువధ, 13. దగ–దప్పి; గడవసము–పెద్దకట్టె; చీరుట_పిలుచుట. 14. పరిభూతి–అవమానము. 15. చవులు–రుచులు. 17. వీడు_పట్టణము; నిషణ్ణులు–కూర్చున్నవారు. 18. అనుపూర్వితో–యథాక్రమముగా. 19. చూఱాడుట–దొంగిలించుట. 21. ఉద్గమనీయవస్త్రము–ఉదికినధోవతి; ఆషాఢ + రాంభద్వయము_మోదుగుదండము, వెదురుదండము; స్రుక్ + స్రువపాత్రలు–యజ్ఞమునందు హోమముచేయుట కుపయోగించు కొయ్యపాత్రలు; దారవయంత్రపీఠము–కొయ్యతో చేసిన పీఠము (వ్యాసపీఠము) ఏణ + ఉత్తరీయ + అజినము–జింకసంబంధమైన ఉత్తరీయముగానున్న చర్మము: రాంకవకంబళము–మృగరోమములతో నేసిన కంబళము.

## 5. కాలకౌశికుడు.

చెనటి విప్రునిరూపు–కుత్సిత బ్రాహ్మణుని రూపము. సెట్టి కొడుకులు–కోమటి కుమారులు. అక్కఱ గండడు–అవసరము దీర్చునట్టి దిట్టడు. వెక్కసంబున–మీదు

మిక్కిలి. ముట్టచిక్కిన వేళన్-పూర్తిగా తనకు లొంగిన సమయమందు. రట్టిడి-రాయిడికాడు. పత్రంబులు-దస్తావేజులు. కొనుట-వ్రాయించి పుచ్చుకొనుట. పుట్టువచ్చిన-అప్పులు చెల్లింపరాగా. కల్లపెనుపులు పెనచి-దొంగవడ్డీలు వేసిచుట్టి. తిరితీపులాడు-కొట్లాడు. మాయలాడు-మోసగాడు. కంబళి పురీషంబు-కంబళి కంటిన మలము (అసహ్యమయ్యును దొలగింప రానివాడు.) పటికిరింతల పిల్లిపట్టిన బొజ్జ-చలము పట్టిన పిల్లి పట్టుకొన్న మాంస ఖండము. జద్దకము-బలాత్కారముతో. వృద్ధి-వడ్డి. వారవృద్ధి-వారవారమునకు కట్టెడి వృద్ధి. కాలీచ జనుట-ఈచకాళ్ళతో నడచుట. కులుపీచు మీసములు-పీచువంటి నులిమీసములు. ఉల్లిగడ్డము-ఉల్లివంటి గడ్డము. బొరుసు-బుడిపి. అరవిదోవతి-కరలుపెట్టిన దోవతి. కరతిత్తి-గీతలు గీతలుగా నుండుచిన్న సంచి. నుసి-పుప్పి. పొస్తుకంపునకున్-పొస్తుకాయ కంపునకు. బొమ్మరాకాసులు-బ్రహ్మరాక్షసులు: సప్తకంబులన్-ఏడుగురిని బిలిచి పెట్టుశ్రాద్ధములందు. తృప్తాస్తగాన్-తృప్తుల మైతిమి యనునట్లుగా. పేర్పెడు-ఒకటి మీదనొకటి. కొట్టిక-ఊరు. మత్తికాడు-వెఱ్ఱివాడు. నాతన్-నోటియందు. క్రొవ్వలుకంగన్-క్రొవ్వుబైటికి దూకివచ్చునట్లు. గడిపోతు-అబోతు. పసుల జంగిలి-పశు సమూహము. వరవుడుక-దాసి.

## 6. మత్సరము.

1. వారిదపంక్తి-మేఘముల సమూహము. మెఱుంగుల పిండు-మెఱుపుల సమూహము. హెగ్గడి కత్తెలు-అంతఃపురపు కాపలా స్త్రీలు. 2. నెచ్చెలి పిండు-చెలికత్తెల సమూహము. జద్దలవారు-వేత్రహస్తులు. 5. చతురులు-నేర్పరులు. 6. అరయించుట-విచారము చేయించుట 9. పదకము-హారము నడుమనుండెడి రత్నపుబిళ్ల. మూడిచొచ్చి వాతవెళ్ళుట-పృష్ఠమునుండి ప్రవేశించి నోటిగుండవచ్చువాడు. తగవరి-న్యాయము చెప్పువాడు. 13. జుణుగుట-భయము మొదలగువానిచే ఒదిగి పోవుట. 17. నికటము-సమీపము.

## 7. పసిడితునకలు.

2. కవయుచూచుట-ఎదిరింపజూచుట. 3. వర్షము-సంవత్సర కాలము (నానా) వాన. 5. గోరిసెలు-గిట్టలు. 6 ముష్కరుడు-దుర్మార్గుడు 9. విభూతి-ఐశ్వర్యము.

## 8. వేంగిక్షేత్రము.

1. జగచ్ఛ్రేయసములు-ప్రపంచమునకు శుభము చేకూర్చునవి. జీవచ్ఛవులు-బ్రతికియు చచ్చినవారితో సమానమైనవారు. 4. స్మృత్యర్థము-ధర్మశాస్త్రమునందలి విషయము. దృగావృతము-దృష్టిలోతిరిగిన. ఝళతళించుట-చల్లనగుట. 8. కాశ్యపీఖండము-భూభాగము.

## 9. విద్యారణ్యులు.

2. స్వర్లోకము–స్వర్గము. 4. యశస్సృష్టి–కీర్తిని సృష్టించుకొనుట. 6. తెరల్చుట–పైకితీయుట. 12. ఆత్మవత్సర్వభూతాని–తనవలెనే తక్కిన అన్ని ప్రాణులను. 13. నుసియగుట–నాశనమగుట.

## 10. సానుభూతి.

1. ఘర్మబిందువులు–చెమటబొట్లు. నిజ+ఉత్తరీయాంచలము–తన కండువాతో విసరుట. 5. గహనాంతరాల–అరణ్యములయందు. త్రాసచంచలదృగంచలము–భయముచే కదలిన చూపులుగలది. కార్శ్యమ్ము–కృశించినది.

## 11. పరిచయము.

అనువారము–ప్రతిదినము. 4. బెహారి–వ్యాపారస్థుడు (రూపాం) బేహారి. 8. అబ్జబాంధవుడు–(వ్యు) పద్మములకు బంధువు, సూర్యుడు. ఉదరంభరిత–పొట్ట నింపుకొనుట. రజకరాజు–చాకలి. ఝరులు–ప్రవాహములు. ఆలవాలము–ఆధారము.

## 12. పరివర్తనము.

1. శిరమొగ్గుట–(జాతీ) లొంగుట. బూడిదపాలొనర్చుట–(జాతీ) నాశనము చేయుట. 2. చతురంగ సైన్యములు–రథ, గజ, అశ్వ, పదాతుల అను నాల్గురకముల సైన్యములు. 3. బుద్బుదము– నీటిబుడగ (క్షణకాలముమాత్రమే యుండునది.) 7. కాతరులు–భయపడిన వారు. పాలితులు–పరిపాలింపబడువారు.

## 13. స్వప్నవాసవదత్త.

వరవర్ణినీ......సంస్పర్శనములు–ఉత్తమస్త్రీయొక్క ఎడమప్రక్కయందలి, స్నేహముతోకూడుకొనిన స్పృశించుటలు. రహ...భాషణములు–రహస్యమగు, ప్రేమసంబంధమైన మనోహరములగు పరిహాసముతో గూడిన మాటలు. నూత్న...వీక్షణములు–క్రొత్తగా యెడబాటు వలనివ్యథచే కూడిన అమాయికములైన చూపులు. అంతికము–సమీపము. శిరోధార్యము–నెత్తిపైధరించదగినది. లావణ్యలహరి–సౌందర్యమనెడి ప్రవాహము. న్యాసము–తాకట్టు.

## 14. మిత్రభేదము.

సార్థవాహుడు–వర్తకుడు. జర–ముదుసలితనము. వేసడము–కంచరగాడిద. భారవాహులు–బరువును మోయువారు. కంచరము–బండి. అల్లులు–ఎద్దులు. బలకరము–కావలి. విలిచి–కొని. పుండరీకము–పెద్దపులి (నానా) కలువ. సలుగులు–ఏదు పందులు. కాసరములు–ఎనుబోతులు. ఋక్షములు–ఎలుగుగొడ్లు. పిపాసితము–దప్పికగొన్నది. కచ్ఛము–తీరము, ఉలివు–ధ్వని. గావము–ఊఘు. పరేంగితావగాహి–ఇతరుల మనస్సును గ్రహించువాడు. కర్తవ్యాంశము–చేయదగినపని. అనాకారితుడు–పిలువబడనివాడు. సరీసృపము–పాము. నిష్కాసితము–వెడలగొట్టబడినది. మొఱం

గుట-దాచిపెట్టుట. ప్రువ్వు-పురుగు. మత్కుణము-నల్లి. అవిమృశ్యకారి-ఆలోచనా హీనుడు. నీచాఃకలహమిచ్ఛన్తి సంధిమిచ్ఛన్తి సాధవః-నీచులు కలహమునుగోరుదురు మంచివారు స్నేహమును గోరుదురు. హర్యక్షము-సింహము. అహార్యము-పర్వతము. జీవన్ భద్రాణిపశ్యతి-బ్రదికినసుఖములు పొందును. సుహృద్భేదము-స్నేహితులమధ్య కలహము. కరము-మిక్కిలి (నానా) చెయ్యి; ఏనుగుతొండము.

## 15. అమరావతీస్తూపము.

అవతంసము-చెవియందు ధరించెడిఆభరణము. పరిణతములు-మార్పులు; అర్వాచీనము-ప్రస్తుతము లేక అధునికము. ప్రేషితుడు-పంపబడినవాడు, పరివర్తనము-మార్పు.

## 16. జగన్నాథ పండితుడు.

అధ్యయనముచేయుట-చదువుట. కావ్యమర్మజ్ఞుడు-కావ్యములలోని రహస్యములను దెలిసికొన్నవాడు. ఉపపదము--ఇంటిపేరు. పీయూషము-అమృతము. జగన్నాథుడు-పూరిలోని జగన్నాథస్వామి (భగవంతుడు). అష్టభాషాకవిత్వతక్షుడు-ఎనిమిది భాషలయందు కవిత్వము చెప్పగల సమర్థుడు. అందలము-పల్లకి. మననతరితీర్ణ విద్యార్ణవుడు-భావనామహిమచేత తరించిన విద్యయనెడి సముద్రము గలవాడు. ఛత్రచ్ఛాయ - గొడుగునీడ. ఆస్వాదించుట - రుచిచూచుట. కింవదంతి-అపవాదు. గ్రథించుట-గ్రంథముగా వ్రాయుట.

## 18. అజంతా లేఖ.

పర్యటనము-ప్రయాణము. అభిధానము-పేరు. పరహితాచరణసక్తులు-ఇతరులకు మేలుచేయుటయందు ఆసక్తికలవారు. గాసికోర్చుట-కష్టములు సహించుట. శకటము-బండి. మాషచక్రములు-గారెలు. పొరపొచ్చెములు-భేదాభిప్రాయములు. జనపదము-గ్రామము. శాద్వలప్రదేశము-పచ్చికబయలు. విహంగములు-పక్షులు. కుడ్యము (లు)-గోడ (లు). దరి-పొదరిల్లు. తృణ, కాష్ఠ, జలసమృద్ధియుతములు-గడ్డితోడను, కట్టెలతో, జలములతో కూడినట్టి. నభూతోనభవిష్యతి-వెనుక లేదు; ఇక యుండదు. కళాభిజ్ఞత-కళనుదెలిసికొనుట. మేధాశక్తి-ఊహింపగలిగిన మనశ్శక్తి బుద్ధికుశలత-మనస్సుయొక్క- నేర్పరితనము. తేజోరేఖాసమంచితము-ప్రకాశకిరణములతో బాగుగా కూడుకొనిన. తజ్ఞులు-తెలిసినవారు. పంథా-మార్గము. పరము-తరువాత. అధిగమించుట-దాటుట, గడచుట. గుహావళి-గుహలసమూహము. ఆకృతులు-ఆకారములు. కురంగము-లేడి. వ్యత్యయము-భేదము. దర్పణములు-అద్దములు. ఉజ్జగించుట-వదలిపెట్టుట. ఉపజ్ఞ-తెలివి. ఉపలబ్ధమానమగుట-దొరకుట. చిత్రస్రష్టలు-చిత్రములు సృజించినవారు. తిర్యక్-అడ్డము. అస్ఖలితము-చలించనిది. మయూఖములు-కిరణములు. తమోనివృత్తి-చీకటిని పోగొట్టుట. జిజ్ఞాసువులు-తెలసుకొనగోరువారు.



శ్రీ కలాస్ ప్రింటింగ్ వర్క్సు, గుంటూరు.

# వ్యాకరణము

## పారిభాషికములు

1) అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ లను అచ్చులందురు.

2) అచ్చులకే 'స్వరము'లనియు, 'ప్రాణము'లనియు నామాంతరములు కలవు.

3) 'క' మొదలుకొని 'ళ' వరకుగల అక్షరములకు హల్లులని పేరు.

4) అక్షరములకు 'వర్ణము'లనియు పేరు.

5) హల్లులకు 'వ్యంజనము'లనియు, 'ప్రాణము'లనియు పేర్లుగలవు.

6) హల్లులలో ప్రత్యేకముగా క,చ,ట,త,పలకు 'పరుషము'లని పేరు.

7) 'పరుషము'లనగా కఠినముగా పలుకునవి అని అర్థము,

8) అట్లే గ,జ,డ,ద,బ లకు 'సరళము'లని పేరు.

9) 'సరళము'లనగా సులభముగా పలుకునవి.

10) పరుషములు, సరళములు గాక మిగిలిన హల్లులకు 'స్థిరము'లని పేరు.

11) 'ర' కారమును 'రేఫ'మందురు.

12) 'ఱ' కారమును 'శకటరేఫ'మందురు.

13) ఒకేరకమగు హల్లుల కలయికను 'ద్విత్వ'మందురు.

ఉదా :- మ్మ,ప్ప,త్త,క్క మొదలగునవి.

14) అసమానమైన హల్లులకూడికను 'సంశ్లేష'మందురు.

ఉదా:- క్త, న్మ, ద్య మొదలగునవి

15) సంశ్లేషమునకే 'సంయుక్త'మనియు పేరు.

16) వ్యాకరణసూత్రమువలన పదమునందలి అక్షరము లోపించుటకు 'వర్ణలోప'మని పేరు.

17) అట్లే పదమునందున్న అక్షరములుగాక మఱియొక క్రొత్త యక్షరము వచ్చుటను 'ఆగమము' అందురు.

18) ఉన్న అక్షరమును పోగొట్టి మఱియొక అక్షరము ఆ స్థానమునందు చేరుట 'ఆదేశ'మందురు.

19) నామవాచకములకు చివరవచ్చు డు, ము వు లు మొదలగువానికి 'ప్రత్యయము' లనిపేరు.

20) సున్నను 'అనుస్వార'మందురు.

21) అనుస్వారమునకే 'పూర్ణబిందు'వనియు పేరు.

22) కు, టి, తి అను వర్ణములను 'ఔపవిభక్తికము'లందురు.

23) ఆ, ఈ, ఏ లను 'త్రికము'లందురు.

24) ఒక్క చిటికె కాలములో పలుకబడునట్టి వర్ణమునకు 'లఘువు' అని పేరు.

25) రెండు చిటికెల కాలములో పలుకబడు వర్ణమునకు 'గురువు' అని పేరు.

26) గురువుకన్న యెక్కువ కాలములో ఉచ్చరింపబడు వర్ణమునకు 'ప్లుతము' అని పేరు.

27) 'ఁ' కారమును 'ద్రుతము' అందురు.

28) ద్రుతము చివరగల పదమునకు 'ద్రుతప్రకృతికము'ని పేరు.

29) ద్రుతప్రకృతికములు గాని శబ్దములను 'కళలు' అందురు.

30) సంస్కృతమునకు ప్రాకృతమునకు సమానమగు భాషను 'తత్సమము' అందురు.

31) సంస్కృతము, ప్రాకృతములందుండి పుట్టిన భాషకు 'తద్భవము' అని పేరు.

32) త్రిలింగ దేశమునందుపయోగింపబడు భాషకు 'దేశ్యము' అని పేరు.

33) 'త్రిలింగ'మనగా శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము మధ్యనుండు ప్రదేశము.

34) దేశ్యమునకే 'త్రిలింగ'మనియు, 'తెలుగ'నియు, 'తెనుగ'నియు పేర్లు గలవు.

35) ఇతర దేశభాషలనుండి దేశ్యమునకు చేరిన పదములను 'అన్యదేశ్యము'లందురు.

36) వ్యాకరణమునకు విరుద్ధమైన భాషను 'గ్రామ్య'మందురు.

## సంధి ప్రకరణము

1) ఉకారసంధి — ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగును.
ఉదా - రాముడు + అతడు = రాముడతడు.

2) పూర్వపరస్వరములకు పరస్వరంబేకాదేశంబగుట సంధి యనంబడు.

3) సంధిలేనిచోట స్వరంబుకంటె పరంబయిన స్వరంబు పరంబగునపుడు యడాగమంబగు.

4) అకారసంధి :— అత్తున కచ్చు పరంబగునపుడు సంధి బహుళంబుగానగు.
ఉదా.- మేన + అత్త = మేనత్త, మేనయత్త

5) ఇకారసంధి :— ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగానగు.

6) అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఏమి, మఱి, కి, షష్ఠి మొదలగునవి ఏమ్యాదులు.

7) ఉదా:- ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి.
మఱి + ఏమి = మఱేమి, మఱియేమి.

19) సమాసంబునం బ్రాతాదుల దొలి యచ్చుమీది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

ఉదా:- ప్రాత + ఇల్లు = ప్రాతయిల్లు, ప్రాయిల్లు

లేత + దూడ = లేతదూడ, లేదూడ

20) ఆమ్రేడితము పరమగునపుడు, కడాదుల తొలి యచ్చుమీది వర్ణములకెల్ల అదంతమగు ద్విరుక్త టకారంబగు.

ఉదా:- కడ + కడ = కట్టకడ

పిడుగు + పిడుగు = పిట్టపిడుగు

బయలు + బయలు = బట్టబయలు

21) త్రికంబుమీది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

ఉదా:- ఆ + కాలము = అక్కాలము

ఈ + చోటు = ఇచ్చోటు

ఏ + కడ = ఎక్కడ, ఎకడ

## సంస్కృత సంధులు

1) సవర్ణదీర్ఘసంధి :— అ, ఇ, ఉ లకు సమానమగు వర్ణములు పరమైనచో దీర్ఘము వచ్చును.

ఉదా:- రామ + అనుజుడు = రామానుజుడు

కపి + ఈశుడు = కపీశుడు

గురు + ఉత్తముడు = గురూత్తముడు

2) గుణసంధి :— అ, ఆ లకు, ఇ, ఈ లు పరమైన 'ఏ' కారము, ఉ, ఊ లు పరమైన 'ఓ' కారము వచ్చును.

ఉదా:- దేవ + ఇంద్రుడు = దేవేంద్రుడు

మానవ + ఉత్తముడు = మానవోత్తముడు

3) వృద్ధిసంధి :— అ, ఆ లకు, ఏ, ఐ లు పరమైన 'ఐ' కారము, ఓ, ఔ లు పరమైన 'ఔ' కారము వచ్చును.

ఉదా:- తృతీయ + ఏకవచనము = తృతీయైకవచనము

పద + ఔచిత్యము = పదౌచిత్యము

4) యణాదేశసంధి :— ఇ, ఉ లకు అసమానమగు అచ్చులు పరమైన య, వ లు వచ్చును.

ఉదా:- అతి + అధికము = అత్యధికము

మధు + అరి = మధ్వరి

# ఛందః ప్రకరణము

1) పద్యముయొక్క మొదటిపాదమునందలి మొట్టమొదటి యక్షరమునకు 'యతి' యని పేరు.

2) పద్యమునందలి మొదటిపాదము రెండవయక్షరమునకు 'ప్రాసము' అని పేరు.

3) యతులు :

అచ్చులలో—అ ఆ ఐ ఔ లు, ఇ ఈ ఋ ౠ ఎ ఏ లు, ఉ ఊ ఒ ఓ లు యతిమైత్రిగల అక్షరములు

హల్లులలో—క ఖ గ ఘ లు, చ ఛ జ ఝ శ ష స హ లు, ట ఠ డ ఢ లు, త థ ద ధ లు, ప ఫ బ భ వ లు, ర ఱ ల ళ లు, ఙ ఞ న ణ లు, ల ళ డ లు, అ హ య లు యతి మైత్రిగల యక్షరములు.

గణములు :

గురు లఘు సమూహముచే వచ్చు పదమునకు గణము అని పేరు. ఛందశ్శాస్త్రమునందు గురువునకు 'గ' యనియు, లఘువునకు 'ల' యనియు గుర్తులు.

1) గగము—రెండు గురువులుగలది. ఉదా:- జే జే

2) గలము—(హగణము) మొదట గురువు తర్వాత లఘువుగలది.
ఉదా:- రామ

3) లలము—రెండును లఘువులుగా గలది. ఉదా:- రమ

4) లగము—మొదట లఘువు తర్వాత గురువును గలది. ఉదా:- హరీ

5) మగణము—మూడును గురువులే గలది. ఉదా:- శ్రీరామా

6) భగణము—మొదట గురువు పిదప రెండును లఘువులుగలది.
ఉదా:- రాముడు

7) జగణము—మొదట లఘువును పిదప గురువును తర్వాత లఘువును గలది.
ఉదా:- జవాబు

8) సగణము—మొదట రెండు లఘువులు తర్వాత నొక గురువును గలది.
ఉదా:- అతివా

9) నగణము—మూడును లఘువులు గలది. ఉదా:- వనము

10) యగణము — మొదట లఘువును, పిదప రెండును గురువులు గలది.

ఉదా:- మహాత్మా

11) రగణము — మొదట గురువును, తర్వాత లఘువును, మీద గురువును గలది.

ఉదా:- అంశజా

12) తగణము — మొదట రెండును గురువులును, పిదప లఘువును గలది.

ఉదా:- పోనాను

13) సూర్యగణములు — (1) నగణము (2) హగణము

ఇంద్రగణములు — (1) నగము (2) నలము (3) సలము (4) భగణము (5) రగణము (6) తగణము

4) ప్రాసము :

1) సమస్త సమవృత్తములకు ప్రథమపాద ద్వితీయాక్షరము ఏ హల్లు లేక హల్లులతో గూడుకొనియుండునో, తక్కిన మూడు పాదములయందలి ద్వితీయాక్షరములు నట్లే యుండవలయును.

2) ప్రాసాక్షరమునకు హల్లుప్రధానము. ఆ హల్లుపై యేఅచ్చునైన జేర్పవచ్చును.

3) ప్రాస పూర్వాక్షరనియమము:- ప్రతిపద్యమునందును ప్రథమాక్షరము గురు లఘువులలో నెద్దియో, తక్కిన యన్నిపాదములలోను నట్లే యుండవలయును.

5) పద్యలక్షణములు-లక్ష్యములు

1) శార్దూల విక్రీడితము:- దీనినే శార్దూలవృత్తమందురు. దీనికి నాల్గు పాదములుండును. ప్రతిపాదమునకు వరుసగా మ, స, జ, స, త, త, గ యను గణములుండును. ప్రతిపాదమునందలి 13-వ యక్షరము యతిస్థానము. ప్రాస నియమమున్నది.

ఉదా:- తోడన్ వచ్చి ఫలంబు లేనెకొని తెత్తున్ లే! చేదోడువా

2) మత్తేభవిక్రీడితము:- దీనినే మత్తేభవృత్తమందురు. దీనికిగూడ నాలుగు పాదములుండును. ప్రతిపాదమునకు వరుసగా స,భ,ర,న,మ,య,లగ యను గణములుండును. ప్రతిపాదమునందలి 14-వ యక్షరము యతిస్థానము. రెండవ అక్షరము ప్రాసాక్షరము.

ఉదా:- ఖరజిహ్వాసహితంబుగాగ వికృతాకారంబెదోకంటి, ముం

## విశేషాంశము

మత్తేభవృత్తపాదమునందలి మొదటి రెండు లఘువులును నొక గురువుగా మార్చినచో నది శార్దూలవృత్తపాదమగును. అట్లే శార్దూలమునందలి మొదటి గురువును రెండులఘువులుగా మార్చినచో నది మత్తేభవృత్తపాదమగును.

ఉదా:- ఆ బృందారక కోటి సర్వమును మా యాతఃపుర్దాపదా......

ఇది శార్దూలపాదము. దీనిలో మొదటి 'ఆ'యయు దానిని 'అట' యని మార్చినచో నది మత్తేభపాదముగా మారుటను గమనించునది. ఇట్లే మిగిలిన దానిని గూడ గ్రహించునది.

3) ఉత్పలమాల:- దీనికి నాలుగుపాదములుండును. ప్రతిపాదమునకు వరుసగా భ, ర, న, భ, భ, ర, వ యను గణములుండును. ప్రతిపాదమునందలి 10-వ అక్షరము యతిస్థానము.

ఉదా:- జీవధనమ్ము దక్కెనది, స్త్రీవగుటన్
వధియింపజూమ్ము, నీ

4) చంపకమాల:- దీనికిని నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునకు వరుసగా న, జ, భ, జ, జ, జ, ర యను గణములుండును. ప్రతి పాదమునందలి 11-వ యక్షరము యతిస్థానము. పాదద్వితీయాక్షరము ప్రాసము.

ఉదా:- పలికెదవేల యిట్లు బహుభాషల ? నూరక నీమకర్కశో

## విశేషాంశము

ఉత్పలమాలావృత్తములో పాదప్రథమాక్షరమైన గురువును రెండు లఘువులుగాజేసి, మిగిలినదట్లే యుంచినచో చంపకమాలావృత్తముగా మారును. అట్లే చంపకమాలయందలి మొదటి రెండు లఘువులను నొక గురువుగా మార్చి మిగిలిన పాదమంతయు నట్లే యుంచినచో నది ఉత్పలమాలగా మారును.

ఉదా:- పై నుదహరించిన 'పలికెదవేల' యను పద్యమునందలి మొదటి 'పలికె' యను దానిని 'పల్కె' యని మార్చి వ్రాసినచో ఆ పాదము ఉత్పలమాలావృత్తపాదముగా మారుటను గమనించునది.

5) సీసము:- దీనిలో ప్రతిపాదమునకు 6 ఇంద్రగణములు పిమ్మట 2 సూర్యగణములుండవలయును. 1, 3 గణముల ప్రథమాక్షరములకు 5, 7 గణముల ప్రథమాక్షరములకు యతి. ఇట్లు నాల్గుపాదములయిన వెనుక నొక గీత పద్యముగాని, ఆటవెలదిగాని యుండవలయును. ప్రాసమక్కరలేదు.

ఉదా:- సీ॥ లక్కయింటన్ భ్రాతలన్ గ్రుక్కి వారు ని
దగ్ధించిక్క, గాల్పరే రక్కసులును.

గీ॥ వికృతవేషులు, భీకరవిగ్రహులు, మ

6) తేటగీతి :- దీనికి నాల్గు పాదములుండును. ప్రతిపాదమునకు మొదట 1 సూర్యగణము తర్వాత 2 ఇంద్రగణములు, తర్వాత 2 సూర్య గణములుండును. 4-వ గణము మొదటి అక్షరము యతిస్థానము. ప్రాసము లేదు.

ఉదా.- వికృతవేషులు, భీకరవిగ్రహులు, మ

7) ఆటవెలది :- దీనికిగూడ నాల్గుపాదములుండును. 1, 3 పాదములకు 3 సూర్యగణములును, 2 ఇంద్రగణములును, 2, 4 పాదములకు 5 సూర్య గణములుండును. ప్రతి పాదమునందలి నాల్గవగణము ప్రథమాక్షరము యతి స్థానము. ప్రాసనియమము లేదు.

ఉదా:- కలమునందుకొన్న కవివరేణ్యులిమోల
తలులు పంచు శబ్దములవిధాన
నాటి శిల్పిచెంత నవనీతమునుబోలి
మెత్తదనముదాల్చె మేటిశిలలు.

8) కందపద్యము :-

(1) ఇందు 1, 3 పాదములకు మూడేసి గణములును, 2,4 పాదములకు ఐదేసి గణములునుండును.

(2) ప్రతిపాదములోనను ప్రాస ముండవలయును.

(3) 2, 4 పాదములలోని మొదటిగణము మొదటి యక్షరమునకును నాయాపాదములలోనే నాల్గవగణము మొదటియక్షరమునకును యతి నిల్పవలయును.

(4) 2, 4 పాదముల తుది యక్షరము గురువైయుండవలయును.

(5) ఇందు గగ, భ, జ, స, నల యను గణములుదప్ప వేరు గణములు వాడరాదు.

(6) పద్యము మొదటి గణమునుండి లెక్కించునపుడు బేసి సంఖ్య గల గణము 'జగణము'కా రాదు.

(7) 2, 4 పాదములలో మూడవగణము నలమో జగణమో అయి తీరవలయును.

ఉదా:- క॥ పరుషంబుకలిమి దొరతన
మరయమి యనునట్టి వీనియందొకడొకడే
పొరయించుననర్థము నా
బరగినచో నాల్గు జెప్పవలయునె చెప్పుమా.

9) ద్విపద :- దీనికి రెండు పాదములుండును. ప్రతిపాదమునకు 3 ఇంద్రగణములు, 1 సూర్యగణములుండును. మూడవగణము ప్రథమాక్షరము యతి. రెండేసి పాదముల కొక్కొక్క ప్రాసముచొప్పున నెన్ని పాదములనైన వ్రాయవచ్చును.

ఉదా:- సురపతి ద్వితయంబు సూర్యుడొక్కండు
విరమంబు రెంటిపై వెలయునొక్కటికి
క్షితిదగ నీరెంటిచేనొప్పు ద్విపద
మితిలేక చెప్పిన మేలండ్రు కవులు.